# మహర్షి దేవేంద్రనాథ ఠాకూర్

## స్వీయచరిత్రము.



బంగాలీ ఆంగ్ల గ్రంథములనుండి
భాషాంతరీకరణము.

మొక్కపాటి రామమూర్తి.



మొదటికూర్పు 300 ప్రతులు.



స్కేప్ అండ్ కంపెనీ,

కాకినాడ.

1922.

 [Price Rs. 2-8-0.

గాలికి పుట్టి, గాలిలో పెరిగి, గాలిలో నెగిరి పోవుచున్న నన్ను,

కన్న వారికన్న మిన్నగ, తన

అవ్యాజానురాగముతోను, అసమానమైత్రితోను

ప్రేమించి, ఆదరించి, ఉద్ధరించి, ఆశీర్వదించి,

నా జీవితమున కాదర్శమై, నా నేత్రముల కంజనమై,

భయానకతరంగసంక్షుభిత ప్రబలప్రవాహమున

గభీరతర ఝంఝామారుతములో కొట్టుకొని పోవుచుండిన

నాడు,

"భయమువలను! భయమువలదు! పొమ్ము, ముందుకుపొమ్ము!"*

అని దేవదూతవలె ఎలుగెత్తి హెచ్చరించి,

నా ఆత్మకు శాంతిని, చిత్తమునకు స్థైర్యమును పురికొల్పిన

గురువరుని షష్టిపూర్తి మహోత్సవమునకు,

కంటకమార్గములయందును, సంకటస్థితులయందును,

ఎక్కడెక్కడనో యెవ్వరునెరుగని ఏకాంతమునందు సంచరించుచున్న నేను

యాత్రికుడనై వచ్చి,

మాతృదేవతయొక్కయు, ఆచార్యదేవతయొక్కయు, పరమదైవముయొక్కయు

ఆశీర్వచన పరిభావమున నేనాంధ్రీకరించిన

మహర్షి దేవేంద్రనాథ ఠాకూర్ స్వీయచరిత్రమును

మహర్షి వెంకటరత్నము

నాయుడు గారి

విమల చరణకమలములకు

కానుకగా నర్పించుచున్నాడను.

రామమూర్తి

* 18 వ పేజి చూడుడు.

# ప్రవర్తారిక.



1917 వ సంవత్సరమున జనేవరి 20వ తేదినాడు మహర్షి దేవేంద్రినాథఠాకూర్ వార్షికోత్సవసందర్భమున, కాకినాడ బ్రాహ్మసమాజమునందు, ఉపాసనానంతరమున వేంకటరత్నమునాయుడుగారు ధర్మప్రసంగము కావించిరి. ప్రసంగవిషయము మహర్షి దేవేంద్రినాథఠాకూర్ జీవితము!. బోధించినది వేంకటరత్నమునాయుడుగారు! వినలేని బధిరులును, గ్రహింపలేని దీనులును ఉండరుగదా! నాడా ప్రసంగము నాలకించు భాగ్యము నాకు లభించెను. త్వరలోనే మహర్షి స్వీయచారిత్రము పఠించి, అత్యంత ఉత్సాహమును జెంది, నా ఆధ్యాత్మికాభావమును, పాండిత్యరాహిత్యమును సహితము గమనింపక గ్రంథము నాంధ్రీకరించుటకు పూనుకొంటిని. నాడు నాయుడుగారు చెప్పిన కథ యీసందర్భమున స్మరణకు వచ్చుచున్నది. నాయుడుగారు కళాశాలయందు బాలురకు షేక్స్పియర్ మహాకవి నాటకమునకు వ్యాఖ్యానము గావించుచుండగా నేడేండ్లబుడుత డొకడు వచ్చి, కొండొకతడవు బాలురతో గూర్చుండి, యింటికిపోయి, తండ్రితో, 'నాయుడుగారి షేక్స్పియర్ పాఠమును వింటిన'ని చెప్పెనట. మహర్షి స్వీయచారిత్రమును బంగాళీభాషనుండి శ్రీయుత సత్యేంద్రనాథఠాకూర్, శ్రీమతి ఇందిరాదేవివంటివారలు భాషాంతరీకరించి ఆంగ్లభాషా ప్రపంచమున కర్పించియుండగా, ఆంధ్రప్రపంచమునకాగ్రంథము నర్పించుటకు తగుదునని నేనును వచ్చితిని.

మహర్షి దేవేంద్రినాథఠాకూర్ జీవితరహస్యమును సంపూర్ణముగ గ్రహించితినని ఎంతమాత్రము జెప్పసాహసింపనుకాని, నాడు నాయుడుగారొసంగిన ధర్మప్రసంగదీపికాసహాయ్యమున, నాహ్రస్వదృష్టికింగూడ ఆజీవితమూలసూత్రము లొకింత గోచరములయ్యెనని

శోచెను. ఒకనాటిరాత్రి యిట్లు కల గాంచితిని. మాఘోత్సవమున పాల్గొనుటకు కలకత్తాకు యాత్రజేసితినట. కలకత్తా చేరగానే యొక దివ్యమందిరమును జూచితిని. వెలుపలకువచ్చుచున్న యొక పెద్ద మనుష్యు నుద్దేశించి, "అయ్యా, ఈరాజభవనమున కధిపతియైన మహా రాజెవ్వర"ని ప్రశ్నించితిని. మహర్షి దేవేంద్రనాథఠాకూర్ అని ఆయన ప్రత్యుత్తరమిచ్చెను. "ఆయనను దర్శింపవలెనని యున్నది, లోనికి దారియెట్లు? " అని అడిగితిని. సింహద్వారమువంక దారిజూపెను. పోయిచూడ సింహద్వారలలాటభాగమున "ఈశావాశ్యమిదంసర్వం" అని స్వర్ణాక్షరములతో వ్రాయబడియుండెను.

మహర్షి జీవితమునుగురించి ఈయవతారికలో నేను ప్రసంగింప యత్నించుట కేవలము సాహసము. జీవితమునకు పీఠికనొకటి ఆంగ్ల గ్రంథమునందలి Evlyn Underhill's Introduction వంటి దెవ్వరైనను వ్రాసియిచ్చి నాకు తోడ్పడుదురేమోయని యాశించి విఫలమనోరథు డనైతిని. కీర్తిశేషుడును, చిరస్మరణీయుడును, నాకత్యంత పూజనీయు డునైన నాజ్యేష్ఠసోదరుడు దివాన్ మొక్కపాటి సుబ్బారాయుడు గారిని ఈగ్రంథమున కుపోద్ఘాతమును వ్రాసి నాదుర్బలప్రయత్నమును పవిత్రపరుపుమని వేడితిని; గాని అంతకుముందే అల్పప్రాయముననే తనబుద్ధివిశేషముచే ననేకులకాశ్చర్యము కలిగించిన ఆయన ప్రథమ పుత్రికారత్నము, మాగృహలక్ష్మియగు మహాలక్ష్మి వ్యాధిగ్రస్తయై, "గజేంద్రుని మొసలి పట్టుకున్నట్లు నన్నీవ్యాధిపట్టుకున్నది. గజేం ద్రుని రక్షించినదైవమే నాకును మోక్షము నిచ్చు"ననుచు నమ్ములను వదలి పరలోకమునకు పోయియుండుటచే విషణ్ణమనస్కుడై, "మహా లక్ష్మిమరణముతో నాజీవితములోని యుత్సాహమంతయు నంతరించెను. గ్రంథరచనకిప్పు డుద్యుక్తుడను కాజాల"నని ఆయన నాకు ప్రత్యుత్తర మిచ్చెను.

భాషాంతరీకరణమును సాధ్యమైనంతవరకు బంగాళీగ్రంథమునకు సరిగానుండునట్లు జేసితిని. వీలుపడినంతవరకు మహర్షి వాక్యములనే ప్రయోగించితిని. కావున ఇందలి శైలి సామాన్యరచనకు కటువుగను, అచ్చటచ్చట వెగటుగనుకూడ తోచవచ్చును. వ్యాకరణమునందు ప్రవేశమించుకయు నాకు లేదు. వ్యాకరణదోషములను, తప్పుడుసమాసములను సవరించుటకేపండితుల సహాయ్యమును నేను కోరలేదు. ముద్రాలయము కాకినాడయందును, నా యునికి రాజమహేంద్రవరమందును అగుటచే అచ్చుప్రతులను విశేషశ్రద్ధతో సరిచూచుట కవకాశము లేకుండెను.

విశేషము శ్రమనొంది వ్రాతప్రతులను, అచ్చుప్రతులను సరిచూచి, అత్యంత ఉత్సాహముతో గ్రంథప్రచురణమందు తోడ్పడి, గ్రంథమునకు ప్రాణముపోసి రూపము తెచ్చిన నామిత్రుడు శ్రీయుత గాడేపల్లి సూర్యప్రకాశరావు ఎం.ఎ., ఎల్.టి., గారికి నా హృదయపూర్వకవందనము లర్పించుచున్నాడను. గ్రంథమునందలి తప్పులు నావిగను, ఒప్పులాయనవిగను పాఠకులు గ్రహింతురుగాక.

గ్రంథమును ముద్రించుటకు నాకు ధనసహాయము జేసిన మిత్రులందరకును కృతజ్ఞుడను. శ్రీయుత దర్భా శివరామరావ్ బి.యే., బి. యల్. గారును, శ్రీయుత పి. బసవరాజు బి.యే.బి.యల్. గారును, చెరిమొక ఏబదిరూపాయలనిచ్చి నాకత్యంతసహాయ మొనర్చినందుకు వారికి శాశ్వతకృతజ్ఞుడను.

గ్రంథమును నామనసువచ్చినరీతిని అచిర కాలముననే ముద్రించియిచ్చిన Scape & Co., వారికిని వందనములు.

రాజమండ్రి,
29—9—1922.

మొక్కపాటి రామమూర్తి.



# మహర్షి దేవేంద్రనాథ ఠాకూర్

## స్వీయ చరిత్రము.



మొదటి ప్రకరణము.



మానాయనమ్మకు నాయందు మిక్కిలియిష్టము. శైశవమునందు నాకు సర్వమును ఆమెయే అయి ఉండెను. నిద్రించుట, కూర్చుండుట, భుజించుట, అన్నియును నేనామెవద్దనే. ఆమె ఎప్పుడు కాళీఘట్టమునకు పోయినను ఆమెతోగూడ నేనును పోవువాడను. నన్నువిడిచి ఆమె జగన్నాథ క్షేత్రమునకును బృందావనమునకును వెడలి నప్పుడు నేను వెక్కి వెక్కి ఏడ్చితిని. ధర్మమునందామెకు మిక్కిలి నిష్ఠయుండెను. అనుదినమును ఆమె ఉదయముననే గంగాస్నానము చేయుచుండెడిది. ప్రతిదినమునుసాలగ్రామమునకుస్వహస్తములతో పుష్పమాల గ్రుచ్చు చుండెడిది. అప్పుడప్పుడామె ఉదయాస్తమయములు సాధనలో మునిగియుండెడిది. సూర్యుడుదయించినది మొదలు అస్తమించు వరకును సూర్యునకు అర్ఘ్యప్రదానము చేయుచుండెడిది. ఆసమయములలో 'డాబా' మీాద ఎండలో నేనును ఆమెతో నుండెడివాడను. "జబాకుసుమ సంకాశం కశ్యపేయ మహాద్యుతిః" అనుసూర్యార్ఘ్య ప్రధానమంత్రము వినగవినగ నాకుకూడ అభ్యాసమయ్యెను.

ఒక్కొక్కరోజున ఆమె హరివాసరోత్సవము సల్పుచుండెడిది. అప్పుడు రాత్రి అంతయు హరికథలు భజనలు జరుగుచుండెడివి. ఆశబ్దమువల్ల నాకు నిద్రపట్టకుండెడిది.

గృహకృత్యములు చాలవరకు ఆమెయే స్వయముగా నిర్వహించుచుండెను. ఆమె కార్యదక్షతవలన గృహకృత్యములన్నియు సుశృంఖలముగా సాగుచుండెను. ఇంటివారందరును భుజించిన పిమ్మట ఆమె స్వహస్తపాకము భుజించుచుండెను. నేనును ఆహావిష్యాన్నములో భాగము పొందువాడను. భోజనముకన్న శాకీప్రసాదమే ఎక్కువయిష్టముగా నుండెడిది. మాఅవ్వకు ధర్మమునందెంత యాసక్తి యుండెనో, కార్యనిర్వహణము నందెంత నైపుణ్యముండెనో ఆమె శరీరముకూడ అంత సౌందర్యముగ నుండెను. వైష్ణవగోసాయీలు తరుచువచ్చుచుండుట ఆమెకిష్టము లేకుండెను. ధర్మము యెడల అంధవిశ్వాసముతో బాటు ఆమెకుకొంత స్వాతంత్ర్యముకూడ యుండెను. గోపీనాథ ఠాకూరును చూచుటకు మాపురాతన గృహమునకామెతో వెళ్ళుచుండువాడను. కాని ఆమెను విడిచి మాత్రము బయట గదులలోనికైనను వచ్చుట కిష్టము లేకుండెడిది. ఆమె యొడిలో కూర్చుండి గవాక్షము ద్వారా శాంతభావముతో సమస్తమును చూచుచుండెడివాడను.

ఇప్పుడింక మాయవ్వ లేదు, కాని ఎంతయో కాలమునకు, ఎంతయో అన్వేషించిన పిమ్మట, నేటికి అవ్వలకెల్ల నవ్వయగు లోకమాతను కనుగొని ఆమె క్రోడమున కూర్చుండి జగత్తుయొక్క లీలను తిలకించుచున్నాను.

మానాయనమ్మ తను చనిపోవుటకు కొలది దినములపూర్వము, "నాకున్నదంతయు నీకుతప్ప వేరెవ్వరికిని యివ్వన"ని నాతో జెప్పెను. పిమ్మట ఆమెపెట్టె తాళముచెవి నాచేతికిచ్చెను. పెట్టె తెరచిచూడగా అందులో నాకు కొన్ని రూపాయలు మొహరీలు, కనబడెను. అపుడు నేనందరతో 'నాకు అటుకులు మరమరాలు దొరకెన' ని చెప్పితిని. 1835 వ సంవత్సరమున మాఅవ్వయొక్క అంత్య

దినములలో మాతండ్రిగారు అలహాబాదునకు సంచారము వెడలిరి. ఇంతలో ఆమెకు దేహమునందస్వస్థత ప్రవేశించెను. వైద్యుడునచ్చి రోగినింక గృహమునందుంచకూడదని చెప్పెను. కావున ఆమెను గంగానదీ తీరమునకు గొనిపోవుటకు మావారలు యత్నముచేయ నారంభించిరి. కాని మాయవ్వకింకను బ్రతుకవలెనని యుండెను. గంగకుపోవుట కామె యిష్టపడలేదు. “ ద్వారకానాధుడింటివద్ద నున్నచో నన్నిట్లు బయటకు గొనిపోవ గలిగియుందురా ? ” అనెను. కాని ఆమాటలు చెవిని బెట్టక ఆమెను గంగాతీరమునకు గొనిపోయిరి. “ నామాటలు వినక నన్నిచటకు గొనివచ్చి మీరు నాకెట్లుకష్టమును గలిగించిరో అట్లే నేనును మీకందరకు విశేషకష్టముకలుగ జేసెదను; నేను త్వరలో మరణము నొందను” అనెను. ఆమెను గంగాతీరమున ఒకతాటియాకు పాకలో నుంచిరి. ఆమె మూడురాత్రిలారితిగ జీవించియుండెను. ఆసమయమున గంగాతీరమున సర్వదా నేనామెవద్దనే యుండువాడను.

మాఅవ్వ చనిపోవుటకు పూర్వపు రాత్రి ‘నింతోలాఘాట్ ’* వద్ద నేను ఆసాల ముందొకచాపపై కూర్చుంటిని. నిండుపున్నమరేయి. ఆకసమున వెన్నెల వెదజల్లుచు చల్లని చందమామ. చెంతనే స్మశానము. అత్యుత్సాహముతో నీశ్వరనామసంకీర్తనగావింపబడుచుండెను. “ ఆహా ! ఇటువంటిదినమెన్నడైన వచ్చునా, హరినామ స్మరణతో ప్రాణముపోవుచున్నది! ” †

ఆనిశాసమయ మందమారుతము నధివసించి ఈగీతములు చల్లచల్లగ నావీనుల చేరుచుండెను. అకస్మాత్తుగ నామనసునందొక

---

* కలకత్తానందలి స్మశానవాటికలలో ముఖ్యమైనది.

† “ ఏ మొక దిన్ కిహాబే, హరినామ్ బొలియాప్రాణ్ జాబే ”

వింతయైన ఉదాసభావ ముదయించెను. నేను పూర్వపు మనుజుని కానట్లు నాకు దోఁచెను. ఐశ్వర్యమునందొక్కమారువిముఖత్వము జనించెను. నేను కూర్చుండియుండిన ఆతాటియాకు చాపముందు రత్నకంబళములు, చీనిచీనాంబరములు ఏహ్యములుగ దోఁచెను. మన సునందు మున్నెన్నడెరుంగని నూతనానంద మొకటి యుద్భవించెను. అప్పటికి నావయసు పదునెనిమిదేండ్లు.



## రెండవ ప్రకరణము.



ఇంతవరకును నేను విలాసముయొక్క ఆమోదములో మునిగి యుంటిని. తత్వజ్ఞానమును గురించి అణుమాత్రమయిన నాలోచింప లేదు. ధర్మమన నేమియో, ఈశ్వరుడన నేమియో నాకేమియు తెలి యదు. ఏమియు నేర్చికొనలేదు. కానినాడు స్మశానవాటికయందు నేను పొందిన సహజస్వాభావిక ఆనందమును నామనసు నందింక ఉంచుకొ నలేకపోతిని. భాష సర్వవిధముల దుర్బలమైనది. నేను పొందిన ఆనంద మును లోకులకు దెల్పుటెట్లు? అది స్వాభావికానందము. తర్కము వల్లను యుక్తివల్లను దానినెవ్వరును పొందజాలరు. దానిని మానవహృ దయముల ప్రవహింపజేయుట కీశ్వరుడే తరుణమును వెదకుచుండును. ఇట్లు సమయమును కనిపెట్టి దానిని నాకుదయచేసి యున్నాడు. ఇక ఈశ్వరుడు లేడని యెవడుచెప్పగలడు? ఇదియే ఆయన ఆస్తిత్వప్రమా ణము. ఇట్టి యానందము పొందుటకు నేను సంసిద్ధుడనై యుండ లేదుగదా. మరి నేనెక్కడనుండి దీనిని పొందితిని?

ఈ ఆనంద భావముతోను ఔదాస్యభావముతోను రాత్రి రెండు జాముల వేళ ఇల్లుచేరితిని. ఆరాత్రి నాకింక నిద్రపట్టలేదు. అట్లు నిద్రరాకుండుట కాయానందమే కారణము. రాత్రియంతయు ఈ ఆనం

దజ్యోత్స్న నాహృదయమున ప్రకాశించుచుండెను. తెల్లవారుజామున అవ్వను చూచుటకు గంగాతీరమునకు పోయి ఉంటిని. అప్పుడామె కొనయూపిరితో నుండెను. ఆమెను గంగ మధ్యకు నావపై గొని పోయి, "గంగా నారాయణబ్రహ్మ!" యని ఉచ్చైస్స్వనమున నుచ్చరించుచుండిరి. ఆమె తనహస్తమును వక్షస్థలమున నుంచుకొనియుండెను. అనామికాంగుళము ఊర్ధ్వముఖముగా నుండెను. ఆవ్రేలును గుండ్రముగా త్రిప్పుచు "హారిబోల్! హారిబోల్" అనుచు అక్కే పరలోకగామి యయ్యెను. ఇదిచూడగా, ఆమెమరణసమయము నందు నాతో, "అడుగో, పరమేశ్వరుడు, అతడే నీకు ముందుగతి," అని వ్రేలెత్తి చూపుచు చెప్పినట్లుతోచెను. ఇహమున నెట్లో పరమునను అవ్వయే నాకుపరమ మిత్రురాలు.

ఆమెశ్రాద్ధము బహువైభవముతో జరిగినది. దేహమునందంతటను చమురు పసుపు పూసికొని శ్రాద్ధముయొక్క * వృషకాష్టమును గంగాతీరమున పాతిపెట్టితిమి. ఈదినములలో మాయింట చాల 'తొడతొక్కిడి' గానుండెను. అవ్వచనిపోవుటకు పూర్వపురాత్రి నేను పొందిన ఆనందమును పిమ్మట తిరిగి అనుభవమునకు దెచ్చుకొనుటకు అనేకసారులు ప్రయత్నించితిని. కాని మరెన్నడును పొందలేకపోతిని. నాటిరాత్రి ఔదాస్యముతోను ఆనందముతోను నిండియుండిన నామనసు ఇపుడు ఔదాస్యముతోనువిషాదముతోనునిండెను. ఆయానందమంతరించుటతోడనే మనసునందొక విధమగు అసంతుష్టి ప్రవేశించెను. నాటి ఆనందమును మరల నెట్లు సంపాదింపగలుగుదునాయని నామనసునందొక గొప్ప వ్యాకులత జనించెను. ఇకదేని యందును నాకిష్టములేకుండెను. అప్పటి నాయవస్థ భాగవతమునందలి యొక ఉపాఖ్యానముతో పోల్చవచ్చును.

---

* పైన నొక వృషభచిహ్నముగల యొక యజ్ఞస్తంభము.

వేదవ్యాసునితో నారదుడు తనపూర్వజన్మ వృత్తాంత మీక్రిందివిధముగా చెప్పెను.

[నారదుని పూర్వజన్మవృత్తాంతము.]

వ. మహాత్మా నేను పూర్వకల్పంబునం దొల్లిటి జన్మంబున వేదవాదుల యింటి దాసికిం బుట్టి పిన్ననాఁడు వారలచే బనుపంబడి యొక్క వానకాలంబునఁ జాతుర్మాస్యంబు ననేక స్థల నివాసంబుసే య నిశ్చయించిన యోగి జనులకుం బరిచర్యసేయుచోట.

* * * * * *

వ. ...........నాయందు.........అమ్మహాత్ములగు యోగి జనుల మూలంబున రజస్తమోగుణ పరిహారిణి యైన భక్తి సంభవిం చెనంతఁ జాతుర్మాస్యంబునిండిన నయ్యోగి జనులు యాత్రసేయువార లై యివ్విధంబున.

మ. అపచారంబులు లేక నిత్యపరి చ ర్యాభక్తియుక్తుండనై
చపలత్వంబును మాసి నేగొలువగా సంప్రీతులైవారు ని
ష్కపటత్వంబున దీనవత్సలతతోఁ గారుణ్యసంయుక్తులై
యుపదేశించిరినాకు నీశ్వరరహ స్యాధార విజ్ఞానముఁ.

వ. ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయానుభవం బుదెలిసితి.

* * * * * *

వ. ......దాసీపుత్రుండనయిన నేను భిక్షులవలన హరిజ్ఞానం బుగలిగి యున్నంత.

సీ. మిమ్మునేలినవారి మందిరంబునుగల
పనులెల్లఁగ్రమమున భక్తిచేసి

తనపరాధీనత దలపదు సొలసితి
నలసితినాకొంటి ననుచువచ్చి
మాపునురేపును మా తల్లి మోహంబు
సొంపారముద్దాడఁ జూచుచుదువ్వ
దేహంబునివురు మోదించు గౌగిటజేర్చు
నర్మిలినన్నిట్టు లరసిమనుప

ఆ. నేనువిడిచిపోక నింటఁ నుండితినయ్య
మోహింగాక యెఱుక మోసపోక
మారు చింతలేక మానినై యేనేండ్ల
వాఁడనగుచుఁగొన్ని వాసరములు.

క. సదనము వెలువడి తెరువునఁ
జెదరక మాతల్లి రాత్రిఁ జీఁకటివేళన్
మొదవుం బిదుకఁగ నొకఫణి
పదభాగము గఱచె ద్రొక్కఁబడి మునినాథా.

క. నీలాయిత భోగఫణి
వ్యాళానల విషమహోగ్ర వహ్నిజ్వాలా
మాలావినిపాతితయై
వ్రాలెన్ ననుగన్నతల్లి వసుమతిమీఁదన్.

ఉ. తల్లిధరిత్రిపై నొఱిగి తల్లడపాటునఁ జెందిచిత్తముం
బిల్లటిలంగఁ బ్రాణములు వాసినజూచి కలంగకేను నా
యుల్లములోన మోహరుచి నొందక సంగము వాసె మేలు రా
జిల్లెనటంచు విష్ణుపద చింత యొనర్చుచుబుద్ధి జేర్చుచున్.

వ. ఉత్తరాభిముఖుడనై యేను వెడలి జనపదంబులుఁ బురంబు
లుఁ బట్టణంబులు గ్రామంబులుఁ బల్లెలు మందలు గిరాతపుళిందనివా

సంబులు వనంబులు నుపవనంబులుఁ జిత్రధాతువిచిత్రితంబు లయిన పర్వతంబులు సమదకరికర విదళిత శాఖలుగల శాఖులు నవారితనివారిత పథికజన ప్రేమాతిరేకంబులైన తటాకంబులు బహువిధవిహంగనినద మనోహరంబులై వికచారవింద మధుపాన పరవశీ పరిభ్రమద్భ్రమరసుందరంబులైన సరోవరంబులుఁ దాటి చనుచుతుత్పిపాసాసమేతుండనై యొక్క నదీహ్రదంబున గ్రుంకులిడి శుచినై నీరుద్రావి గతశ్రముండనై.

క. సాలావృక కపిభల్లుక
కోలేభలులాయశల్య కిషూక శరభశా
ర్దూల శశగవయఖడ్గ
వ్యాళాజగరాది భయద కివనమధ్యమునన్.

వ. దుస్తరంబులైన నవవేణుకీచక గుల్మలతాగహ్వరంబుల పొంతనొక్క రావిమ్రానిడగ్గర కూర్చుండియే విన్నచందంబున నాహృదయగతుం బరమాత్మ స్వరూపు హరింజింతించితి.

శా. ఆనందాశ్రులు గన్నులన్ వెడల కిరో మాంచంబుతోఁదత్పద
ధ్యానారూఢుడనైన నాతలపులో కి నద్దేవుఁడుందోచెనే
నానందాబ్ధిగతుండనై యెఱుఁగలే కి నైతిఁనను న్నీశ్వరున్
నానాశోకహమైన యత్తనవుగానన్ కి లేక యట్లంతటన్.

వ. లేచినిలచుండి క్రమ్మర నద్దేవుని దివ్యాకారంబు జూడనిచ్ఛించుచు హృదయంబున నిలుపుకొని యాతురుండునుం బోలెచూచియుం గానలేక నిర్మనుష్యంబైన వనంబునం జరియించుచున్న నన్నునుద్దేశించి వాగగోచరుండైన హరిగంభీరమధురంబులైన వచనంబుల శోకంబుపశమింపంజేయు చందంబున నిట్లనియె.

ఉ. వలకుమార శోషిలగ కి నీజననంబున నన్నుగానగా
జాలవునీవు కామముఖ కి షట్కము నిర్దళితంబుచేసి ని

ర్మాలిత కర్ముడైన ముని కే ముఖ్యుడుగాని కుయోగిగానగా
జాలదు నీదుకోర్కి- కొన కే సాగుట కైనిజమూర్తిజూపితిక్."

నేను సరిగా ఇదేస్థితియందుంటిని. నాటి యానందమును పొం దలేక అత్యంత విషణ్ణుడనైతిని. ఈనారదునికథతో నాకథ ఒక్కవి షయములోమాత్రము కలియుటలేదు. ప్రిపథమమున అతడుఋషీశ్వ రుల నోటినుండి హరిగుణానువర్ణన విన్నవాడగుటచే నాతని హృదయ ములో శ్రద్ధాభక్తులు జనించినవి. పిమ్మట వారివద్ద బ్రహ్మజ్ఞానమును గురించి అనేక ఉపదేశముల నాయన పొందెను. కాని నేనెవ్వరినోటి నుండి వింటిని? అందుచే భక్తిశ్రద్ధలపొందు యోగము నాకు ప్రాప్తించలేదు. బ్రహ్మతత్వమును నాకు ఎవ్వరును అనుగ్రహించ లేదు. అహర్నిశములు విలాసామోద వాయువులు నాకు అనుకూల ముగ వీచుచుండెను. అయినను ఇంత ప్రతికూలావస్థలో సహితము ఈశ్వరుడు తన యపారకృపచే నామనసున వైరాగ్యముదయింపజేసి నాహృదయమునుండి సంసారాసక్తిని తొలగించెను. పిమ్మట తన ఆనంద ధారల నాహృదయమున వర్షింప జేసి నాయందు నూతన జీవనము నంకురింప జేసెను. ఈశ్వరునియొక్క యీకృపావిశేషముఅను పమానము. అతడే నాకుగురువు. అతడేనాకు తండ్రి.



మూడవ ప్రకరణము.



అవ్వచనిపోయిన పిమ్మట నొకనాడు కచేరిసావడిలో కూర్చుండి దగ్గరనున్నవారితో, "ఈరోజున నేను కల్పతరువయితిని. నేనివ్వగలిగిన నాసిలో నెవ్వరేది అడిగినను ఇచ్చెదను." అంటిని. తక్కిన వారెవ్వ రేమియు నడుగలేదు; కాని మాపెద్దతాత కుమారుడు వ్రజబాబు

మాత్రము, "ఆరెండు నిలువుటద్దములు, ఆబొమ్మలు ఈజరీపంచల జత నాకిమ్ము," అని అడిగెను. తక్షణమే అవన్నియు నిచ్చివేసితిని. మరునాడాతను కూలీలను తెచ్చి కచేరిసావడిలోని వన్నియు పట్టించుకొని పోయెను. వానిలో కొన్ని మంచి మంచి బొమ్మలు, ఇతరములైన విలువగలవస్తువులుకూడ ఉండెను. అతడన్నిటినితీసికొనిపోయెను. ఈవిధముగ నాసామానంతయు నిచ్చివేసితిని. కాని నామనస్సులోని విషాదముమాత్రము యథాప్రకారముగనే యుండెను. దాని నేదియుతరుమలేకపోయెను. చిత్తశాంతి నెచట పొందగలుగుదునో తెలియదాయె. ఒకదినము పడకకుర్చీపై పరుండి ఈశ్వరవిషయమైన సమస్యల నాలోచించి ఆలోచించి ఆధ్యానములో నిమగ్నుడనైతిని. ఆపరాధ్యానములో ఎప్పుడు లేచితినో, ఎప్పుడు భుజించితినో తిరిగి ఎప్పుడు శయనించితినో నాకేమియు తెలియలేదు. సర్వదా అచ్చటనే పరుండినట్లు తోచుచుండెను. సమయముదొరకినపుడెల్ల మట్టమధ్యాహ్నము "షాలిమార్ ఉద్యాన వనము"నకు (Botanical gardens) పోవుచుంటిని. అది కడునిర్జనప్రదేశము. ఉద్యానవనము మధ్య నొక సమాధిస్తంభముకలదు. నేను దానిపై కూర్చుందును. నామనస్సులో విషాదము మెండుగ నుండెను. నలుదిక్కులను అంధకారము. నాకిపుడు విషయప్రలోభనములు దూరమైనవి, కాని ఈశ్వరభావము మాత్రము ఇంకను రాలేదు. ఐహికసుఖములను వదలుకొంటిని కాని స్వర్గీయానందమును పొందలేకపోతిని. ఇట్లు రెండింటికిని దూరమై జీవనము రసవిహీనమయ్యెను. ప్రపంచము స్మశానతుల్యముగ నుండెను. దేనియందును సౌఖ్యముగానరాదాయె, దేనివల్లను శాంతికలుగదాయె! మట్టమధ్యాహ్నపు సూర్యకిరణములు సహితము తేజోవిహీనములుగ తోచుచుండెను. అట్టి అవస్థలో ఈక్రింద కీర్తన నాకంఠమునుండి వెలువడెను:—

"హాబే కిహోబే దిబా ఆలోకే, జ్ఞాన్ బినాషబ్ అంధకార్"

"వ్యర్థము, పట్టపగటికాంతి అంతయు వ్యర్థము; జ్ఞానజ్యోతి లేనిదే అంతయు అంధకారమే!

ఇదియే నామొదటిగీతము. ఆచలువరాతిపై నొంటరిగకూర్చుండి ఈగానమును ముక్తకంఠముతో స్వేచ్ఛగా పాడుచుండువాడను.

అప్పుడు నాకు సంస్కృతము నేర్చికొనవలెనని కుతూహలము కలిగెను, చాణక్యుని శ్లోకములను యత్నపూర్వకముగా కంఠస్థముగా వింప ప్రారంభించితిని. కొన్ని మంచిశ్లోకములు కనబడినప్పుడెల్ల వానిని అట్లే కంఠస్థము చేయువాడను. అప్పుడు మాయింట నొక సంస్కృతపండితు డుండెను. అతని పేరు కమలకాంత చూడామణి. ఆయన గ్రామము 'బాశబేడా' పూర్వమాతడు గోపీమోహన ఠాకూరు నాశ్రయించియుండెను. తరువాత మాయింటపండితుడయ్యెను. అతడు విద్యావంతుడును, తేజోవంతుడునై యుండెను. నేనప్పు డల్ప వయస్కుడను. నాయందాతనికి మిక్కిలి యిష్టము. నేనును ఆయనను భక్తితో చూచువాడను. ఒకనాడాయనతో, "మీవద్ద ముగ్ధబోధ వ్యాకరణము చదివెదను" అంటిని. ఆయన, "మంచిది నీకు నేర్పెదనులే." అనెను. పిమ్మట చూడామణివద్ద వ్యాకరణమును ప్రారంభించి 'కచటతప'లు, 'గజడదబలు' కంఠోపాఠముగ నేర్చికొన నారంభించితిని. సంస్కృతభాషలో ప్రవేశము నొందుటకు ప్రథమమున చూడామణివద్ద వ్యాకరణము చదువుట కుత్సహించితిని. ఒకనాడాయన స్వహస్తములతో వ్రాయబడియున్న కాగితమొకటి మెల్లమెల్లగ తీసికొనివచ్చి నా చేతిలో పెట్టి, దానిపై నన్ను సంతకము చేయుమనెను. చదివిచూడగా తనకుమారుడగు శ్యామచరణుని నేను పోషింపవలయునని అందు వ్రాయబడియుండెను. నేను సంతకము చేసితిని. చూడామణియందు విశేషభక్తి గౌరవములు కలిగియుండుటచే ఏమియు సంకోచింపక ఆతని కోరిక ప్రకారము సంతకము చేసితిని. అందలి విషయవస్తునుగూర్చి

ఆసమయమున కొంచమైనను ఆలోచింపలేదు. తరువాత కొంతకాలమునకే మాసభాపండితుడు చూడామణి మృతినొందెను. అప్పుడు శ్యామచరణుడు ఆకాగితము నావద్దకుదెచ్చి, "నాతండ్రి పరలోకగతుడయ్యెను. నేను నిరాశ్రియుడను. మీరిప్పుడు నన్ను పోషింపదగును. ఇదిగో చూడుడు, తామిదివరకే వాగ్దానముచేసిరి." అని అప్పుడు నేను సంతకముచేసిన కాగితమును చూపెను. ఇందుకు నే నంగీకరించితిని. అప్పటినుండియు శ్యామచరణుడు నావద్దనే యుండెను. అతనికి సంస్కృతమునందు కొంచెము ప్రవేశము కలదు. ఈశ్వర తత్వజ్ఞానమే గ్రంధమునందు పొందనగునని అతని నడిగితిని. మహాభారతములోననియతడు ప్రత్యుత్తరమిచ్చెను. అప్పుడు నేనతనివద్ద మహాభారతము చదువనారంభించితిని. ఆగ్రంధము తెరువగనే ఈశ్లోకము నాకెదురుపడెను.

శ్లో॥ "ధర్మ మరిర్భవతువః సతతోద్ధితానాం
సహ్యేక ఏవపరలోక గతస్యబన్ధుః । "
అర్థా స్త్రీయశ్చనిపుణేరపిసేవ్యమానా
నైవాప్త భావముపా తినచస్థయిరత్వా।

"ధర్మము నందాసక్తి ఉండునుగాక. సతతము ధర్మముయెడల అనురక్తి కలిగియుండువుగాక. పరలోకగతులయిన వారికి అధర్మమొక్కటే తోడగును. ధనమును స్త్రీలును చంచలస్వభావముగలవి. వానినెంత సేవించినను అవి నీకు లొంగియుండవు."

మహాభారతమునందీశ్లోకము చదువగనే నాకుత్సాహముజనించినది.

బంగాళీ ఆంగ్లేయభాషలలోవలెనే అన్నిభాషలలోను విశేషణములువిశేష్యములకు ముందుండునని యభిప్రాయపడుచుంటిని. కాని సం

స్కృతభాషలో విశేష్యమొక్కచోటను విశేషణము మరియొకచోటనుం డెను. దీనిని గ్రహించుటకు కొంతకాలము పట్టెను. మహాభారతము లో అనేకాంశములను చదివితిని. ధౌమ్యఋషి ఉపాఖ్యానములో నుపమన్యుని గురుభక్తి నాకు బాగుగ జ్ఞాపకమున్నది. ఈమహాగ్రం థమిప్పుడు భాషాంతరీకరింపబడుటచే అనేకులచే పఠింపబడుచున్నది. కాని ఆదినములలో మూలగ్రంథము బహుకొలది మంది మాత్రము చదువుచుండిరి. ధర్మపిపాస నన్ను దానిని చాలవరకు చదువ పురి కొల్పినది.

తత్త్వాన్వేషణకొరకు సంస్కృతము చదివినట్లే ఆంగ్లేయభాష నుచదువుచుంటిని. పాశ్చాత్యధర్మశాస్త్రము సవిస్తరముగా చదివితిని. కాని ఎన్నిచేసినను మనసునందలి అభావము తొలగకుండెను. ఆవిషా దము, అంధకారము, అశాంతి హృదయమును మిక్కిలి పీడించుచుం డెను. 'ప్రకృతికి లోబడుటకేనా మానవుడు సృజింపబడినది.' అని ప్ర శ్నించుకొంటిని. అయినచో మనుజునికి దిక్కులేదు. ఈప్రకృతి పిశాచ ముయొక్క పరాక్రమము దుర్నివారము. స్పర్శమాత్రమున అగ్ని సమస్తమును భస్మీపటలము గావించును. ఓడమీద సముద్రముపై ప్రయాణముచేయనారంభించితివా? సుడిగుండములు నిన్ను పాతాళము నకు లాగివేయును. జంఝూమారుతములు నిన్ను దరిలేని దుఃఖాబ్ధి లోనికి తరిమివేయును. ఈప్రకృతి పిశాచముయొక్క పట్టును వదలిం చుకొనుట ఎవ్వరికిని సాధ్యముకాదు. దాని యాజ్ఞలకు శిరమువంచి నమస్కరించుటకే మనము బ్రతుకుచుండినచో మనకాశలేదు. ఇక దేని నభిలషింపగలము ? దేనిని నమ్మగలము ? సూర్యకిరణములవల్ల ఛాయాగ్రాహకయంత్రము ( Photograph ) నందద్దముపై వస్తువు లెట్లు ప్రతిబింబింపబడునో, అట్లు వివిధఇంద్రియములద్వారా మనసునందు బాహ్యవిషయముల స్వరూపములు గోచరములగుచున్నవి. దీనినే జ్ఞాన

ముందురు. ఈమార్గమును త్యజించినచో ఇక జ్ఞానలాభము పొందుట కేమిఉపాయమున్నది? అని ఒకసారిఆలోచించుకొంటిని. పాశ్చాత్యదర్శనశాస్త్రముఈవిషయమైనాకుకొంతస్ఫురింపజేసినది. నాస్తికునకుప్రకృతిచాలును. అతనికి ప్రకృతికంటె రెండవవిషయమేదియు అక్కరలేదు. నాకుమాత్రమది సరిపోలేదు. ప్రకృతినిమించి సమస్తవిశ్వమునకును ప్రభువగు ఈశ్వరుని దర్శించక నేనుండలేకపోతిని. కాని ఈ యీశ్వర దర్శనమును కేవలము అంధవిశ్వాసముచేగాక జ్ఞానాలోకనముచేపొందవలయునని నామహాప్రయత్నము. ఇది నెరవేర్చికొనలేకపోవుటచే నావ్యాకులత దినదినమును హెచ్చుచుండెను. ఒక్కొక్కప్పుడు జీవితము దుర్భరముగా తోచుచుండెను.



## నాల్గవ ప్రకరణము.



నేనిట్లుయోచింపగా యోచింపగా, అకస్మాత్తుగా ఈవిషాదాంధకారముమధ్య విద్యుల్లతవలె నొకకాంతి మెరసెను. బాహ్యేంద్రియములద్వారా, అనగా రూప, రస, గంధ, శబ్ద, స్పర్శలయోగమున విషయజ్ఞానము జనించుచున్నదని తటాలున గ్రహించితిని. ఈజ్ఞానముతోబాటే, 'నేనేజ్ఞాతను' అనికూడ తెలిసికొనగల్గితిని. దర్శన, స్పర్శన, ఆఘ్రాణ, మననములతో, ద్రష్టను, స్రష్టను, ఘ్రాతను, మన్తను నేనే అనుజ్ఞానమును పొందితిని. విషయజ్ఞానముతోబాటు విషయినిగూడ తెలిసికొనగల్గితిని. విశేషఅను సంధానమువలన నేనీజ్ఞానమును సంపాదించితిని. ఘోరాంధకారావృతస్థానమునందొక సూర్యకిరణరేఖ వచ్చి ప్రవేశించినది. విషయావబోధముతో, మనలను మనసు తెలిసికొందుమన్న సంగతిని గ్రహించితిని. ఇటుపై నాలోచించినకొలది,

జ్ఞానప్రభావమువలన విశ్వసంసారమును సమస్తమును చూడగల్గితిని. సూర్య చంద్రాదులు మనకొరకే నియమితరీతిని ఉదయించి అస్తమించుచున్నవి. మనకొరకే వాయువును వర్షమును ఉపయుక్తముగ సంచలితములగుచున్నవి. ఇవన్నియును కలసి మన జీవితపోషణమను లక్ష్యమును సిద్ధిచెందించుచున్నవి. ఈలక్ష్యమెవరిది? జడముయొక్క లక్ష్యము కానేరదుగదా! చేతనముయొక్క లక్ష్యమయి యుండవలెను. గావున ఈవిశ్వసంసారమునంతను నడుపుచున్నవాడొక చేతనావనుడు కలడని గ్రహించితిని.

శిశువు భూమిష్టమగుటతోడనే తల్లియొద్ద స్తన్యపానముచేయును. శిశువునకిది నేర్పినవారెవరు? ఎవడు తల్లియొక్క స్తన్యములో పాలనుంచెనో ఆతడేకదా. ఎవ్వని శాసనము వలన యీజగత్సంసారమంతయు నిరాఘాటముగ నడచుచున్నదో ఆతడే ఈవిజ్ఞానవంతుడగు యీశ్వరుడు. ఎప్పుడు ఇంతవరకు జ్ఞాననేత్రమును విప్పితినో అప్పుడంతవరకు ఆనందమును పొందితిని. వెనుకటి ఘనమగు విషాదముచాలవరకు అంతరించినది. మనసుకొంచము స్వస్థతచెందినది.

చాలకాలముక్రిందట, చిన్నతనమునందు అనంతాకాశమునందు అనంతుని పరిచయమును పొందితిని. ఒకనాడు దీర్ఘాలోచన చేయుచుండగా నామనసు దానియందు లగ్నమైపోయెను. అప్పుడు అగణ్య నక్షత్రచకిత అనంతాకాశముపై దృష్టి నిల్పితిని. అనంతదేవుని దర్శించితిని. అనంతమహిమమున దేగదా, ఈశోభయంతయునని తెలిసికొంటిని. ఆయన అనంతజ్ఞానస్వరూపుడు. మనలనుగూర్చియు మన నివాసములగు యీశరీరములగూర్చియు నీకించిత్తుజ్ఞాన మెవనినుండి మనము పొందగల్గితిమో, అతడు అనంతజ్ఞాన స్వరూపుడు, శరీరశూన్యుడు, నిరాకారుడు. అతడీవిశ్వమును అతనిచేతులతో మలచిచెక్కి యుండలేదు. కేవలము ఇచ్ఛామాత్రమున నీజగమును రచించినాడు, అతడు కాలీఘ

ట్టములోని కాళీదేవియును కాదు, దేవతార్చన గృహములోని సాలిగ్రామమును కాదు. ఈప్రకారముగ విగ్రహారాధన మొదలంటనరకబడినది. సృష్టియొక్క కౌశలచింతనవలన స్రష్టయొక్క జ్ఞానపరిచయమును పొందగల్గుదుము, నక్షత్రచకిత నీలాంబరమువంక చూచుటవలన ఈశ్వరుడనంతుడని తెలియుచున్నది. ఈసూత్రముయొక్క ఆధారముతో అతని స్వరూపము మనసునకు మరింత గోచరము కాగలదు. అనంతజ్ఞాన స్వరూపుడగు నాతనియిచ్ఛను ఎవ్వరును ఆటంకపరుపనేరరని ఇంకొకసంగతి తెలిసికొంటిని. ఆతనియిచ్ఛ నెరవేరితీరును. మన మొకవస్తువును చేయునపుడు దానికవసరమైన యుపకరణములమొదట సమకూర్చి అపుడు దానిని చేయుదుము. కాని ఈశ్వరుడట్లుగాక తన యిచ్ఛామాత్రమున సమస్త ఉపకరణములను సృష్టించి, ఈజగత్తును రచనచేసియున్నాడు. అతడు కేవలము ఈజగత్తుయొక్క రచనకర్తయేగాడు! అంతకన్న అధికుడు! ఆతడు దాని సృష్టికర్త. సృష్టియంతయు అనిత్యము, పరివర్తనశీలముకలది, పరతంత్రము. ఏపరిపూర్ణజ్ఞానము దీనిని సృష్టించి నడిపించుచున్నదో, అదిమాత్రమే శాశ్వతము, ఆదికృతము, సర్వస్వతంత్రము, అపరివర్తనీయము. ఆనిత్యసత్యపరిపూర్ణుడే సర్వమాంగళ్యసంధాయి. సకలసంస్తవనీయుడు.

ఇట్లు దినములకొలది నామనసులో తర్కించుకొని తర్కించుకొని ఇంతవరకును స్థిరపరచుకొంటిని. కాని యింకను నాచిత్తము కంపించుచునే యుండెను. ఇంకను సంతుష్టిలేదు.

జ్ఞానపథము అతిదుర్గమపథము! ఈమార్గమునందు నాకు సహాయముండు వారెవరు? నేను స్థిరపరచుకొనిన యీసిద్ధాంతమును ప్రోత్సహించు వారెవరు? ధైర్యము పురికొల్పు వారెవరు? ధైర్యమనినట్టిధైర్యము? నాడుపద్మానదిమీద నావికునివద్దనుండి నేనుపొందిన ధైర్యమువంటి ధైర్యము. అదియేమో తెలియజెప్పెదను:—

నేనొకసారి మాజమీాయగు కాళిగ్రామమునకు పోతిని. చాల దినములటనుండి తిరిగి యింటికి వచ్చుచుంటిని. పద్మానదియందు నావలో ప్రయాణము. వర్ష కాలము. కొంతదవ్వుసాగిపోతిమి. ఇంతలో కారుమబ్బులతోఅంబరమునిండిపోయెను. ప్రళయప్రచండ జంఝూమారుతములు హూరున వీవసాగెను. పద్మానదియంతయు మహాసాగరమై పోయెను. ఇట్లు గొప్పతుపాను వీచుచుండుట జూచి నావికుడుముందుకుపోవుటకుసాహసింపక నావను ఒడ్డునకుకట్టి వేసెను. అయినను అలలయల్లాటముచే నావ అక్కడకూడ స్థిరముగ నిలచియుండలేదు. బహుదినములయినది. ఇల్లువదలి త్వరలో గృహము, చేరవలెనను వాంఛ తీవ్రముగా నుండెను. మధ్యాహ్నము నాల్గుగంటలకు తుపానుకొంచము శాంతించినట్లు కాన్పించెను. "ఇప్పుడు నావనునడపగలవా" యని నావికునడిగితిని. "ఏలినవారియాజ్ఞయైనచో నడపగలన"ని వాడు బదులుచెప్పెను. 'అట్లయినచో వదలు'మంటిని. గాని ఎంతసేపటికిని నావ కదలలేదు. అరగంటయైనది; ఇంకను కదలుసూచన కనబడదు. నావికుని పిలచితిని, "నాసెలవైనచో నౌకను వదలెదనంటివి. నాయాజ్ఞనిచ్చితినే ! ఏలయింకను భయలుదేరవు? తుపాను ఇప్పుడే కొంచము శాంతించినది. మరల ప్రారంభించునేమో, ఎవరు చెప్పగలరు. గావున బయలుదేరదలచినచో వెంటనే బయలుదేరుము", అంటిని. అప్పుడతడు పెద్దదివాన్జీగారు తనతోనిట్లు చెప్పినట్లు బదులిడెను. "ఓరీ, మూర్ఖా! ఇది శారదాసంగమమని యెరుగవా? అవతలదరికాన్పించుటలేదు. ఇది శ్రావణసంక్రాంతి. ఒడ్డుననైనను నావ తరంగములధాటికి ఆగలేదు. నీవుచూడ ఇట్టిసమయములో పద్మానది దాటెదననుచున్నావు. నీయుద్దేశ్యమేమి?" ఆమాటలతో బెదరిపోయివాడు నౌకను బయలుదేరదీయలేదు. అయినను నేను బయలుదేరు మంటిని. వెంటనే అతడు తెరచాపవిప్పి పడవను దోసెను. ఒక్కసారి గాలి విసరగనే పడవ

నదీమధ్యమునకు ఎగిరిపోయెను. ఒడ్డునుండి అనేకులు ఐకకంఠ్యముగా "ఇప్పుడు పోవలదు! పోవలదు!" అని అఱచుచుండిరి. అప్పుడు నా హృదయము వణకసాగెను. ఏమిచేతును? వెనుకకు మరలు ఉపాయ ములేదు. తెరచాప గాలితోనిండి యున్నది. నావముందుకు భయంక రముగ దూకుచున్నది. అట్లేకొంతదూరము పోతిమి. ముందుజూడ తరంగముపై తరంగమధి వసించి గోపురముల నిర్మించుచున్నట్లు కన్పిం చుచుండెను. వీటిని భేదించుటకా యన్నట్లు నౌక పౌరుషముతో ముం దునకు ఉరుకుచుండెను. నాశరీరము వణకసాగెను.

ఇట్టి తరుణమున అనతిదూరమున నొక చిన్న 'డింగీ' యొకటి అరటిపువ్వురేకువలె, గాలిదూకుడుచే కెరటములందు అల్లాడిపోవుచు మావంక కొట్టుకొని వచ్చుచుండెను. దాని నావికుడు మాయవస్థను జూచెను. మహాభీకరమగు తుపానునందు అసహాయముగా నల్లాడిపో వుచుండిన మమ్ముజూచి, ఎంతటి పరమనిరాశాపరునకైనను ధైర్య మును పురిగొల్పుగీతిని ఎలుగెత్తి; "భయమువలదు! భయమువలదు! పొండు, ముందుకుపొండు!" అని ప్రోత్సహించెను. ప్రాణములు లేచి వచ్చినవి. ముందుకు పోతిమి.

ఇట్టిది నాకిపుడు కావలసినధైర్యము. కాని ఎవ్వరున్నారు, ఇచ్చువారు?



## ఐదవ ప్రకరణము.



ఈశ్వరుడు ఆకారరహితుడని నేను గ్రహించినప్పటినుండియు విగ్రహారాధనయందు నామనసులో నొక తీవ్రమైన అసహ్యము కలి గెను. రామమోహనరాయని జ్ఞప్తికి తెచ్చికొంటిని. ఇప్పటికి కళ్లుకన బడినవి. అతనిపద్ధతియందమితఆదరము కల్గినది. ఇకమీదట పూర్తిగ

ఆతనియడుగులలో నడుగువేసి నడువవలెనని మనస్ఫూర్తిగా దృఢసం కల్పముచేసికొంటిని.

చిన్నప్పటినుండియు నేను రామమోహనరాయల నెఱుగుదును. నేనతని పాఠశాలకే పోవుచుంటిని, ఇతరపాఠశాలలు, ఇంతకన్న మంచివికూడ కొన్ని ఉండెను. కాని రామమోహానుని సలహాపైని మాతండ్రి నన్నాతనిస్కూలుకేపంపెను. ఆస్కూలు "హెద్వా" చెరువు (Hedua tank) దగ్గరఉండెను. సాధారణముగా ప్రతిశనివారము 2 గంటలకు స్కూలు విడిచిపెట్టిన తరువాత మణిక్టోలా (Maniktola) యందుండిన రామమోహానుని ఉద్యానభవనమునకు * రామప్రసాదుతో పోవువాడను. ఇతరసమయములందు కూడనే నాతనిని చూచుటకు వెళ్ళుచుంటిని. అప్పుడప్పుడక్కడకువెళ్ళి అనేక కొంటె చేష్టలనుకూడ చేయువాడను. 'లిచ్చీ' ఫలములనుకోసికొని పచ్చిబటాణీల నేరికొని మిక్కిలి ఇష్టముతో తినువాడను. ఒకరోజున రామమోహానుడు నాతో, "తమ్ముడూ ఎండలో ఎందుకుతిరిగెదవు. ఇక్కడకూర్చుని నీయిష్టమువచ్చినన్ని పండ్లనుతినుము" అనుచు, తోటమాలితో "చెట్లనున్న లిచ్చీలనుకోసి తీసికొనిరమ్ము" అనెను. వెంటనే అతడొక పళ్ళెమునిండ పండ్లను తీసికొని వచ్చెను. అప్పుడు రామమోహనరాయలు నాతో "ఇవిగో, ఇపుడు నీయిష్టమువచ్చినన్ని పండ్లనుతినుము" అనెను. రామమోహానుడు మిగుల ప్రశాంతమూర్తి. శాంతముతోకలిసి గాంభీర్యముకూడ ఆతని ముఖమునందు కన్పించుచుండెను. నేనాయనయెడల మిగుల భక్తిశ్రద్ధలతో మెలగువాడను.

ఆతని ఉద్యానవనములో నొక ఉయ్యేలఉండెను. దేహవిశ్రాంతికొరకు రామమోహనరాయలు అందులో ఊగుచుండెడివాడు. అప్పుడప్పుడునేను సాయంత్రము తోటకువెళ్ళినప్పుడు నన్నందులో కూ

* రామమోహానుని కుమారుడు.

ర్చుండబెట్టిఆయనస్వయముగా నన్నూపువాడు. అట్లూపి కొంతసేపైన పిమ్మట తానందులోకూర్చుండి, "నాయనా! ఈసారి ఊపుటవంతునీది" అనువాడు.

మాతండ్రికి నేనేజ్యేష్ఠపుత్రుడను, ఇంట్లో ఏదైనను శుభకార్యము వచ్చినప్పుడు నేనేయింటింటికివెళ్ళి పిలువవలసి వచ్చెడిది. ఆశ్వయుజమాసములో దుర్గోత్సవము. రామమోహనరాయుని పిలుచుటకు బోతిని. "పూజమూడుదినములుప్రతిమాదర్శనమునకురామణిఠాకూర్ తమరినిదయచేయమనిరి"అంటిని. అందుపైనాతడు, "నాయనా! నన్నెందుకుపిలచెదవు? రాధాప్రసాదునుపిలువుము"అనెను.ఇప్పుడింతకాలమైనపిమ్మట ఈమాటలన్నిటికిని నేటికిగదాఅర్థమునుగ్రహించితిని! రామమోహానునివలెనే నేనును విగ్రహారాధనను చూడనని ఇపుడు మనసులో నిశ్చయించికొంటిని. నేనే విగ్రహమునకును మ్రొక్కను, ఏవిగ్రహాపూజకును ఆహ్వానముఁబొందను, అని అప్పటినుండియు నాసంకల్పమును దృఢపరచికొంటిని. ఇందువల్లముందు ఎన్నికష్టములు సంభవించునో కొంచమైనను అప్పుడుగ్రహింపలేకపోతిని. పిమ్మట నాసోదరులకుకూడ ఈవిషయమును చెప్పివారితో కలసి ఒకకట్టుకట్టితిని. నవరాత్రములలో పూజాగృహమునకు ఎవ్వరమును పోగూడదనియు, పోయినను ఏవిగ్రహమునకును మ్రొక్కఁగూడదనియునిశ్చయించికొంటిమి. రోజును మాతండ్రిపూజాగృహమునకు సాయంత్రము హారతి సమయమున వెళ్ళువాడు. ఆయననను సరించి మేమును వెళ్ళవలసియుండెను. కాని విగ్రహమునకు మ్రొక్కెడుసమయమున అందరును భూమిపైసాష్టాంగపడినపుడు మేముమాత్రము నిలబడియే యుండువారము. మేముమ్రొక్కితిమో లేదో ఎవరికిని తెలిసెడిదికాదు.

ఏదైన శాస్త్రమందు విగ్రహారాధనా సంబంధమగు ఉపదేశములుండినయెడల నాకాశాస్త్రమునందిక గౌరవముండెడిదికాదు. ఇం

తేగాదు. మనశాస్త్రసముదాయమంతయు విగ్రహారాధనా శాస్త్రములేయనియు, నిరాకారుడును నిర్వికారుడును అగు ఈశ్వరుని తత్వమును వాటి సహాయముచే తెలిసికొనుట అసంభవమనియు నేనారోజులలో భ్రమపడి నిరాశ చెందియుంటిని. ఇట్టి భావముతోనుండునపుడు ఒకనాడొక సంస్కృతగ్రంధములోని పుటయొకటి నాపక్కనుండి ఎగిరిపోవుచుండుట గాంచితిని. అది ఏమైయుండునాయని తీసిచూచితిని. కాని అందువ్రాసియున్న దానిఅర్థము నాకేమియు బోధపడలేదు. దగ్గరనున్న శ్యామచరణభట్టాచార్యునితో ఇట్లుచెప్పితిని:—"బ్యాంకు (Bank) లో పనిముగియు వెంటనే నేనింటికి వచ్చెదను. ఈలోపున నీవీశ్లోకార్థమును గ్రహించియుంచుము. నేనువచ్చిన పిమ్మట నాకు బోధించెదవుగాక" అని బ్యాంకుకు పోతిని. నాకప్పుడు 'యూనియన్ బ్యాంకు' (Union Bank)లో ఒకఉద్యోగముండెను. నాపినతండ్రి రామనాధ ఠాకూర్ ఖజానాదారుడు. నేనాయనకు సహకారిని. ఉదయము 10 గంటలు మొదలు రోజంతయు ఆతని పనిమైనంతవరకు నేనక్కడ నేయుండవలసివచ్చెడిది. ఆరోజు లెక్కలు సరిచూచు నప్పటికి రాత్రి పదిగంటలయ్యెను. నాడు నేనాపుటలోని సంస్కృతమునకు శ్యామచరణునివద్ద అర్థము తెలిసికొనవలసియుండెను. గనుక యాలస్యమును సహింపలేకపోతిని. కావున మాపినతండ్రిగారివద్ద సెలవు గైకొని త్వరగా ఇంటికి వచ్చితిని. మూడవఅంతస్థుపైనున్న కచేరిసావడిలోనికి వడిగావెళ్ళి "అర్థమును సిద్ధపరచితివా?" అని శ్యామచరణుని అడిగితిని. "అప్పటినుండియు శ్రమపడి యత్నించుచుంటిని, గాని దీని యర్థము కొంచమైనను నాకు తెలియకున్నది." అని అతడు బదులు చెప్పెను. నాకాశ్చర్యమైనది. ఆంగ్లేయపండితులు ఆంగ్లభాషలోనున్న గ్రంధములన్నియు గ్రహింతురే, సంస్కృతవిద్వాంసులు సంస్కృతగ్రంధములన్నియు అట్లే ఎందుకు గ్రహింపలేక పోవలెను? అని శంకపుట్టినది.

ఇంకెవ్వరు దీనికర్థము చెప్పగలరని అతని నడిగితిని. అతడు, "దీనిని చూడ ఇదంతయు బ్రిహ్మసభనుగురించి యున్నట్లుతోచును. బ్రహ్మసభాధ్యక్షుడగు రామచంద్ర విద్యావాగీశుడేమైన చెప్పగలుగునేమో" అనెను. అట్లైన నతని పిలువుమంటిని. కొంతసేపటికి విద్యావాగీశుడు నావద్దకు వచ్చెను. అతడాపుటను చదివి "ఈశావాశ్యమిదం సర్వం యత్కించ జగత్యాంజగత్ । తేనత్యక్తేన భుంజథా మాగృధ దాక స్యస్విద్ధనం" ఇది ఈశోపనిషత్తులోనిది అనెను.

విద్యావాగీశునివద్ద దీని అర్థమును నేర్చికొని నప్పుడు స్వర్గమునుండి అమృత ధారలు వచ్చి నాశిరముపై వర్షించినట్లు తోచెను. నేను మనుష్యసామాన్యుల యొక్క ప్రోత్సాహముకొరకుచిరకాలమునుండి పరితపించుచుండగా ఇప్పుడుస్వర్గమునుండి దైవవాణియేవచ్చి నాధర్మజీవనమునకు తోడుపడినది. నాకోర్కె నేటికి ఫలించినది. ఈశ్వరుని అంతటను దర్శింపవలెనని నాకోరిక. ఉపనిషత్తులలో చెప్పబడిన దేమి ? యావద్విశ్వమును ఈశ్వరునితోనిండి నిబిడీకృతమైయున్నదనియేగదా. అట్లయినచో ఇకఅపవిత్రత అనునది ప్రపంచమున ఎక్కడ ఉండగలదు ? ఈశ్వరుడు సకలమునందును ఉండుట వల్ల సకలమును పవిత్రమే అగును. జగత్తు మధుమయమగును. ఇట్టిసత్యములకొరకే నేనింతకాలమును పరితపించుచుంటిని. నేటికి అవి నాకు దొరకినవి. నామనోభావములు మరెక్కడను ఇంత చక్కగా తెలుపబడియుండలేదు. మనుష్యమాత్రు లీరీతిగ ఎవరు చెప్పగలరు ? ఆయీశ్వరుని కరుణ నాహృదయమునందు ప్రవేశించి వ్యాపించినది. "ఈశావాశ్య మిదంసర్వం" అను గూఢ వాక్యముయొక్క గభీరభావము నేను గ్రహించితిని. ఆహా! ఎట్టి సంగతి వింటిని ! "తేనత్యక్తేన భుంజీత" 'అతడు నీకు ప్రసాదించిన దాని నానందముతో ననుభవింపుము.' అతడిచ్చినదేమి ? అతని సాంగత్యమే. ఈపరమైశ్వర్యము

ననుభవింపుము. తక్కినవన్నిటి నిత్యజించి ఆపరమధనమును మాత్రమే పొందుము. అతనిని మాత్రమే ఆశ్రయించి తక్కినవన్నిటిని వదలి వేయుము. అట్లు అతనిని మాత్రమే ఆశ్రయించి యుండినవాని భాగ్యము ఎంతమహత్తరము! ఇట్టిదానినే నేను చాలకాలమునుండి కోరియుంటిని. దీనినేఇదియు బోధించుచున్నది.

నావిషాదమంత తీవ్రముగ నుండుటేలయన, నాకిహలోక సౌఖ్యమును పరలోకానందముచు కూడ లేకయుండెను. సంసారమునందు నాకేవిధమైన సౌఖ్యమును లేకపోయెను. ఈశ్వరుని యందానందము అనుభవింప లేకుంటిని.

కాని సాంసారిక సౌఖ్యములను భోగములను త్యజింపుమనియు కేవలము ఈశ్వరుని మాత్రమనుభవింపుమనియు ఆదివ్యవాణి వచించినప్పుడు నాకు కావలసినది దొరకినది. ఆనందములో ఒక్కమారుగా మునిగిపోతిని. ఇదినాదుర్బలబుద్ధి యొక్క ఉపదేశము అనుకొన నక్కరలేదు. అదంతయు కేవలము ఈశ్వరోపదేశమే. ఏఋషీశ్వరుని హృదయమునుండి ప్రథమమున ఈమహాసత్యము వెలువడినదో ధన్యుడుగదా ఆతడు! నేటికి ఈశ్వరునియందు నాకు దృఢవిశ్వాసము జనించినది. నేనుసంసారానందమునకు బదులుగా బ్రహ్మానందమును చవిజూచితిని. ఆహా! ఆదినమెంత శుభదినము! ఎంతపవిత్రదినము! ఉపనిషత్తులలోని ప్రతిపదమును నాజ్ఞానమును ప్రజ్వలింపజేసెను. ఉపనిషత్తులను సహాయముగా దీసికొని నాగమ్యస్థానమునకు నడువ నారంభించితిని. ఇప్పటినుంచి సకలగూఢార్థములును నాకు వ్యక్తములగుచుండెను. అంత ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్యోపనిషత్తులన్నియు విద్యావాగీశుని వద్ద క్రమముగా చదివితిని. మిగిలిన ఆరింటిని మరికొందరు పండితుల వద్దచదివితిని. ఏదినమున చదివినదాదినమే కంఠస్థముచేసి మరుసటిదినమున విద్యావాగీశుని కప్పగించుచుంటిని.

నేను వేదములను సరియగు స్వరముతో ఉచ్చరించుట విని విద్యా వాగీశుడు నన్ను, "నీవీస్వరమును ఎట్లునేర్చికొంటివి" అని అడుగు చుండెను. నాకాప్రకారముచ్చరించుట మొదట తెలియదు. కాని తర్వాతనొక ద్రావిడ వైదిక బ్రాహ్మణుని వద్ద నేర్చికొనుటచే నా కది పట్టుబడినది.

ఉపనిషత్తులలో ఎప్పుడు విశేష ప్రవేశము కలిగినదో, సత్య జ్యోతిచే ఎప్పుడు నాజ్ఞానము ప్రకాశింప జేయబడినదో, అప్పటి నుండియు ఈసత్య ధర్మమును వ్యాపింపజేయ వలెనని నామనసు నందొక ప్రబలమగు ఇచ్ఛజనించెను. ప్రపథమమున నాసోదరుల తోను, స్నేహితులతోను బంధువులతోను ఒకసంఘము నేర్పరుప నెంచితిని. మాస్థలములోనున్న చెరువుయొద్ద చిన్నగది యొకటియుం డెను. దీనికివెల్లవేయించి శుభ్రముచేయించితిని. ఇంతలోదుర్గాపూజా దినములు ఆసన్నమాయెను. మాకుటుంబములో నందరు ఉత్సవమున అత్యుత్సాహముతో పాల్గొనిరి. మేముమాత్రము శూన్యహృదయుల మైయుందుమా? ఆకృష్ణ చతుర్దశినాడు మహోత్సాహముతో మేమొక సంఘమును స్థాపించితిమి. మేమందరమును ప్రాతస్నానము చేసి పరిశుభ్రులమై ఆసరోవరతీరమున నున్న గదిలో కూర్చుంటిమి. ఇట్లు వారితో గూర్చుండగనే నాహృదయము భక్తిపూరితమైనట్లు తోచెను. నలుదిక్కులు చూచుసరికి ప్రతిముఖమును భక్తితో ప్రకా శించుచుండెను. గది యంతయు పవిత్రభావముతో నిండియుండెను. భక్తిభావముతో ఈశ్వరునాహ్వానము చేసి కఠోపనిషత్తులోని ఈక్రింది శ్లోకమును వ్యాఖ్యానము చేసితిని.

"నసాంపరాయప్రతి భాతిబలం ప్రమాద్యంతంవిత్తమోహానమృఢం।
అయంలోకోనాంతి పరహితమనీపునః పునర్వశీమాపద్యాతౌమే॥"

"మూర్ఖులకును ధనాంధులకును అజ్ఞానులకును ముక్తిమార్గము కాన్పింపదు. ప్రపంచమే శాశ్వతమనియు పరలోకజీవితము లేనేలేదనియు నమ్మువారు తిరిగితిరిగి ఆమృత్యువువాతను పడుచునే యుందురు."

నాయుపన్యాసము నందరును పవిత్రభావముతో నిశ్శబ్దముగ నాలకించిరి. ఇదియే నాప్రథమ ధర్మోపన్యాసము. ఉపన్యాసము ముగించిన పిమ్మటయీసభ "తత్వరంజని"అనునామముతో పిలువబడును గాకయనియు ఇది చిరస్థాయిని అగుగాక అనియు ప్రస్తాపించితిని. దీని కందరును తమ సమ్మతి తెలియజేసిరి. సంఘముయొక్క ఉద్దేశము బ్రహ్మజ్ఞాన సంపాదనము. ప్రతిమాసమును మొదటి ఆదివారము సాయంకాలము సభచేరు చుండవలయునని స్థిరపరుపబడెను. రెండవ సారిసభ కూడినప్పుడు రామచంద్ర విద్యావాగీశుని ఆహ్వానించితిమి. అతనిని ఆచార్యపదవియందు నియమించితిని. అతడేసభకు తత్వరంజని అను నామమునకు బదులుగా "తత్వబోధిని" అను నామముంచెను. ఈప్రకారము 1839 వ సంవత్సరము, అక్టోబరు 6 వ తేదీని"తత్వబోధినీ" సభ సంస్థాపిత మయ్యెను.



ఆఱవ ప్రకరణము.



'తత్వబోధినీ' సభ 1839 వ సంవత్సరం, అక్టోబరు మాసములో ప్రతిష్ఠితమయ్యెను. మనశాస్త్రముల యందలి నిగూఢతత్వమును, వేదాంతములో ప్రతిపాదింపబడిన బ్రాహ్మవిద్యయును ప్రచారముచేయుటయే దాని ముఖ్యోద్దేశము. వేదాంత దర్శనముయొక్క సిద్ధాంతములందు మాకంత నమ్మకములేదు. ఉపనిషత్తులనే వేదాంతముగా

భావించుచుంటిమి. మొదటి దినమున దీనియందు 10 మంది మాత్రమే సభ్యులుండిరి. ఈసంఖ్యక్రమముగా వృద్ధినొంద సాగెను. ఆరంభమున దీని సమావేశములు మాగృహమునందు క్రింది అంతస్థునందొక విశాలమైనచావడిలో జరుగుచుండెడివి. తరువాత 'సుకియావీధి' (Sukea Street) లోనొక యిల్లు అద్దెకు దీసికొంటిమి. ఆయిల్లు ప్రస్తుతము కాళీకృష్ణఠాకూరుగారి ఆధీనములో నున్నది. ఈరోజులలోనాకు అక్షయకుమార దత్తుతో స్నేహమయ్యెను. ఈశ్వర చంద్రగుప్త ఈయనను తీసుకొనివచ్చి నాకు పరిచితుని చేసెను. అక్షయబాబు 'తత్వబోధినీ' సభలో సభ్యుడయ్యెను. సంఘము ప్రతిమాసము మొదటి ఆదివారమురాత్రి సమావేశమగుచుండెను. ఆచార్య పదవి నుండి రామచంద్రవిద్యావాగీశుడు ఉపన్యసించుచు ప్రతిసారిని ఈ క్రింది శ్లోకము చదువువాడు:—

శ్లో॥ రూపంరూపవివర్జిత స్వభవతో ధ్యానేన యద్వర్ణితం।
స్తుత్యానిర్వచనీయ తాఖిలగురోదూరీ కృతాజన్మయా।
వ్యాపిత్వంచవినాశతం భవగతోయా తీర్థయాత్రాదినా।
క్షన్తవ్యం జగదీశతద్వికలతాదోషత్రయం మత్కృతం॥

"హే! అఖిలగురూ! నీవు రూపవివర్జితుడవు. అయినను ధ్యానముచేసి నేనునీకురూపమును కల్పనచేసితిని. మరియు నిను స్తోత్రముచేసి నీఅనిర్వచనీయతను దూరముచేసితిని. తీర్థయాత్రల సేవించి నీసర్వ వ్యాపిత్వమును వినాశము గావించితిని. హేజగదీశ్వరా! చిత్తవికృతివల్ల నేను చేసిన ఈమూడు దోషములను క్షమింపుము."

ఈసమావేశములలో ఉపన్యసించుటకుసభ్యులందరకునుసమానాధికారముకలదు. కాని ఏసభ్యుడందరకన్న తనవ్యాసమును వ్రాసి సంపాదకునకిచ్చునో అతడు మాత్రమే తనవ్యాసమును సభలోచదువ

వచ్చునని యొక విశేషనియమముండెను. ఈనియమము ననుసరించి మాలోకొందరము వ్యాసములను తీసికొని వెళ్ళి, సంపాదకుడు నిద్రలే వగనే చూచునుగదాయని అభిప్రాయముతో అతని శయ్యపై దిండు క్రింద పెట్టుచు నెంతో యుత్సాహముతో నుండెడివారము. మూడవ సంవత్సరములో నీతత్వబోధినీ సభయొక్క ప్రథమ వార్షికోత్సవము మహావైభవముతో జరుపబడెను. రెండుసంవత్సరములు గడచెనుగాని ఇంకను సభ్యుల సంఖ్య అంతగాలేదు. ఈసభయొకటి యున్నట్లు కూడ చాల మందికి తెలియదు. ఎట్లు ఈకొఱత దీసివేయుటయని ఆలోచించుచుంటిని ఇది 1841 వ సంవత్సరమందు. ఈసాంవత్సరికోత్సవము అందరకు తెలియునట్లు ఒక పెద్దసభ గావింప నిశ్చయించితిని. వార్తాపత్రికలలో ప్రకటించెదమన్న ఆదినములలో వార్తాపత్రికలకంతవ్యాపన యుండెడిదికాదు. కాబట్టి కలకత్తాలోనున్న కచేరీలలోను, కార్యాలయములలోను, ఉద్యోగస్థులుగానున్న వారందరిపేరనువారికచేరీలకు ఆహ్వాన పత్రికలను పంపితిని. ప్రతివారును కచేరికి బోవుసరికి వారిబల్లలపై నొక్కొక ఆహ్వాన పత్రికయుండెను. విప్పిచూచుకొనిరి. అది "తత్వబోధినీసభ" ఆహ్వానము. ఈసభపేరెప్పుడును వారు విని యుండలేదు. అయినను ఎవరైనవత్తురా రారాఅను ఆలోచనచేయక మేము మాత్రము రోజంతయు సభావిషయమగు పని చేయుచుంటిమి. సభాగృహము నేవిధముగ నలంకరించిన బాగుండును, నాడేమి వ్యాసములు చదువుదుము, ఏమియుపన్యాసములిత్తుము, ఎవరెవరేమేమి పని చేయుదము అని ఇట్లెంతో ఉత్సాహముగా ఈప్రయత్నములమీదనే యుంటిమి. సూర్యాస్తమయ మగు నప్పటికి దీపములు వెలిగించితిమి. సభాభవనము నలంకరించితిమి. సమస్తమును సిద్ధము చేసితిమి ఈఆహ్వానమును మన్నించి ఎవరైనను ఇంతకును వత్తురా రారాయని నేను ఆతురము చెందుచుంటిని. చీకటి పడిన తోడనే అనేకమంది, ఒక్కొ

క్కరొక్కరొక్కలాంతరు వేయించికొనివచ్చుచుండిరి. సభాభనముముం దుద్యానవనములోనికి వారినాహ్వానించి 'బెంచీ'లపై కూర్చుండబెట్టితి మి. క్రమముగా జనముక్రిక్కిరిసి తోటయంతయు నిండిపోయెను. వీరందరిని చూచుటతో మాకు నూతనోత్సాహము జనించెను. తామెందుకు వచ్చిరో ఏమిజరుగబోవనున్నదో వారెవ్వరికిని ఏమియు తెలియదు. ఎనిమిది గంటలెప్పుడగునాయని గడియారము తీసి ప్రతి క్షణమును ఆత్రముతో చూచుచుంటిని. ఎనిమిదిగంటలు కొట్టిన వెంటనే, శంఖములు గంటలు బాకాలు 'డాబా' మీదనుండి ఒక్కసారిగా ఖంగున మ్రోగెను. సభాగృహము యొక్క తలుపులన్నియు తటాలున తెరువబడెను. వచ్చినవారందరును ఆశ్చర్య మగ్నులయిరి. పిమ్మట వారిని లోనికాహ్వానము చేసి కూర్చుండ బెట్టితిని. ఎదురుగా వేదికయుండెను. దాని కిరువంకలను పదుగురేసి మంది ద్రావిడ బ్రాహ్మణులు రెండువరుసలుగా కూర్చుండిరి. ఈ ఇరువది మందియు చంగాయవస్త్రములను ధరించి యుండిరి. రామచంద్రవిద్యావాగీశుడు వేదికపై కూర్చుండెను. అపుడు ద్రావిడ బ్రాహ్మణులు ఏకస్వరముతో వేదగానము చేయనారంభించిరి. వేదపఠనము ముగియునప్పటికి రాత్రి పదిగంటలు దాటెను. పిమ్మట నేను లేచి ఉపన్యసించితిని. ఆయుపన్యాసము నందొకచో ఈవిధముగా నుడివితిని. "ఆంగ్లేయభాష ఈ కాలములో ఆలోచన శక్తిని, విద్యను అభివృద్ధి చేయుచున్నదనియు, ఈదేశస్థుల మనస్సుల యందావరించి యున్న అవివేకాంధకారమును చాలవరకు దూరీకృతము గావించినదనియు చెప్పుటకెంతమాత్రమును సందేహములేదు. ఈఆంగ్లవిద్యను నేర్చినవారు, పామరులు చేయునట్లు, రాళ్ళను రప్పలను ఈశ్వరునిగా భావించి పూజించుటకిష్టపడరు. కాని ఇదంతయు ఆంగ్లశాస్త్రములందే కాని మనశాస్త్రములలో లేదని వారియూహ. వేదాంతజ్ఞానము సరిగవ్యాపింపకుండుటచే

ఈశ్వరుడు నిరాకారుడనియు చైతన్య స్వరూపుడనియు సర్వగతుడనియు అచింత్యుడనియు అనిర్వాచ్యుడనియు చెప్పుమన శాస్త్రములను వారు గ్రహింపలేక ఇట్లభిప్రాయ పడుచున్నారు. మన ధర్మమునందలి పరిశుద్ధబ్రహ్మజ్ఞానము పొందజాలక అన్యధర్మావలంబీకుల శాస్త్రములలో వెతుక నారంభించుచున్నారు. మనశాస్త్రములయందు చెప్పబడినదంతయు కేవలము సాకారోపాసనయే అని వారు దృఢముగ నమ్ముచున్నారు. కాని వేదాంత ధర్మమునే బాగుగవ్యాపింపజేసినచో తక్కిన మతముల కొరకిట్లు ఆశింపము. గావున ఇట్టివ్యాపనను జేసి మన హిందూధర్మమును కాపాడుటకు మేము ప్రయత్నించుచున్నాము."

నాయుపన్యాసానంతరమున శ్యామచరణుడు తన యుపన్యాసము చదివెను. పిమ్మట చంద్రనాధరాయ్, తరువాత ఉమేశచంద్రరాయ్, అటుపై ప్రసన్నచంద్రఘోష్, తదనంతరము అక్షయకుమారదత్, ఆఖరున రామప్రసాదరాయ్ ఉపన్యసించిరి. అప్పటికి రాత్రి 12 గంటలు దాటిపోయెను. ఇదంతయు ముగిసిన పిమ్మట రామచంద్ర విద్యావాగీశుడు ప్రసంగించెను. అటుపైన కీర్తనలు పాడితిమి. రెండు గంటలు దాటెను. జనులు మిక్కిలి ప్రయాసము చెందిరి. అనేకులు 'ఆఫీసు'నుండి తిన్నగవచ్చుటకేవచ్చిరి. నాయందుండిన గౌరవముచేసభ ముగియువరకును ఎవరును వదలి వెళ్ళలేకపోయిరి. మేముచెప్పిన దనేకులు వినియుండరు ఒకవేళ విన్నను అనేకులకు తెలిసి ఉండదు. ఐనను సభమాత్రము మహావైభవముతో ముగిసెను. మా 'తత్వబోధినీ' సభయొక్క ప్రథమసాంవత్సరికోత్సవము ఇదియే. అంత్యసాంవత్సరీకముకూడ ఇదియే ఇది జరిగిన పిమ్మట 1842 వ సంవత్సరమున నేను బ్రహ్మసమాజములో చేరితిని.

బ్రాహ్మసమాజసంస్థాపకుడు, మహాత్ముడు, రామమోహనుడు ఇంతకు 11 సంవత్సరములకు క్రిందట ఇంగ్లండునందు 'బ్రిస్టల్' (Bristol) నగరములో మరణించెను. బ్రాహ్మసమాజము బ్రహ్మోపాసనకొరకు స్థాపింపబడినదే గావున మా 'తత్వబోధినీ' సభనుదానితో చేర్చిన యీసంకల్పము ఇంకను సునాయాసముగా నెరవేరునని నేను భావించితిని. ఇట్లు భావించి నేనొక బుధవారమునాడు ఆసమాజమును దర్శింపబోతిని. సమాజమునందొక ప్రక్కగదిలో నొక ద్రావిడ బ్రాహ్మణుడు సూర్యాస్తమయమునకు పూర్వము ఉపనిషత్తులు పఠనము చేయుచుండెను. రామచంద్రవిద్యావాగీశ్, ఈశ్వరచంద్రన్యాయరత్న, మరియొకరిద్దరు బ్రాహ్మణులు మాత్రము వినుచుకూర్చుండిరి. శూద్రులచ్చటకు పోవుట కధికారములేదు. సూర్యాస్తమయమైన పిమ్మట రామచంద్రవిద్యావాగీశుడును ఈశ్వరచంద్రన్యాయ రత్నయును బహిరంగముగా వేదికపై కూర్చుండిరి. ఇక్కడ బ్రాహ్మణులకు నుశూద్రులకును అందరకు సమానాధికారముండెను. వచ్చిన వారి సంఖ్య బహు స్వల్పముగానుండెను. వేదికయొక్కకుడివైపునఒక తెల్లని దుప్పటి పరచియుంచిరి. అందు మీద నలుగురైదుగురుపాసకులు కూర్చుండిరి ఎడమవైపున కొన్ని కుర్చీలుండెను. వానిలో ముగ్గురునలుగురు చూడవచ్చిన వారు కూర్చుండిరి. ఈశ్వరచంద్రన్యాయరత్న యుపనిషత్తులు వ్యాఖ్యానించెను. విద్యావాగీశమహాశయుడు వేదాంత దర్శనము యొక్క మీమాంస విప్పి చెప్పెను. వేదికముందు కృష్ణ, విష్ణు అను ఇద్దరు సోదరులు కలసి ఒక్కస్వరముతో బ్రహ్మకీర్తనలు పాడిరి. ఉపాసనముగియునప్పటికి రాత్రి 9 గంట లయ్యెను. ఇదిచూచి నపిమ్మట బ్రాహ్మసమాజమును ఔన్నత్యమునకు తెచ్చుభారమునుపూని 'తత్వబోధినీ' సభను దీనితో సంయుక్తము చేసితిని. అప్పటినుండియు 'తత్వబోధినీ'సభయొక్క సమావేశమువలెగాక బ్రాహ్మసమాజోపాస

నలు ప్రాతఃకాలములందు జరుగుచుండెను. 'తత్వబోధినీ' సభ బ్రాహ్మసమాజ తత్వావధానము చేయవలెనని నిర్ధారణ చేయబడెను. 'తత్వబోధినీ' సభాసాంవత్సరికోత్సవము ఆశ్వయుజచతుర్దశినాడు జరుగుటకు బదులు బ్రాహ్మసమాజము స్థాపింపబడిన మాఘ ఏకాదశి నాడు (మాఘోత్సవము) జరుపుటకు నిశ్చయింపబడినది. 1828 సం॥ర మున 'జొరాశాంకో' (Jorasanko) నందు కమల్ బాసుకు చెందినఅద్దె గృహములో బ్రాహ్మసమాజము ప్రథమమున స్థాపింపబడెను. నేను బ్రాహ్మసమాజములో చేరకముందు దీనివార్షికోత్సవము1822 సం॥ నుండి జరుపుట మానిరి.

మేము బ్రాహ్మసమాజమున అధికారము పూనుట ప్రారంభించినప్పటినుండియు దాని యౌన్నత్యమునకొరకు మొదటి యుపాయముగా, దీని సభ్యుల సంఖ్య నభివృద్ధిచేయుట యెట్లని యోచింపమొదలిడితిని. క్రమముగా ఈశ్వరానుగ్రహమువల్లను మాప్రయత్నములమూలముననను ఎక్కువమంది చేరుచుండిరి. సంఖ్యాభివృద్ధితోబాటు స్థలవిస్తీర్ణత హెచ్చెను. ఇదిమాకెంతయో ఉత్సాహముపురికొల్పెను. ఇంతకుముందు సమాజము రెండుమూడు కుటీరములుగా విభజింపబడియుండెను. కాలక్రమమున నివి పడగొట్టబడెను. ప్రస్తుతమువాని బదులొక ప్రశస్తభవనము నిర్మింపబడియున్నది. స్థలము విశాలమై సంఖ్య అధికమైనకొలదియు బ్రాహ్మసమాజము అభివృద్ధి నొందుచున్నదని భావించితిమి. ఇందువల్ల మనస్సునకెంతయో ఆనందము కల్గెను.



## ఏడవ ప్రకరణము.



ఎంతయో సాధనచేసిన పిమ్మట నాహృదయమునందుదయించిన ఆయీశ్వరజ్ఞానము ఉపనిషత్తులలో ప్రతిధ్వనించుచుండెను. ఉపనిషదర్థమునుగూర్చి ఆలోచించి దానిని గ్రహించినపుడెల్ల నాహృదయమునందది ప్రతిధ్వనించుచుండెను. కావున ఉపనిషత్తుల యెడల నాకు విశేషగౌరవము జనించెను. "అతడే పిత, త్రాత, బంధువు"అని నాహృదయము ఘోషించుచుండెను. ఆదియె ఉపనిషత్తులలో "సనో బంధుర్జని తాసవిధాతా" యను శ్లోకము రూపమున కాన్పించెను. అతనిని పొందకున్నయెడల పుత్రులు, విత్తము, మానము, మర్యాద' అన్నియు నాకువృథా. అతడు పుత్రులకన్నను, విత్తముకన్నను, ఇంక అన్నిటికన్నను ఎక్కువ ప్రియమైనవాడు, అని తిరిగి ఆలోచినది. ఉపనిషత్తులవంక తిరుగగా ఇదియే ఈశ్లోకములో కనబడెను:—

"తదేతత్ప్రేయః పుత్రాత్ ప్రేయో విత్తాత్ ప్రేయో
న్యస్మాత్ సర్వాస్మాత్॥"

నాకైశ్వర్య మక్కరలేదు. నాకుకీర్తి అక్కరలేదు. మరి నాకు కావలసినదేమి? "బ్రహ్మోత్యు పాసీత్ బ్రహ్మావాన్ భవతి",అని ఉపనిషత్తులు ప్రత్యుత్తరమిచ్చినవి. బ్రహ్మను ఉపాసించువారు బ్రహ్మను పొందగలడు. దీనికి నాహృదయమునుండి "నిజము, నిజము" అని ప్రత్యుత్తరము వచ్చెను. ధనమును పొందగోరువాడు ధనమునుపొందును ఇదియు నిజమే. ఎవడు ధనము నుపాసించునో అతడు ధనమును పొందితీరును. ఎవడు యశస్సు నుపాసించునో అతడుయశస్సును పొందగలుగును. అట్లే బ్రహ్మనుపాసించువాడు బ్రహ్మను పొందునన్నమాట సత్యము. ఉపనిషత్తులలో "యఆత్మదాబలదా"అని చూచినపుడు నా

ప్రాణతుల్యమైన విషయమును నేనుపొందితిని. ఈశ్వరుడు మనకు ప్రాణములనే గాక ఆత్మలనుకూడ దయచేసియున్నాడు. అతడు కేవలము మనప్రాణములకు ప్రాణమేగాక ఆత్మలకు ఆత్మకూడనైయున్నాడు. ఈశ్వరుని ఆత్మనుండియే మనయొక్క ఆత్మలు జనించినవి. అతడు, అద్వితీయుడు, నిత్యుడు, వికారము చెందనివాడు, అనంతడు, అతడు కేవలము జ్ఞానస్వరూపుడు. పరమాత్మ నాశరహితుడైయుండి తనస్వరూపమునుండి అసంఖ్యాకములైన పరిమితాత్మలను సృజించుచున్నాడు. ఈవిషయమే ఉపనిషత్తులలో నీక్రిందివిధముగా చెప్పబడియున్నది. "ఏకం రూపం బహుధాయిః కరోతి". "ఏకస్వరూపమునుండి అనేకస్వరూపముల నెవడు చేయుచున్నాడో" అతని నుపాసించినచో, ప్రతిఫలముగా నతనినే పొందుచున్నాము. అతడు ఉపాసింపబడువాడు, నేనతని యుపాసకుడను, ఆతడు నాకుప్రభువు, నేనతనికి భృత్యుడను. అతడు నాకు పిత, నేనాతనికి పుత్రుడను. ఈభావమువలన నేనుపాలింపబడుదును. "ఓహూ! ఎప్పుడు ఈసత్యము భరతవర్షమునందు ప్రచారమగునోగదా! అందరును ఎప్పుడు ఈప్రకారము ఈశ్వరుని పూజింతురోగదా! అయన మహిమ ఈవిధముగ ఎప్పుడు సర్వత్ర ఉద్ఘోషింపబడునోగదా" అని ఇట్లు సర్వదా తల్లడిల్లువాడను. ఇదియే నా జీవితముయొక్క లక్ష్యమైపోయెను. ఈలక్ష్యమును బడయుటకు ఒక ముద్రాలయము, ఒకపత్రిక అవశ్యమని తోచెను.

తత్వబోధినీ సభ్యులు అనేకులు కార్యాచరణవిషయములందు భేదాభిప్రాయములతో నుండినట్లు తోచెను. సభలవిషయమగు ప్రకటనలు వారికందుచుండెడివి. అందినను అనేకులు రాలేకపోవుచుండిరి. వచ్చినవారిలో అనేకులకు సభలో నేమిజరుగుచున్నదియు తెలిసెడిది కాదు. అనేకులకు, ముఖ్యముగా వ్యాపింపవలసిన విద్యావాగీశుని యుపన్యాసములే వినుటకు వీలులేకుండెను. రామమోహనరాయలు.

బ్రహ్మజ్ఞానము వ్యాపింపజేయు నుద్దేశముతో తాను ప్రచురించిన గ్రంథములు, ఇంకను అనేకుల కందునట్లుచేయవలసియున్నది. ఇంకను ప్రజలజ్ఞానమునుఅభివృద్ధిచేసి, వారికిచరిత్రవిషయములను తెలియచేయగల అనేకవిషయములను ప్రచురించుట అవశ్యకము. ఈయభిప్రాయములు మనసునందుంచుకొని 1843 లో 'తత్వబోధినీ' పత్రికాప్రచారము సంకల్పించుకొంటిని. దీనికొక పత్రికా సంపాదకుని నియోగించుట అవశ్యకమయ్యెను. సభ్యులలో ననేకుల వ్యాసరచనను పరీక్షించితినిగాని, అక్షయకుమారదత్తుని రచనానైపుణ్యమునుబట్టి యీతని నేర్పాటుచేసితిని. అతని రచన యిందు గుణములతోబాటు దోషములుకూడి ఉండెను. కాని అది మధురముగను హృదయంగమముగను ఉండెను. ఇది గొప్పసుగుణము. కాని అతని యందొకలోపముండెను. సంసారములను వదలి, వికారవేషముల వేసికొని, ఒడలంత బూడిద పూసికొని ఆడంబరముగ జీవనముచేయు సన్యాసులగూర్చి అతడు ప్రశంసించుచుండెను. బాహ్యసన్యాసములు, వికృతవేషములు నామతమునకు విరుద్ధములు. ఐనను అతను వ్రాసిన యభిప్రాయములు నేను సరిచూచుట కతడు ఇష్టపడినయెడల నతనిని నియమింపవచ్చునని కొంటిని. అట్లే జరిగెను. పెద్దజీతమునిచ్చి అక్షయబాబును ఈకార్యమునకు నియమించితిని. అతని వ్రాతలలో నాయభిప్రాయములకు విరుద్ధమైన అభిప్రాయములున్నచో అతనినిగూడ నాయభిప్రాయమునకు త్రిప్పుకొనుటకు ప్రయత్నించుచుంటిని. కాని ఇదంత సులభముగసాగలేదు. కాలక్రమమున మాయిరువురి యభిప్రాయములును పూర్తిగా వ్యతిరేకములై పరిణమించెను. నేను ఈశ్వరునకును నాకునుగల సంబంధమునుకనుగొన ప్రయత్నింపుచుంటిని. మానవ ప్రకృతికిని బాహ్యవస్తువులకును గల సంబంధమును కనుగొనుట కతడు ప్రయత్నించుచుండెను. మాయిరువురకును ఉండుభేదము ఆకాశ పాతాళ ప్రభేదము,

తుట్టతుదకెట్లో అటువంటివాని సహాయముతోనే 'తత్వబోధినీ' పత్రికయందు నాయాశయముల నెరవేర్చగలిగితిని. అతని రచనాసౌష్ఠవము ఆకాలమున బహుకొలదిమందికి మాత్రమేయుండెను. అప్పుడు వార్తా పత్రికలుగూడ బహుకొలదిగా నుండెను. అవిమైననులోకహితకారులుగను, జ్ఞానాభివృద్ధిదాయకములుగను ఉండు వ్యాసములను ప్రచురింపుచుండెడివికావు. వంగదేశమునందు ప్రప్రథమమున 'తత్వబోధినీ' పత్రికయే ఈలోపమును తొలగించెను. వేదవేదాంతములును, పరబ్రహ్మోపాసనయు వ్యాపింపజేయుట నాముఖ్యసంకల్పము. ఈపత్రిక ద్వారా నాసంకల్పమును నెరవేర్చికొంటిని.

బ్రహ్మ ప్రతిపాదక ఉపనిషత్తులనే మేము వేదాంతముగా భావించుచుంటిమి. వేదాంతదర్శనమందు శంకరాచార్యులు బ్రహ్మను జీవిని ఏకముచేసెను. గనుక దానియందు మాకంత శ్రద్ధలేకుండెను. మాకు కావలసినది యీశ్వరోపాసన. ఉపాసకుడును ఉపాస్యమును ఒక్కటేయైనచో ఇంక ఉపాసన ఎవరుచేయుట ? ఎవరికిచేయుట ? వేదాంతదర్శనమందలి మతమునకు మేము సమ్మతింపలేదు. మేము విగ్రహారాధన కెట్లు విరోధులమో అద్వైతమునకును అట్లే విరోధులము. ఉపనిషత్సూత్రముల కన్నిటికిని శంకరాచార్యులు అద్వైతపరముగా నర్థము చెప్పసాగెను. గావున శంకరుల వ్యాఖ్యానముతో మేము పూర్తిగ ఏకీభవింపలేదు. ఇందువల్ల శంకరభాష్యములకుమారుగా నేనుపనిషత్తులకు క్రొత్తవ్యాఖ్యానము వ్రాయవలసివచ్చెను. ఆస్తిక సిద్ధాంతమును నిర్ధారణచేయు సంస్కృతవ్యాఖ్యాన మొకటి వ్రాసితిని. దానిని బంగాళీలోనికి భాషాంతరీకరించి 'తత్వబోధిని'లో భాగములుగా ప్రకటింప నారంభించితిని.



## ఎనిమిదవ ప్రకరణము.

—००:※:००—

మొట్టమొదట 'తత్వబోధినీ' పత్రికా ముద్రాలయము "హేడ్వా" (Hedua) యందొక యింటిలో నుంచితిమి. ఈ "హేడ్వా' యే నేను చదువుచుండిన రామమోహనరాయలవారి స్కూలుండిన స్థలము. ఉపనిషత్తులును వేదాంత భాష్యమును నాతో కలసి చదువుటకు రామచంద్ర విద్యావాగీశుడు ఇచ్చటికి వచ్చుచుండెను. ఒకసారి మాతండ్రిగారన్న మాటలకు జడిసి మాయింటి వద్ద ఈపనిచేయుటకు సాహసింపలేదు. విద్యావాగీశుని యెడల చిరాకు పుట్టి ఒకసారి మాతండ్రిగారు, "విద్యావాగీశుడు బుద్ధిమంతుడను కొంటిని, గాని తన బ్రహ్మోపమంత్రముల నుపదేశించి మాదేవేంద్రుని పాడుచేయుచున్నాడు. మావానికి అసలే ప్రపంచజ్ఞానము స్వల్పము. ఇప్పుడుదానియందు బొత్తుగా శ్రద్ధలేదు. దినమంతయు, 'బ్రహ్మ, బహ్మ' తప్పమరేమియు లేదు."

ఈవిధముగ మాతండ్రి గారికి విసుగు పుట్టుటకు కారణము లేకపోలేదు. అదియెట్లన. లార్డు ఆక్లండు (Lord Auakland) గవర్నరు జనరల్‌గానుండి నపుడు, ఒకసారి మా "బెల్గేచియా" (Belgachia) ఉద్యానవనములో ఆయన చెల్లెలగు మిస్ ఈడెన్ (Miss Eden) గారికి మరికొందరు గొప్ప గొప్ప ఏలికలకు దొరసానులకు మాతండ్రిగారు ఒక గొప్ప విందొసంగిరి. సౌందర్యములు, నృత్యములు, మద్యపానములు దేదీప్యమానమగు దీపకాంతులు, అన్నియును కలసి ఉద్యానవనమును ఒక్కమారుగా ఇంద్రభవనముగా మార్చివేసెను. విఖ్యాతులగు కొందరు బంగాళీలు ఈవిందును చూచిన పిమ్మట మాతండ్రిగారిని గురించి, "ఈయనకు కావలసినదెంతసేపూ ఆంగ్లేయులే, బంగాళీల నెప్పుడు ఆహ్వానింపడు" అనిరి. ఇదిమాతండ్రిగారి చెవినిబడెను.

కావున కొంత కాలమైన పిమ్మట బంగాళీ ప్రముఖులను కొందరను పిలచి, గానములతోను నృత్యములతోను ఆయుద్యానవనముననే ఇంకొక వేడుక కావించిరి. నాడు ముఖ్యముగా నేనువారినందరిని యాదరింపవలసి యుండెను. కాని విధివశమున నాడే "తత్వబోధినీ" సభాసమావేశము కూడ కావలసి యుండెను. నాడాసభా విషయమున మునిగి యుంటిని. మేమాదినము ఈశ్వరోపాసన చేయవలసి యుండెను. కావున ఈముఖ్యకర్తవ్యమును వదలి యాసభకు వెళ్ళజాలక పోతిని. మాతండ్రిగారి కాగ్రహమువచ్చునేమోయని ఒక్కమారు మాత్రము ముఖము కనబరచి మరలి పోతిని దీనిని. బట్టి నాకు ప్రపంచము యెడల గల యుదాసీనభావము ఆయనకు స్పష్టపడెను.

అప్పటినుండియు నేను వేదాంతము చదివియు, 'బ్రహ్మ బ్రహ్మ' యనియు చెడిపోకుండ చూచుటకు మాతండ్రిగారు చాల జాగ్రత పడుచుండిరి. ఆయన అభిలాష ఏమనిన, తమదృష్టాంతమ ననుకరించి నేనును గౌరవమును, మర్యాదను, ప్రాముఖ్యతను బడసి అందరిలోనను యశోవంతుడను కావలెనని. కాని నామనసట్టివాని కన్నిటికి విపరీతముగా నుండుటచూచి ఆయన ఎల్లప్పుడును దుఃఖించుచు బెంగగొని యుండెను. అయినను నామనోభావముల నింకనుఆయన పూర్తిగ తెలిసికొనలేకుండెను. ఒకవంక నాకు సాంఘికమర్యాదలు కావలెనని ఆయన కోరుచుండగా, ఇంకొకవంక "ఈశ్వరా! నీవు లేనిదే నాకీజీవనముండి ఏమిప్రయోజనము" అని నేనెంతో పరితపించుచుంటినని ఆయనకేమి తెలియును. ఉపనిషత్తులలో "నావిత్తేనతర్పణీయమనుష్యః" అను మాటలను చదివి ధనమునందు సంపూర్ణ విముఖత్వమునందితినని ఆయన ఇంకను ఎరుగడు. అట్టి నన్ను ఇంక తిరిగి విషయసౌఖ్యములలో ఆయన ఎట్లు ముంపగలుగును? ఆయనేకాదు, ఇంకెవ్వరును ముంపజాలరు. ఇంకేయాశయు నన్ను

మరల్పజాలదు ఈశ్వరునుండి. విద్యావాగీశుడు మాత్రము భయపడి నాతో, " మీ తండ్రిగారు దీనికిష్టపడుట లేదుగావున నీకింక పాఠము లను చెప్పజాలను. " అనెను. అందుపైని అతనితో " మాయింటి కిరానక్కఱలేదుకాని, ముద్రాయంత్రములోనికి వచ్చిచెప్పుచుండు మం" టిని. అతడట్లే చేయుచుండెను. ఇది విద్యావాగీశుని మీదను నామీదను మా తండ్రిగారి కోపమునకు కారణము.

బ్రాహ్మసమాజమును ప్రథమమున చూచినప్పుడు, శూద్రులు వినకుండ వేదములు ప్రత్యేకముగా వేరొకగదిలో చదువబడుచుండె ను. నాకిది చాల కష్టముగా తోచెను. బ్రాహ్మసమాజోద్దేశము బ్రహ్మోపాసన ప్రజలలో వ్యాపింపజేయుటయే. జాతిభేదములు లేకుండ బ్రహ్మోపాసన చేయవలెనని ' ట్రస్టుడీడ్ ' (Trust Deed) లో చెప్పబడియున్నది. కాని ఈవిపరీతవ్యవహారమును చూడగానాకు మిక్కిలి దుఃఖమువచ్చెను. మరియొకసారి ఏమిజరిగెననగా, రామ చంద్రవిద్యావాగీశుని సహోద్యోగియగు ఈశ్వరచంద్రన్యా యరత్న బ్రాహ్మసమాజవేదికనుండి శ్రీరాముడు అవతార పురుషుడని సిద్ధాంతముచేయుటకు ప్రయత్నించుచుండెను. ఇది బ్రాహ్మధర్మము నకు కేవలము విరుద్ధ బోధగానున్నట్లునాకుతోచెను. వీటికి ప్రతివి ధానము చేయుటకుగాను వేదములు బహిరంగముగ చదువుట కేర్పా టుచేసి, వేదికపైనుండి అవతార వాదవర్ణనలు చేయుట నివారణ చేసి తిని. అరోజులలో వేదములు చదువగలిగినవారు బ్రాహ్మధర్మోపదేశ ములు చేయగలిగినవారు బహుస్వల్పముగా నుండిరి. కావున సంస్కృ తభాషయందొక పరీక్షగావింతుమనియు, దానిలో నుత్తీర్ణులైనవారు "తత్వబోధినీ" సభయందుచేర్పబడురనియు, శిక్షాలాభమునకు విద్యా ర్థివేతనము లివ్వబడుననియు ' తత్వబోధినీ ' పత్రిక యందు ప్రక టించితిని. పరీక్షానియమిత దినమున అయిదారుగురు వచ్చి విద్యా

వాగీశునిచే పరీక్షింపబడిరి. వారిలో ఆనంద చంద్రుడును, తారకనాథుడును, ఎన్నుకొన బడిరి. వారిద్దరియందును నాకు మిక్కిలి యిష్టము. ఆనందచంద్రునకు దీర్ఘములగు కేశములుండుటచే "సుకేశ" యనుముద్దు పేరుతో నతని పిలచువాడను.



## తొమ్మిదవ ప్రకరణము.



బ్రాహ్మసమాజమునందు ధర్మజీవనములో నొకరి కొకరికి స్నేహాభావము లేదుగదా యని చింతించుచు నొకనాడు ముద్రాలయములో కూర్చుంటిని ప్రవాహమునందు పోటుపాటువలె జనమువచ్చుచు పోవుచుండిరి. గాని ఒక్క ధర్మసూత్రములో అందరును బంధింపబడి యుండలేదు. కావున సమాజమున సభ్యులుగానుండగోరువారి సంఖ్య ఎక్కువగుచున్న కొలది అందులో కొందరినిమాత్రమే తీసికొనుట మంచిదని నాకుతోచినది. కొందరు యథార్థముగ ఉపాసనకొరకు వచ్చుచుండిరి. మరికొందరు ఏయుద్దేశమును లేకయే వచ్చుచు పోవుచుండిరి. ఇందులో నిజమగు బ్రహ్మోపాసకులు ఎవరో గ్రహించు టెట్లు? ఇట్లు ఆలోచించి ఒక నిశ్చయమునకు వచ్చితిని. విగ్రహారాధనను త్యజించి, ఏకేశ్వరోపాసనావ్రతులై, ఎవరు ప్రతిజ్ఞాబద్ధులయ్యెదరో వారినిమాత్రము బ్రాహ్మలుగా భావింపనిశ్చయించితిని. ఉన్నది బ్రాహ్మసమాజముగావున సభ్యులుగానుండు వారందరును బ్రాహ్ములుగానుండుట అవసరము.

ఆరంభమున బ్రాహ్మసమాజము బయలుదేరినది బ్రాహ్మలు నలుగురుచేరగా అని అనేకులు భావింతురు. అది వాస్తవముగాదు బ్రాహ్మసమాజమునందు చేరుటవలననే సభ్యులకు బ్రాహ్మయని పేరు వచ్చినది. నియమ పూర్వకముగా జరుగని కార్యములెవ్వియు సఫలత

నొందవనుమాట నిజముగదా! గనుక విగ్రహారాధన బదులు ఏకేశ్వ రోపాసన నెలకొలుపబడుటకు, బ్రాహ్మధర్మస్వీకారము యథావిధిగా జరుగుట ఒక ముఖ్యకర్తవ్యమని ఎంచి బ్రాహ్మధర్మ స్వీకారమునకు నేనొక ప్రతిజ్ఞపత్రమును తయారుచేసితిని. దీనిప్రకారము, ప్రతిదిన మును గాయత్రీ మంత్రముద్వారా బ్రాహ్మోపాసన గావింపవలెనని యొక నియమమును ఏర్పాటుచేసితిని. గాయత్రిద్వారా బ్రాహ్మోపా సన చేయవలయునని రామమోహనుడు చెప్పియున్నాడు. ఈసంగతి యే ఇప్పుడు నాకీనియమమును స్ఫురింపచేసెను. బ్రాహ్మోపాసనా విధానమువలన నాకొక ఆశబయలుదేరెను. "ఓంకార పూర్వికాస్తి స్రోమహా వ్యాహృత యోహావ్యయాత్రి పదాచైవ సావిత్రీ విజ్ఞేయం బ్రాహ్మణోముఖం." ఓంకారముతో గూడిన "భూర్భువస్సువః" యను గాయత్రిలోని తక్కిన మూడుభాగములును బ్రహ్మప్రాప్తికి మూడు ద్వారములు. "ఓంకారము" తోడను, వ్యాహృతులతోడను, గాయత్రి మంత్రమును మూడు సంవత్సరములు ఏకదీక్షగా జపముచేసినచో బ్రహ్మను పొందవచ్చునని నానమ్మకము. అందుచే నేనీప్రతిజ్ఞా పత్రము లో, ఉదయముననే, ఏదియును భుజింపకముందు ఈఉపాసనను గావిం పవలయునని కూడ వ్రాసితిని.

1843 సంవత్సరమున పుష్యసప్తమి, బ్రాహ్మధర్మ స్వీకారము నకు స్థిరపరచితిమి. వేదములుచదువు గదికి తెరగట్టించితిని. సంబంధ ములేనివారలు లోనికి రాసీయవలదని యాజ్ఞాపించితిని. విద్యావాగీ శుడు వేదికపై నాసీనుడై యుండెను. మేమందరమును చుట్టును కూ ర్చుంటిమి. మాహృదయములలో నొకనూతనోత్సాహముజ్వలించుచుం డెను. ఈదినమున మాహృదయములలో నాటబడు ఈబ్రాహ్మధర్మ బీజము అంకురించి కాలక్రమమున అసంఖ్యాకములగుఇతరవృక్షముల కుమూలమై అనంతకాలమునిలచి యుండునకబాయని నమ్మితిమి. అవి

ఫలించినపిమ్మట నిశ్చయముగా వానిలోనుండి యమృతము లభించునని ఉఱ్ఱూతలూరుచుంటిమి. ఇట్టి ఆశలలోనుండి మహోత్సాహ పూరితుడనై యున్న నేను వినమ్ర భావముతో నపుడు విద్యావాగీశుని ముంగిట నిలచి. "నేడీసుముహూర్తమున పరమ పవిత్రమగు యీబ్రాహ్మసమాజమందిరమందు విశుద్ధబ్రాహ్మధర్మ వ్రతమును స్వీకరించుటకు మేమందరమును మీచెంతకు వచ్చితిమి. మమ్ములనందరను ముక్తిపథోన్ముఖులను గావింపుడు. పరిమితదేవతలయందు విరక్తిపుట్టించిఏకమై అద్వితీయమై వెలుంగు ఆపరబ్రహ్మమునుపాసించునట్లును, జీవితమునందు దుష్టకర్మలను వదలి, సత్కర్మలనే ఆచరించునట్లును, పాపమునందును మోహమునందును తగుల్కొనక విశుద్ధాత్ములుగ నుండునట్లును, మమ్ము నీయుపన్యాసములచే పురికొల్పుము" అని పల్కితిని.

ఈవాక్యముల వినియు, నాహృదయ నిశ్చయమును చూచియు విద్యావాగీశుడు కండ్లనీరుపెట్టుకొని, "ఆహా! నేటికిగదా, రామమోహనుని యుద్దేశము నెరవేరినది. నేడిది చూచుట కతడేయుండినచో ఎంత యానందించియుండునో గదా! ఎంతకాలమున కతని కోరిక నెరవేరినది!" అని పగవజొచ్చెను. మొట్టమొదట శ్రీధరభట్టాచార్యుడులేచి వేదికముందు ప్రతిజ్ఞలనుచదివి బ్రాహ్మధర్మమును స్వీకరించెను. పిమ్మట శ్యామచరణ భట్టాచార్యుడు, తరువాత నేను, తరువాత వ్రజేంద్రనాథఠాకూరు, గిరీంద్రనాథఠాకూరు, ఆనందచంద్రభట్టాచార్య, తారకనాథభట్టాచార్య, హరదేవచట్టోపాధ్యాయ్, అక్షయకుమారదత్తు, హరిశ్చంద్రనంది, లాలాహజారిలాల్, శ్యామచరణం ముఖోపాధ్యాయ్, భవానిచరణసేను, చంద్రనాథరాయ్, రామనారాయణచట్టోపాధ్యాయ్, శశిభూషణ ముఖోపాధ్యాయ్, జగచ్చంద్రరాయ్, లోకనాథరాయ్, ఇంక మరికొందరును ఇట్లు మొత్తము మీద ఇరువదిమొక్కరు ఒకరివెంట నొకరు బ్రాహ్మధర్మమును స్వీక

రించిరి. తత్వబోధినీసభ బయలుదేరదీసిన దినము ఎప్పటికిని మరుపున కు రావలసినది కాదని చెప్పియుంటిని. అట్లే బ్రాహ్మధర్మమును మే మందరమును స్వీకరించిన ఈదినముకూడ యొక మహాదినము. 1839 సంవత్సరమున ఈశ్వరునియందు ఆధారపడుట ఆరంభముచేసి, నేటికి బ్రాహ్మమతములోనికిని దానితోబాటు నవజీవనములోనికిని ప్రవేశిం చునంతవరకును వచ్చితి మిగదాయని యిప్పుడు మాయుత్సాహమున కును ఆనందమునకును మేరలేకుండెను.

బ్రాహ్మసమాజ చరిత్రలో నింతకుమున్నెన్నడును జరిగియుండ లేదు. ఇంతవరకును బ్రాహ్మసమాజమని ఒక పేరుమాత్రముండె నని చెప్పవచ్చును. గాని ఇప్పుడు బ్రాహ్మధర్మము బయలుదేరినది. బ్రహ్మలేనిదే ధర్మము నిలువదు; ధర్మములేనిదే బ్రహ్మను పొందనే రము. ఈసంబంధమును గ్రహించి బ్రాహ్మమతమునుస్వీకరించి, బ్రా హ్మలమై బ్రాహ్మసమాజ నామమును సార్థకపరచితిమి. 1845 సం॥ రం॥ లో అయిదువందలమంది, దీక్షను స్వీకరించి బ్రాహ్మలుగాచేరిరి.

సాధారణముగా సోదరులలోనుండు అన్యోన్య ప్రేమను మించిన ప్రేమనాడు బ్రాహ్మలలో ఒకరియెడల నొకరికియుండెడిది. బ్రాహ్మ లలో నీసౌహార్ద్రమునుజూచి పరమానంద భరితుడనైతిని. పట్టణము వెలుపల నొక ప్రశాంతస్థలమున వీరందరికి నొక సమ్మేళనము ఏర్పర చిన బాగుండునని తోచెను. అక్కడ అందరును కలసి స్నేహభావ మభివృద్ధిచేసికొని, ధర్మవిషయమైన యభిప్రాయముల మార్చికొనుటకు వీలగును. ఈయుద్దేశముతో 1845 సం॥రం లో పుష్యసప్తమినాడు "పాల్టా" నదికెదురుగనున్న "గోరితి" లోని మాయుద్యానవనగృహ మునకు వీరందరిని ఆహ్వానము చేసితిని.

ఏడెనిమిది పడవలను కుదిర్చి వీరందరిని కలకత్తానుండి తోటకు తీసికొని వెళ్ళితిని. వారందరును సద్భావమును, అనురాగమును, ఉ

త్సాహమును, అమితముగా గనబరచి నాడొక బ్రాహ్మోత్సవమును గావించిరి. అరుణోదయముననే లేచి, మేమందరమునుగూడి ఏకకంఠము తో ఎలుగెత్తి ఈశ్వరగీతములు పాడితిమి. పిమ్మట ఫలపుష్పశోభిత మైయున్న ఒక వృక్షుచ్ఛాయ యందాసీనులమై హృదయపూర్వకము గా నీశ్వరునుపాసించి ఆత్మతుష్టినిగాంచి పవిత్రులమైతిమి. ఉపాసనాంతమున రాఖాల్దాస్ హాల్దారు లేచి, "ఇపుడు మనమందరమును అద్వితీయుడైన ఏకేశ్వరుని ఉపాసకులమైతిమి? గావున జాతిభేదములు మనలో లేకుండుట శ్రేయస్కరము, అలఖ్ నిరంజనో పాసకులగు 'శిఖ్కు' సాంప్రదాయులు జాతిభేదములను పరిత్యజించి, 'సింగ్'అనునామమును ప్రతివారును ధరించి ఒక్కజాతివారగుటచే, ఢిల్లీచక్రవర్తియగు ఔరంగజీబు పాదుషావంటి నిర్వికప్రపరాక్రమ శాలినికూడ పరాజితునిజేసి, స్వతంత్రరాజ్యస్థాపనమును కావించుకొనగలిగి నంతటి ఐకమత్యమును పొందిరి. కావున మనమును మనయజ్ఞోప వీతములను త్యజించుట న్యాయము, ఉచితము అని అనెను. అతనితండ్రి యిదివినినప్పుడు కత్తి తో వక్షముపొడిచికొని ఆత్మహత్య కావించుకొనుటకుద్యుక్తుడయ్యెను.



## పదవ ప్రకరణము.



రామమోహనరాయలు విధించినట్లు, బ్రాహ్మలు గాయత్రీ మంత్రోచ్చారమువల్లనే బ్రహ్మోపాసన చేయుదురని మొట్టమొదటనేనను కొంటిని, గాని క్రమముగా ఆయుద్దేశమును విడిచి పెట్టవలసి వచ్చెను. ఈమంత్రము యొక్క అర్థము గ్రహించుటకు అనేకులకు కష్టతరముగానుండెను. కావున దీనిని ఉపాసనలో ఒక అంగముగా నుపయోగించుటకు అనుకూలముగ లేకపోయెను. అర్థసహితముగ

గాయత్రీమంత్రము నేర్చుకొనుట కష్టసాధ్యమైనపనిని, "మంత్రసాధనమా, లేక మరణమా" అనగలిగి నంతటి దృఢమనస్కులకు దక్క ఇది సులభసాధ్యము కాదు. కాని అట్టి దృఢప్రతిజ్ఞయు, గాఢ విశ్వాసమును గలిగినవారు బహుస్వల్పముగ నుండిరి. వెతికినచో వెయ్యికొకరుండి రేమో. కాని నాకు కావలసినదేమన జనసామాన్యమునకు సులభసాధ్యమైన యుపాసన. కావున గాయత్రీమంత్రము ద్వారా ఉపాసన చేయగలిగిన వారుండిన ఉందురుగాక. కాని అట్లు చేయలేనివారు ఇకపై యితర సులభమార్గముననైన చేసిన చేయవచ్చునని నిశ్చయించి కొంటిని. కావున దీక్షాపత్రమునందు, "ప్రతి దినమును శ్రద్ధతోను ప్రీతిపూర్వకముగను, గాయత్రీమంత్రము పది సారులుచ్చరించి బ్రహ్మోపాసన అనుదినమును సలిపెదను" అను మాటలకు బదులు, "అనుదినమును శ్రద్ధతోను, ప్రీతిపూర్వకముగను, నాయాత్మను పరబ్రహ్మమునకు సమర్పించెదను." అని మార్పు చేసితిని. కాని ఈశ్వరునితో సంభాషించుటకు మాటలే ప్రశస్తమైన యుపాయము అని ఎరుగుదును. ఆమాటలు ప్రాచీనములై, సహజములై, సుబోధకములై, సులభగ్రాహ్యములైనచో ఉపాసకునకు మరింత బాగుగా ఉపయోగపడును. విశేషఅనుసంధానము మీదట, పైలక్షణములను కలిగి, ఉపాసన కనుకూలమగు ఈక్రింది రెండుమహా వాక్యములను ఉపనిషత్తులయందు గాంచి బ్రహ్మానంద భరితుడనైతిని:—

"సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ"
"ఆనందరూప మమృతంయద్విభాతి" అని

ఈపదములు నాయాశలను దీర్చి, నాప్రయత్నములను సఫలీకృతములు చేసెను. ఏలయన ఇప్పుడు బ్రాహ్మలందరు "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" అను మాటలనుచ్చరించి బ్రహ్మోపాసన చేయు

చున్నారు. ప్రతిబ్రాహ్మునకును ఏకాంతముగా తన యాత్మను పరబ్రహ్మమున కర్పించుటకే వాక్యములు చాలును. కాని బ్రాహ్మసమాజమందు బ్రహ్మోపాసన చేయుటకింతకన్న నెక్కువ ప్రశస్తమైన యుపాసనామంత్రము కావలసి యుండెను. ఈయభిప్రాయముతో ఉపనిషత్తులలోనుండి ఇకమూడు శ్లోకములను చేర్చితిని. అందు మొదటిది.

" సపర్యాగచ్ఛుక్రమకాయమవ్రణ మస్నావిరంశుద్ధమ పాపవిద్ధం। కవిర్మనీషీ పరిభూః స్వయంభూర్యాథాతథ్యాతోర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతభ్యః సమాభ్యః. "

" అతడు సర్వవ్యాపి, నిర్మలుడు, నిరాకారుడు, నిరంజనుడు, పరిశుద్ధుడు, పాపరహితుడు, అతడు సర్వదర్శి, మనోనియంత, సర్వశ్రేష్ఠుడు, స్వప్రకాశుడు, సకలార్థప్రదాత. "

సర్వవ్యాపియై, సర్వసాక్షియై, నిరాకారుడైన, ఈపరమేశ్వరుడే జగత్కర్త కూడను. గనుక ఉపాసనాసమయమునం దీవిషయము కూడ మననముచేయుటకే క్రిందిశ్లోకము చేర్పబడెను.

" ఏతస్మాజ్జాయతే ప్రాణోమనః సర్వేన్ద్రియాణిచ
ఖంవాయుర్జ్యోతిరాపః పృధివీవిశ్వస్యధారిణీ "

అనగా ఈయన నుండియే ప్రాణము, మనస్సు, ఇంద్రియసముదాయము మరియుఆకాశము, వాయువు కాంతిజలముపీటికన్నిటికిఆధారమైనఈపృథివియు, ఉత్పన్న మగుచున్నవి. ఈశ్వరుని శాసనమువల్లనె జగత్సంసారమంతయు జరుగు చున్నది. ఈవిషయమును ధ్యానించుట కనుకూలముగ నుండుటకే క్రిందిశ్లోకమును చేర్చితిని:—

" భయాదస్యాగ్నిస్తపతిసూర్యః భయా
దిన్ద్రిశ్చవాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః "

అనగా, "ఈయన ఆజ్ఞవల్ల అగ్ని ప్రజ్వలితమగుచున్నది, ఈయన ఆజ్ఞవల్ల సూర్యుడు ఉత్తాపము నిచ్చుచున్నాడు. ఈయన ఆజ్ఞవల్లనే మేఘము, వాయువు, మృత్యువు సంచారము చేయుచున్నవి.

సకలమునకు ఆశ్రయుడును, ముక్తిదాతయు అగు పరమేశ్వరుని స్తోత్ర పాఠము గావించుటకు ఎంతో శోధనగావించి, తంత్రములనుండి ఈక్రింది శ్లోకములను చేర్చితిని.

"ఓంనమస్తే సతే తేజగత్కారణాయ, నమస్తే చితే సర్వలోకాశ్రయాయ। నమోద్వైతతత్వాయముక్తిప్రదాయ, నమోబ్రహ్మణేవ్యాపినే శాశ్వతాయ॥ త్వమేకం శరణ్యం, త్వమేకం వరేణ్యం, త్వమేకం జగత్పాలకం, స్వప్రకాశం। త్వమేకంజగత్కర్తృ, పాతృ, ప్రహర్తృ, త్వమేకంపరం,నిశ్చలం,నిర్వికల్పం॥ భయానాంభయం,భీషణంభీషణానాం, గతిఃప్రాణినాం, పావనంపావనానాం।మహోచ్చైఃపదానాం నియన్తృ త్వమేకం, పరేషాంపరం, రక్షణం రక్షణానాం॥ వయంత్వాంస్మరామో, వయంత్వాంభజామో, వయంత్వాంజగత్సాక్షిరూపంనమామః। సదేకం, నిదానం, నిరాలమ్బ మీశం భవాంభోధిపోతం, శరణ్యం వ్రజామః॥

అనగా సత్యస్వరూపుడవును, జగత్తునకు కారణుడవును, జ్ఞానస్వరూపుడవును, సకలలోకములకును ఆశ్రయుడవును అయిననీకు నమస్కారము. సమానాధికాద్వితీయుడవును, ముక్తిప్రదాతవును, సర్వవ్యాపివియు, నిత్యుడవును, బ్రహ్మమును, అగు నీకు నమస్కారము.

నీవొక్కడవే శరణ్యుడవు, నీవొక్కడవే శ్రేష్ఠుడవు, నీవొక్కడవే జగమును కాపాడువాడవు, స్వప్రకాశుడవు, నీవొక్కడవే జగత్తును సృష్టించి రక్షించుచు, ఇచ్ఛవచ్చినదానిని వినాశము చేయు శక్తిగలవాడవు. నీవొక్కడవే అన్నిటికిని మీదివాడవు. నిశ్చలుడవు, వికల్పములేనివాడవు!

నీవు సకల భయంకరవస్తువులకును భయంకరుడవు. సర్వాభయానకములకును భయానకుడవు. జీవులకుగతివి. పరమపావనుడవు. నీవొక్కడవే మహోన్నతములగు పదవులయొక్క నియంతవు. సర్వశ్రేష్ఠుడవు. మహారక్షకుడవు.

మేము నిన్నే స్మరించెదము. మేము నిన్నే భజించెదము. నీవు సత్యస్వరూపుడవును, ఆదికారణుడవును, అవలంబరహితుడవును, నేతవును, పాపసముద్రమునకు నావయును అగు నిన్నొక్కనినేశరణు జొచ్చెదము. అని ఈశ్లోకములను. ప్రణాళిలో చేర్చిన విధ మేమనిన:—

శ్యామచరణ తత్వవాగీశుడు తాంత్రికకుటుంబములో జనించినవాడు. తండ్రి కమలకాంత చూడామణి మిక్కిలిపట్టుదలగల తాంత్రికుడు. కావున తత్వవాగీశుడు సంస్కృత సాహిత్యములయందు ప్రవీణుడు. బ్రహ్మోపాసనా ప్రణాళికి, "సపర్యాగా" దాది మూడు శ్లోకములును చేర్చిన పిమ్మట వేదములనుండికూడ ఏదేనియొకటి వానికి చేర్చుటకొరకు హృదయంగమమగు స్తోత్రముకొరకు వెదకితిని, గాని దొరకలేదు. దీనివల్ల మనసు వ్యాకులత చెందుచుండెను. నామనోవిచారమునకు కారణము తెలిసినపిమ్మటతత్వవాగీశుడు తంత్రశాస్త్రములలో నొకసుందరమైన బ్రహ్మస్తోత్రము కలదని చెప్పెను. అదేది యని అడుగగా అతడు పైనజెప్పిన స్తోత్రము మహానిర్వాణతంత్రము నుండి చదివెను. దానిని విని యాహ్లాదము నొందితిని కాని అద్వైతవాదముతోగూడి యుండుటచే దానిని యున్నదున్నట్లు గ్రహింపజాలనంటిని. కావున బ్రాహ్మధర్మమున కుపయోగపడునట్లు దానిని మార్చితిని. ఈస్తోత్రము పంచరత్నములుగా విభజింపబడియున్నది. ప్రథమరత్నమునందలి ప్రథమచరణము.

"నమస్తేసతే సర్వలోకాశ్రయాయ నమస్తేచితే విశ్వరూపాత్మకాయ"

నేనిట్లు మార్చితిని:—

"నమస్తే సతే తేజగత్కారణాయ, నమస్తేచితే సర్వలోకాశ్రయాయ"

తృతీయ చతుర్థచరణములందు,

"నమోద్వైతతత్వాయ ముక్తిప్రదాయ నమోబ్రహ్మణే వ్యాపినే నిర్గుణాత్మ।"

అని యుండెను, నేను దీనికిబదులుగా:—

"నమోద్వైత తత్వాయముక్తి ప్రదాయనమో బ్రహ్మణేవ్యాపినే శాశ్వతాయ"

అనిమార్చితిని.. ద్వితీయరత్నమునందు ద్వితీయ చరణమునందు ఈమాటలుండెను.

"త్వమేకం జగత్కారణం విశ్వరూపం"

దానికి బదులుగా, "త్వమేకం జగత్పాలకం, స్వప్రకాశం," అని వ్రాసితిని. తృతీయ రత్న చతుర్థచరణమునందు, "రక్షణం రక్షకానాం," బదులుగా "రక్షణం రక్షణానాం," అని వ్రాసితిని. చతుర్థ రత్నమును సంపూర్ణముగ పరిత్యజించితిని. పంచమరత్నమున ప్రథమ చరణము, "త్వదేకం స్మరామో, త్వదేకం జపామః," అనియుండెను. "త్వదేకం" అను శబ్దస్థానమున, "వయంత్వాం," అను శబ్దము నుంచితిని.

ఈసవరణలు చేసిన పిమ్మట చదివి చూచితిని. మిక్కిలి చక్కగనే యుండెను. బ్రాహ్మధర్మము ప్రకారము యీశ్వరుడు విశ్వరూపముగాడు. విశ్వస్రష్ట కావున మొదటిపాదమునందు, 'నీవు సత్యస్వరూపుడవు,జగత్కారణుడువు,'అంటిని. రెండవచరణములో 'నీవుజ్ఞానస్వరూపుడవు సకలాశ్రయుడవు,' అంటిని; తరువాత, "నమోద్వైత

తత్త్వాయ ముక్తిప్రదాయ, నమో బ్రహ్మణే వ్యాపినే శాశ్వతాయ.” ‘ఆయన ఈజగత్తునకు కారణుడు, ఆయన ఈజగత్తునకు ఆశ్రయుడు, ఆతడు మనకు ముక్తిదాత, ఆతడు బ్రహ్మ, సర్వదేశవ్యాపి, కాలమునకు అతీతుడు, నిత్యుడు’ అనియుండెను. ఈతంత్రోక్త స్తోత్రసంశోధనయందును, దాని వంగభాషానువాదమునందును, తత్త్వవాగీశునివద్దనుండి విశేషసహాయమును పొందితిని. అందుకొరకాతనికి మిక్కిలి కృతజ్ఞుడను.

పిమ్మట నేనొక ప్రార్థన రచించి ఉపాసనాప్రణాళి చివరను చేర్చితిని. “హేపరమాత్మన్ ! మోహాకృత పాపములనుండి విముక్తులను గావించి, చెడుకోర్కెలను తొలగించి, మమ్ములను నీనియమితధర్మపాలనమునందు యత్నశీలురనుగా జేయుము. శ్రద్ధాప్రీతిపూర్వకముగా అహరహము, నీయపారమహిమను, పరమమంగళ స్వరూపమును చింతించుటకు ఉత్సాహ యుక్తులను గావింపుము. తన్మూలమున, క్రమముగా నీనిత్యసహవాసజనిత మహానందము నొంది కృతార్థులము కాగలుగుదము గాక ! ”

1845 సంవత్సరములో బ్రాహ్మసమాజమునందీ యుపాసనా విధానము ప్రవర్తిత మయ్యెను. కాని అప్పుడు స్తోత్రపాఠముచేయు సమయమున బంగాళీ భాషాంతరీకరణమును చదువుట యలవాటు లేదు. 1848 సం॥ రమునుండి మాత్రమది ప్రారంభించిరి. ఈయుపాసనాప్రణాళి బ్రాహ్మసమాజమునందు ప్రవర్తితమగుటకు పూర్వమచట కేవలము వేదపఠనము, వ్యాఖ్యానములతో గూడిన ఉపనిషత్ శ్లోకపఠనము, రామచంద్ర విద్యావాగీశుని ఉపన్యాసములు, బ్రహ్మకీర్తనలు పాడుట మాత్రమే జరుగుచుండెను.



## పదునొకండవ ప్రకరణము.

పూర్వము నేను నాత్మప్రబుద్ధి సిద్ధాంతము వల్లను, ఈశ్వరప్రసాదము వల్లను, ఏసత్యమును కనుగొన గలిగితినో ఆసత్యములు ఉపనిషత్తులలో జాజ్వల్య రూపముగానుండుట చూచి నామనస్సు, హృదయము పరితృప్తినొందెను. ఈశ్వరుడు, "సత్యం, జ్ఞానం, అనంతం, బ్రహ్మ" యని ఉపనిషత్తులవల్ల తెలిసికొంటిని. ఒకప్పుడు నేను ప్రకృతియొక్క నిరంకుశ పరాక్రమమునకు భీతిచెందుచుంటిని. ఇప్పుడు ప్రకృతిపై నొక నియంతకలడని యీక్షణమందు తెలిసికొంటిని. ప్రకృతి ఒక్కపురుషుని స్వభావముపై ఆరూఢమై యున్నది.

"స్వభావనాధి తిష్ఠత్యేకః"

అతనిఒక్క చౌకుదెబ్బతో నంతయు చరించుచున్నది.

"భయాదస్యాగ్ని స్తపతి భయా త్తపతిసూర్యః"

అతడు రాజులకెల్ల రాజైన మహారాజు. అతడు మనతండ్రి, తల్లి, సఖుడు. ఇది తెలియుటచే నిర్భయుడనైతిని. ఆయన నుపాసించి కృతార్థుడనైతిని. నిర్జనమునందు ఏకాకినై ఆయన మహద్భావమును జాజ్వల్యప్రభావమును అనుభవించితిని. బ్రాహ్మసమాజమునందు నాసోదరులతో గూడి యీతని గుణగానముచేసితిని. మిత్రులందరితో గూడి పరమసఖు నాహ్వానించితిని. ఇందువల్ల నాకోరికలన్నియుతీరెను.

ఈశ్వరుని పొందనంతకాలము ఈపృథ్వియందందరును భాగ్యవంతులనియు, నేనొక్కడనే భాగ్యహీనుడననియు అనుకొను చుంటిని. ఎందరో యీశ్వరసాన్నిధ్యమునకు త్వరపడు చుందురు. ఎందరో విశ్వేశ్వరుని మందిరమునకు, ఎందరో జగన్నాథ క్షేత్రమునకు, మరెందరో ద్వారకకును హరిద్వారమునకును, లెక్కకు నెక్కువై పోవు

చుందురు. ఎక్కడ చూచినను దేవమందిరములన్నియు దేవావిర్భావముతో నిండియుండును, భక్తియుచ్ఛ్వాసముతో ఉచ్ఛ్వాసిత మగుచుండును. మంగళ ధ్వనులతో నినాదితమగుచుండును. కాని నాకు మాత్రమదంతయు శూన్యముగనుండెను. ఎప్పుడు నేను నాడుపాస్య దేవతను దర్శించి ఆయన సమ్ముఖమునందు దండాయమానుడనగుదునో, ఎప్పుడు ఆయనకు నాహృదయము యొక్క భక్తి ఉపహారము నిచ్చి ఆయనను పూజింతునో, ఎప్పుడాయన మహిమను కీర్తింతునో యని, జలాభావమువల్ల కలుగు పిపాసవలె బలవత్తరమైన యీకోరిక నాకు కఠిన దుఃఖమునిచ్చెను. ఇప్పుడు నాకావాంఛ పూర్ణమయ్యెను. దుఃఖమంతయు దూరమయ్యెను.

పరమేశ్వరుడెప్పుడును ఆయన భక్తులను పరిత్యజింపడు. ఎంతకాలమైన పిమ్మట, కరుణామయుని యీకరుణ కనుగొంటిని! ఎవరు అతనిని కోరుదురో వారతనిని పొందుదురు. నేనీ ప్రపంచమున దీనదరిద్ర భాగ్యహీనునివలె తిరుగుచుండువాడను. ఇది ఆయన ఇంక చూడ జాలడు. అతడు నాసమ్ముఖమున ప్రకాశితుడయ్యెను. నేను చూచితిని. “ఆయమస్మిన్నమా కాశే తేజోమయోఽమృతమయః పురుషః సర్వానుభూః.” ఈసర్వజ్ఞ, తేజోమయ, అమృతమయ పురుషుడు, ఈ ఆకాశమునందున్నాడు. ఈజగన్మందిరమునందు జగన్నాథుని దర్శించితిని. అతని నెవ్వరును ‘ఇక్కడ’ అని నిరూపింప నేరరు, ఎవ్వరును అతనిని హస్తములతో నిర్మాణము చేయజాలరు. అతడు తనంతతానే నిత్యస్థితి నొందుచున్నాడు. ప్రాణదాతయగు నాయుపాస్య దేవతను నేను పొందితిని. నిర్జనమునందును, సజనమునందును, అతని నుపాసించి పవిత్రుడ నైతిని. ఏయాశతో నతనిచెంత చేరితినో ఆయాశతీరెను. ఇంత పొందితిని చాలని నేను సంతుష్టి చెందితిని. కాని, “ఇంత కొంచమేగదా యిచ్చితిన” ని అతనికి

మాత్రము సంతుష్టి లేకపోయెను. అతని కింకను యివ్వవలెననియే యుండెను. తల్లివలె, నాతనికి మరింత ఇవ్వవలెనని యుండెను. నేనెన్నడును ఎరుగనిది ఎన్నడును అడుగనిది—ఇదంతయుకూడ అతనికివ్వవలెననియే యుండెను.

బ్రహ్మోపాసనకు గాయత్రిజనసామాన్యమున కుపయుక్తము లేదని నేను గ్రహించినను నేనింకను ఆసావిత్రిదేవి నాశ్రయించియే యుంటిని. ఎన్నడును పరిత్యజింప లేదు. అనేక శతాబ్దములనుండి యీ గాయత్రీమంత్ర ముపదేశింపబడుచున్నది. అది మనరక్తనాళముల యందు అంతర్లీనమై ప్రవహించుచున్నది. నాయుపనయన సమయా మునందీ మంత్రముపదేశింపబడినదికాని నేను దానిని మరచిపోతిని. రామమోహనరాయలు బ్రహ్మోపాసనకు గాయత్రి అనుకూలించునని చెప్పుటచే దాని శ్రేష్ఠత్వమునుగ్రహించితిని. అప్పటినుండియు నది నాహృదయమునందు నాటుకొనెను. దానియర్థము తిరిగి తిరిగి పఠించుచు సాధ్యమైనంతవరకు జపింప నియుక్తుడనైతిని. మొట్టమొదట నేను బ్రాహ్మధర్మ ప్రతిజ్ఞను లిపిబద్ధము గావించినపుడు గాయత్రీమంత్రముద్వారాబ్రహ్మోపాసనచేయు విధానము దానిలోనిమిడ్చితిని. గాయత్రీమంత్ర ప్రచారమువల్ల నన్యులకుపకారముచేయ లేకపోయినను నాకుమాత్రమది బాగుగ ఫలించినది. సమ్యగ్రూపమున బ్రాహ్మధర్మమును ప్రతిపాలించుటకుగాను ప్రతిదినమును అభుక్తావస్థలో మనసును బాగుగ సంసిద్ధముచేసుకొని గాయత్రిద్వారా ఈశ్వరునుపాసింపనారంభించితిని.

దినదినమును గాయత్రియొక్క గూఢ భావార్థము నామనసునందుప్రకాశింప నారంభించెను. క్రమక్రమముగా, “ధియోయోనఃప్రచోదయాత్” నాసమస్త హృదయమునందును ఆవరించి యుండెను. ఈశ్వరుడునన్నుగురించి ఏకాంత సాక్షిమాత్రమేకాడని యిప్పటికి నా

కుదృఢనమ్మకము కలిగెను. ఆయననాఅంతరమునందుండి అనుక్షణ ముననా సకల బుద్ధివృత్తులను ప్రేరణచేయుచుండెను. అప్పటినుండియు నాయనతో నొక ఆంతర్యసంబంధములోనిబద్ధుడనైతిని. ఆయనకు దూరమునుండి ప్రమాణము చేయుటవల్లనే కృతార్థుడననుకొనుచుంటిని. ఇప్పుడాయాశకు అతీతమైన ఫలము ప్రాప్తించినది. ఆయననాకు దూరముగ నుండుటలేదు. కేవలముమూగసాక్షి కాడు. కాని నాఅంతరము నందుండినా సకలబుద్ధివృత్తులను ప్రేరణచేయుచున్నాడు. అప్పుడు నేననుకొంటిని: 'నేనసహాయుడను కాను, ఆయనయే నాచిర కాల సహాయుడు.' ఎప్పుడాతనిని కనుగొనలేక విచారముతోను, నిరాశతోను, తిరుగుచుంటినో, అప్పుడే అతడు నాఅంతరమునందుండి నాఅంతర చక్షువులను, నాజ్ఞాననేత్రములను తెరచుచుండెను. అతడింతకాలము నన్ను చెయ్యిపట్టుకొని నడుపుచుండెనని కనుగొననేరనైతిని. ఇప్పుడతనిని తెలిసికొని, ఆతని హస్తముపట్టుకొని నడచుచున్నాను.

ఇది మొదలునే నాయన ఆదేశముల విననేర్చుకొన నారంభించితిని. నామనోప్రవృత్తికిని ఆయన ఆదేశమునకును గల భేదభావము తెలిసికొన నారంభించితిని. ఎయ్యది నాప్రవృత్తియొక్క కుటిల ప్రేరణయని తోచెనో దానిని పరిత్యజించుటకు యత్నశీలుడనైతిని. ఎయ్యది ఆయన ఆదేశమని నాధర్మబుద్ధికి తోచుచుండెనో దానిన నుసరించుటకు ప్రయత్నములు సలుపుచుంటిని. అప్పుడాతని చెంత నిట్లు ప్రార్థించుచుంటిని:—"నీవునాకుశుభబుద్ధిప్రేరణచేయుము, ధర్మ బలము ప్రేరణచేయుము, ధైర్యమునిమ్ము, శౌర్యమునిమ్ము, తితిక్షా సంతోషములనిమ్ము." గాయత్రీమంత్రము ననుసరించుటవల్ల నాయాశలనతీతించి ఎట్టి ఫలమును పొందితిని! ఆయనదర్శనమును పొందితిని! ఆయనఆదేశమును శ్రవణము గావించితిని. ఒక్కసారిగా ఆయనస్నేహితుడనై పోతిని. ఆయన నాహృదయమునం దాసీనుడైయుండి నన్ను

నడుపుచున్నట్లు తెలిసికొంటిని. ఎట్లాతడు ఆకాశమునందుండి గ్రహనక్షత్రగణమును నడిపించుచుండునో అట్లే ఆయన నాహృదయమునందుండి నాసకలధర్మవృత్తులను ప్రేరణచేసి నాయాత్మను నడిపించుచుండెను. నిర్జనమునందు, అంధకారమునందు ఆయన ఆదేశమునకు విపరీతముగ నేకార్యమునైన చేసినప్పుడు ఆయనయొక్క శుభప్రేరణననుభవించుచుంటిని. వెంటనే ఆయన * రుద్రముఖమును గాంచుచుంటిని. రక్తము పేరుకొనిపోవుచుండెను. మరియుఏకాంతమునందేదైన సత్కార్యముచేసినపుడెల్ల నన్నాతడు బహిరంగముగా సత్కరించుచుండెను. ఆతని ప్రసన్నముఖమును దర్శించుచుంటిని. సముదయ హృదయము పుణ్యసలిలమున పవిత్రమగుచుండెను. అతడు సర్వదా నాహృదయమునందధిష్టితుడైగురువువలె జ్ఞానమునుపదేశించుచుండెను. సత్కార్యాచరణకు పురిగొల్పెను. కావున, "పితాతుమిమాతా, తుమిగురు జ్ఞానదాతా"—తల్లియును తండ్రియును నీవే, గురువును జ్ఞానదాతవును నీవే," యని సంతోషముతో నంటిని. దండనమునందును పురస్కారమునందును, ఆయనస్నేహమును గాంచితిని. ఆతని స్నేహముచే పాలింపబడి, పడుచు, లేచుచు ఇంతదూరమువచ్చితిని. అప్పుడు నా వయస్సు 28 సంవత్సరములు.



## పండ్రెండవ ప్రకరణము.



పూర్వము లోకులు వారివారి క్షుద్రమందిరములలో కృత్రిమ పరిమిత దేవతలనుపాసించుట చూచినపుడు "ఈజగన్మందిరమందు ఎప్పుడాయనంత దేవుని సాక్షాద్దర్శనముచేసి ఆయననుపాసింపగలు

* "మహాద్భయంవజ్రముద్యతః,"

గుదునా" అని తోచెడిది. అప్పుడహర్నిశములు ఆకోరిక నాలో జ్వలించుచుండెను. నిద్రియందును స్వప్నమునందును ఇదొక్కటే నాకోరిక. ఇదిమాత్రమే నా భావన. నేటికి ఆ కాశమునందా తేజోమయామృతమయపురుషుని చూచినంత నాకోరికలన్నియు నెరవేరెను. నామనోవేదనయంతయు దూరమయ్యెను.

ఈమాత్రము లభించెను, ఇదేచాలునని నేను తృప్తిపొందితిని. కాని, ఇంతియేగదా యనుగ్రహించితిని అని అతనికి మాత్రముసంతుష్టిలేకుండెను. ఇంతకాలము అతడు నాబాహ్యమునందుండెను. ఇప్పుడతడు నాలోననే యుండి దర్శనమిచ్చుచుండెను. నాఅంతరమునందే ఆతడాసీనుడై యుండెను. జగన్మందిరమున నుండిన దేవత యిప్పుడు నాహృదయ మందిరమునకు దేవతయయ్యెను. అప్పటినుండియునాతని నిశ్శబ్దగంభీర ధర్మోపదేశము నాకువినబడుచుండెను. ఇది నేనెన్నడును ఆశించి యుండలేదు. అది నాభాగ్యమున ఘటించినది నేనాశించిన దాని కతీతమైన ఫలము లభించినది. కుంటివాడనయ్యును పర్వతము లెక్కగలిగితిని. అతని కరుణ యింతటిదని నేను తెలిసికొనలేకపోతిని. ఆతని పొందకుండినప్పుడు నాకుండిన తృష్ణయిప్పుడాతడు లభించిన పిమ్మట నూరింత లధికమయ్యెను. అతనినింత మాత్రమే దర్శించితిని, అతని వాణినింతమాత్రమే వింటిని. అందువల్ల నాక్షుత్పిపాసలు నివృత్తి కాలేదు. భుజించినకొలది ఆకలి అధికమన్నసంగతి వాస్తవముగదా!

హే! నాథ! నీదర్శనము లభించినది. నీవింకను జాజ్వల్యమానుడవై నాకు దర్శనమిమ్ము. నీవాణినివిని కృతార్థుడనైతిని. ఇంకను నీమధురవాణిని నాకు వినిపింపుము. నీసౌందర్యము నవ్యతరరూపముతో నాసమ్ముఖమునందావిర్భూతమగునుగాక! నీవిప్పుడు నాకు విద్యుల్లతవలె నగపడి తిరిగి మాయమగుచున్నావు. నిన్ను నేను

పట్టి యుండజాలకున్నాను. నీవు నా హృదయమునందు చిరస్థాయి వగుదువుగాక! ఈమాటల నుచ్చరించు నపుడు అరుణకిరణములవలెనాతని ప్రేమ కాంతులు నాహృదయమును వెల్గొందసాగెను. మృత దేహముతో, శూన్యహృదయముతో, విషాదాంధ కారములోనిమగ్నుడనై యుంటిని. ఇప్పుడు ప్రేమభానునిఅభ్యుదయముతో నాహృదయముచేత నాత్మకమయ్యెను. నాదీర్ఘనిద్రాభంగమయ్యెను. నేనిప్పుడు ప్రేమపథమున యాత్రికుడనైతిని. అతడు నాప్రాణమునకు ప్రాణమనియు, హృదయసఖుడనియు ఇప్పుడు తెలిసికొంటిని. అతడులేనిదే నేనొక్కక్షణమైనను గడపలేకపోతిని.



## పదమూడవ ప్రకరణము.



1845 సంవత్సరములో వైశాఖమాసమునందొక ప్రాతఃకాలమున వార్తాపత్రికలు చదువుచు కూర్చున్నసమయమున, Bank గుమాస్తా రాజేంద్రనాథ సర్కారు కన్నీరుకార్చుచు నావద్దకువచ్చి ఇట్లు చెప్పసాగెను: "క్రిందటి ఆదివారము నాభార్యయు నాకనిష్టభ్రాతయగు ఉమేశచంద్రుని భార్యయు బండిలో నొకసభకు పోవుచుండగా ఉమేశచంద్రుడువచ్చి తనభార్యను బండిలోనుండి బలవంతముగా లాగికొనిపోయి క్రైస్తవులగుటకు డఫ్‌దొర (Dr. Duff) ఇంటికిపోయెను. వారినింటికి మరలించుటకు మాతండ్రి చాలప్రయత్నముచేసి విఫలమనోరథుడై, ఉన్నతన్యాయస్థానములో అభియోగము తెచ్చెను. కాని ఆయభియోగమును కొట్టివేసిరి. అప్పుడు రెండవసారి అభియోగము తెచ్చెదమనియు, దానితీర్పు అగునంతవరకు క్రైస్తవులలో కలపవలదనియు నేనుపోయి డాక్టరు డఫ్‌ను వినయముతో బ్రతిమాలుకొంటిని.

కాని ఆయన నాయార్పులు పెడచెవినిపెట్టి నిన్నసాయంకాలము వారిని క్రైస్తవమతమునందు కలుపుకొనెను."

ఇదివిని నేనుచాలకోపమును దుఃఖమునుచెందితిని. "ఘోషా స్త్రీలను సహితము క్రైస్తవులను చేయుచున్నారుగా! భేష్! నేను దీనికి ప్రతివిధానము నాలోచించెదనుగాక," అనుచు లేచితిని. వెంటనే అక్షయ కుమారదత్తు కలము కదలించితిని. "తత్వబోధినీ" పత్రికలో నొకరోషపూరితమగు వ్యాసము వెలువడెను. "ఘోషా స్త్రీలు సహితము స్వధర్మమునుండి భ్రష్టులై పరధర్మము నవలంబించుచున్నారు. ఇట్టి ఘోరమునన్నిటిని ప్రత్యక్షముగా చూచుచుకూడ మన మింకను చైతన్యులము కానలదా! ఇంకను ఎంతకాలము మనమిట్లు అనుత్సాహముతో జడులమై పడియుండుట? ధర్మమంతయు నాశనమగుచున్నది. ఈదేశము విచ్ఛిన్నమగుటకుపక్రమించినది. మనహైందవ నామమే తుడిచిపెట్టుకొనిపోవుదశ సంభవించుచున్నది.............. కావున మీరును మీకుటుంబములును మంగళముగ నుండదలచెదరేని, మీదేశముయొక్క ఔన్నత్యమును ప్రతీక్షించెదరేని, సత్యమునందు మీరు ప్రీతిగలిగియుందురేని, క్రైస్తవమతప్రచారకుల సాంగత్యము నుండి మీబాలురను దూరముగ నుంచుడు. మీపుత్రులను వారిపాఠశాలలకు పంపుటమానుడు. తగినంతత్వరలో వారిమనసులను వికసింపజేయుటకు శీఘ్రముగా యత్నములు సలుపుడు. బీదబాలుర విద్యాభ్యాసమునకు 'మిషన్' పాఠశాలలలో తప్ప అన్యస్థానమెక్కడ అందురేమో? అట్లనుటకు సిగ్గుపడవలదా! తమధర్మమును ప్రచారము చేయుటకు క్రైస్తవులు భీకరసాగరతరంగములను ధిక్కరించి భారతదేశముమధ్య ప్రవేశించి ప్రతినగరమునందును, ప్రతిపల్లెయందును పాఠశాలలు స్థాపించుచున్నారు. మనమన్ననో, బీదబాలురకు విద్యగరపునిమిత్తము ఒక్క పాఠశాలనైనను స్థాపింపమైతిమి. మనమందరమును

ఏకమైనచో వారిపాఠశాలలతో తులతూగునవేగాక అంతకన్న దశ గుణము ఉత్కృష్టమైన విద్యాలయములు స్థాపింపలేకపోదుమా? ఐకమత్యమువల్ల ఏకార్యము సిద్ధింపకుండును?”

అక్షయకుమారదత్తుని వ్యాసము పత్రికలో ప్రకాశితమయ్యెను. పిమ్మట నేను ప్రతిదినము ఉదయముమొదలు సాయంకాలము వరకు కలకత్తాలోనున్న మాన్యులను సంపన్నులను చూచుటకు బండిలోపోయి, హైందవబాలురను మిషన్‌స్కూళ్లకు పంపకుండ తమ స్కూళ్లలోనే విద్యగఱపుటకు ప్రయత్నములుసాగింపుడని బ్రతిమాల నారంభించితిని.ఒకవంక రాజా రాధాకాంత దేవ్, రాజా సత్యాచరణఘోసాల్, మరియొకవంక రామగోపాలఘోస్ మొదలగు వారివద్దకు వెళ్ళి వారినందరిని నాయుద్దేశములచే నుత్తేజులను గావించితిని. నాయుత్సాహమువల్ల వారందరును ఉత్సాహపూరితులైరి. దీనితో ‘ధర్మసభ’కును ‘బ్రహ్మసభ’ కును గల వైషమ్యములన్నియు నశించినవి. అందరును ఒక్కపక్షముననే నిలచి, ‘మిషన్’ స్కూళ్లకు వారిబాలురువెళ్లకుండునట్లును, క్రైస్తవప్రచారకులు వారిని క్రైస్తవులలో కలుపుకొనకుండునట్లును ప్రయత్నములు సలిపిరి. జ్యేష్ఠ శుద్ధ త్రయోదశినాడు ఒకమహాసభ గావింపబడెను. ఒకవెయ్యిమంది సభకు విచ్చేసిరి. క్రైస్తవప్రచారకులు బాలురకు వేతనములులేక పాఠశాలలు నెలకొల్పినట్లే మేమును ఒకయుచితవిద్యాలయమును నెలకొల్పవలెనని తీర్మానించితిమి. మేము చందాపుస్తకము చేతబూని ఎవరెంతవిశాలము నొసంగుదురోయని అపేక్షించుచుంటిమి. అప్పుడు అషుతోష్ దేవ్, ప్రమథనాథదేవ్, మావద్దనుండి చందాపుస్తకము తీసికొని అందులో పదివేల రూపాయలు చందా వేసిరి. రాజా సత్యాచరణఘోసాల్ మూడువేల రూపాయలు వేసెను. భ్రజనాథధార్ రెండువేలు, రాజా రాధాకాంతదేవ్ వెయ్యిరూపాయలు—ఈవిధముగా ‘నిలచియున్నపాటున’ నలుబదివేలరూ

పాయలు కూడెను. అప్పుడు మాపరిశ్రమ ఫలించెనుగదా యని సంతసించితిమి. ఈసభకు పర్యవసానముగా "హిందూహితార్థి" యను నొకవిద్యాలయము స్థాపింపబడి, తత్కార్యనిర్వాహణముకొఱకు రాజా రాధాకాంతదేవ్ బహద్దూర్ అధ్యక్షుడుగా నియమింపబడెను. హరిమోహనసేను, నేను కార్యదర్శులమైతిమి. ఈయుచితవిద్యాలయములో భూదేవముఖోపాధ్యాయుని ప్రథమ ఉపాధ్యాయునిగా నియమించితిమి. నాటినుండియు దేశమున క్రైస్తవమతస్వీకరణప్రవాహము మందగింపనారంభించెను. క్రైస్తవప్రచారకుల మస్తకములపై కుఠారాఘాతము పడెను.



## పదునాల్గవ ప్రకరణము.



ఉపనిషత్తులనుండి బ్రహ్మజ్ఞానముపొంది బ్రహ్మోపాసనా విధానమును గాంచిన పిమ్మట, సముదయ భారతవర్షమునకు నీయుపనిషత్తులే ప్రామాణ్య శాస్త్రములుగావున, ఉపనిషత్తుల ప్రచారము ద్వారా బ్రాహ్మధర్మప్రచారము గావింపవలెనని నాకుసంకల్పముండెను. సకలశాస్త్రకారులు ఉపనిషత్తులనే వేదాంతముగ పరిగణింతురు వేదాంతమనగా సకలవేదములయొక్క శిరోభాగము ; సకలవేదములయొక్క సారము. వేదాంతప్రతిపాద్య బ్రాహ్మధర్మము ప్రచారము చేయగలిగితినేని సముదయ భారతవర్షముయొక్క ధర్మము ఏకమగును, పరస్పర విచ్ఛిన్నభావము లంతరించును, అందరును భ్రాతృభావముతో మిళితమగుదురు. దేశముయొక్క పూర్వ విక్రమము, శక్తి, పునర్జన్మము నొందును; వేయేల, దేశమునకు తన స్వాతంత్ర్యము తనకు మరల లభించును, అని ఇట్టి ఉచ్చతరాదర్శమపుడు నామనసు నందుండెను.

విగ్రహారాధనయొక్క అట్టహాసమును, ఆడంబరమును అంతయు తంత్రములలోను పురాణములలోనే. వేదాంతమునందు దానికేమియు గౌరవములేదు; కావున అందరును తంత్రములను పురాణములను పరిత్యజించి ఉపనిషత్తుల నవలంబించినచో, ఉపనిషత్తులలోని బ్రహ్మవిద్యనుపార్జించి బ్రహ్మోపాసనా నిరతులైనచో, భారతవర్షమున కశేష మాంగళ్యము లభించును.

ఈమంగళపథమునకు మార్గదర్శి నగుటయే నాయుద్దేశము. కాని ఏవేదములకు ఉపనిషత్తులు భాగములుగానున్నవో, ఏవేదముల సిద్ధాంతములనుచూపుటకు 'వేదాంతదర్శనము,' శ్రమపడినదో, ఆవేదములేమియు మనము నేర్చికొనలేకున్నాము. రామమోహనరాయల ఏర్పాటును బట్టి కొన్నియుపనిషత్తులు ప్రచురింపబడెను. ఇదివరకచ్చులోలేనివి కొన్నింటిని నేను సమకూర్చితిని. కాని వేదాంత వృత్తాంతమునుగూర్చి విశేషము మనకేమియు తెలియదాయె. బంగాళాదేశమందు వేదములు నశించియే పోయినవి. న్యాయశాస్త్రములును, స్మృతులును ప్రతిసంస్కృత పాఠశాలయందును నేర్పుచుండిరి. వానినుండి న్యాయవాగీశులు, స్మార్తవాగీశులు అనేకులు వెలువడుచుండిరి. కాని అక్కడ వేదముల నామముగాని వాసనగాని ఎంతమాత్రము లేకుండెను. వేదాధ్యయనము, అధ్యాపనము అను బ్రాహ్మణ ధర్మములు ఈదేశమునుండి అంతరించిపోయెను. కేవలము వేదవిరహిత నామమాత్ర ఉపవీతధారులగు బ్రాహ్మణులు మాత్రమున్నారు. ఎవరో ఒకరిద్దరు పండితులుతప్ప తక్కిన బ్రాహ్మణులు వారినిత్యకర్మ సంధ్యావందనముయొక్క అర్థము సహితమెరుగరు.

వేదములు క్షుణ్ణముగా నేర్చికొనవలెనని నాకొకయాశపుట్టినది. వేదవిద్యకు ముఖ్యస్థానము వారణాసి. కావున నచ్చట వేదము నేర్చుకొనుటకు విద్యార్థులను బంప సమకట్టితిని. 1844 వ సంవత్సరములో

కాశికొక విద్యార్థిని పంపితిని. అతడు వేదముల వ్రాతపుస్తకముల మూలములను సంగ్రహించి శిక్షనభ్యసింప నారంభించెను. మరుసటి సంవత్సరము మరిముగ్గురను పంపితిని—ఆనంద చంద్రుడు, తారక నాథుడు, వాణీశ్వరుడు, రామనాథుడు—ఈనలుగురు విద్యార్థులు వెళ్ళిరి.

వీరిని కాశికిపంపినపుడు మాతండ్రి యింగ్లండు నందుండెను. ఆయనయొక్క విస్తీర్ణకార్య భారమంతయు నాపైబడెను. కాని నేనే కార్యము సరిగా చూడలేకపోయెడి వాడను. నాక్రింది యుద్యోగస్థులే పనినంతయు జరపుచుండిరి. నేను కేవలము వేదము, వేదాంతము, ధర్మము, ఈశ్వరుడు, జీవితపరమావధి వీనియందేనిమగ్నుడనై యుంటిని. ఇంటివద్ద స్థిమితముగా కూర్చుండుటకు సహితము నాకు వీలులేకుండెను. వ్యావహారిక చింతనలతో అంతకంతకు నాయుదాసీన భావమభివృద్ధి చెందుచుండెను. ఇంత ఐశ్వర్యమునకు ప్రభువునగుటకు నాకిచ్ఛవొడమదాయెను. సర్వమునుత్యజించి ఒంటరిగా తిరుగవలెనను కోరికయే నాహృదయమునందు రాజ్యముచేయుచుండెను. ఈశ్వరుని ప్రేమలో మగ్నుడనై, ఏకాకినై ఎట్లు నిర్జనమునందు సంచరించువాడనో ఎవ్వరును తెలిసికొనజాలరు. జలమునందును, స్థలమునందును ఆతని మహిమ ప్రత్యక్షముగ వీక్షించుచుందును. వివిధ దేశములందును ఆతని కరుణను గాంతును. విదేశములయందును, విపత్తులయందును, సంకటములందును ఆతని పరిపాలనాప్రభావమునే గాంచుచుందును. ఈయుత్సాహముతో నేనింక నింటివద్ద నుండలేకపోతిని.

1846 వ సంవత్సరము శ్రావణమాసపు ఘోరవర్షమునందు గంగానదిమీద విహారమునకు బయలుదేరితిని. నాప్రియపత్ని అశ్రువులగార్చుచు నావద్దకువచ్చి, “నన్నువదలి ఎక్కడికి వెళ్ళెదరు. మీరు వెళ్ళుట తప్పనిసరియైనచో నన్నును తీసికొనిపొండు” అనెను. కావున

ఆమెకొక డింగీకుదిర్చి దానిపై నామెనుకూడ తీసికొనిపోతిని. ద్విజేంద్రనాథ్, సత్యేంద్రనాథ్, హేమేంద్రనాథులతో నామె దానిలో నెక్కెను. రాజనారాయణ బోసుతో నేను విశాలమైన నాస్వంతపడవనాక్రమించితిని. ద్విజేంద్రనాథున కప్పటికేడేండ్లు. సత్యేంద్రనాథునకైదు, హేమేంద్రనాథునకు మూడు.

రాజనారాయణ బోసుతండ్రిపేరు నందకిసోరీబోస్. అతడు రామమోహానుని ప్రియశిష్యులలో నొకడు. ఆయన పరిచయమునొంది ఆయన ధర్మభావము, నమ్రభావముచూచి అమితానందము చెందితిని. అతడు 1844 సంవత్సరములో బ్రాహ్మమతమును స్వీకరించెను. రాజనారాయణుడు 'బ్రాహ్మ' అయినచో చాల బాగుండునని అతడనుచుండెను, ఆయన జీవితావస్థయందు ఈయిచ్ఛసఫలతగావుంట ఆయన జూడలేకపోయెను. ఆయన చనిపోయిన కొలది దినములలో, అశౌచావస్థలోనే ఒకనాడు దయమున రాజనారాయణుడు నన్ను చూచుటకు వచ్చెను. అప్పటినుండియు అతనిని మిత్రునిగా గ్రహించితిని. ఆనాటి ఆంగ్ల పండితులలో నతడు విశేషప్రతిష్టగాంచెను. అతడప్పుడు విశేష విద్యావంతుడని గణనకెక్కెను. అతని విద్యావినయములను ధర్మభావమును చూచి దినదినము నతనియెడల నాయనురాగము వృద్ధిచెంద నారంభించెను. చివరకు 1845 సం॥రములో నతడు బ్రాహ్మధర్మమును స్వీకరించెను. ధర్మభావము నందతనితో నాహృదయముపూర్తిగకలసిపోయెను.అతడు నాకెంతయో ఉత్సాహముతో సహాయమొనర్చుచుండెను. అప్పుడు ధర్మప్రచారము కొరకాంగ్లమున జరుపవలసిన వ్రాతకోతలన్నియు నతని కప్పగించితిని. కఠ మొదలగు నుపనిషత్తులకు నేనతనికర్థము చెప్పుచుంటిని. అతడు వాని నాంగ్లములోనికి భాషాంతరీకరించి 'తత్వబోధినీ' పత్రికలోప్రచురించుచుండెను. అప్పుడతని సాంసారికావస్థఅంతగా బాగుండకపోయినను అతడెప్పుడును ప్రి

హృష్టాంతరంగుడై యుండెను. అతడు సర్వదామందస్మితవదనముతో నుండెడివాడు. అతడెన్నడు నాసాంగత్యము విడువక యుండెను. అతనితో ధర్మచర్చసలుపుటనాకు మిక్కిలి యిష్టముగానుండెను. నేనతనిని మాకుటుంబములో నొకనివలెనే గణించుచుంటిని.

నాకుటుంబముతో ప్రయాణమునకు బయలువెడలినప్పుడు మాతో రాజా నారాయణ బోసునికూడ తీసికొని వెళ్ళితిని. అతడు పడవలో నాచెంతనుండెను. నాభార్యా పుత్రులందరును డింగీలోనుండిరి. ఉత్సాహముతో ప్రయాణమునకు బయలు దేరితిమి. శ్రావణ మాస ప్రబలస్రోతము మాకు విపక్షముగనుండెను. దానికి ప్రతికూలముగ నతికష్టముతో ముందుకు నెమ్మదిగ సాగుచుంటిమి. హుగ్లీ (Hngli) చేరుటకు మూడు నాలుగు దినములుపట్టెను. రెండు దినముల పిమ్మట 'కాల్నా' చేరుసరికి చాలదూరమే వచ్చితిమనుకొంటిమి. ఈ విధముగాపోవుచు 'పాటులీ' దాటినపిమ్మట ఒకనాడు నాలుగుగంటల వేళ రాజనారాయణబాబుతో, "నేటికినీదినచర్యవ్రాత (Diary) చాలించుము. ప్రకృతివిశేషదీప్తిం శోభించుచున్నది. నడువుము, పడవ"టాపు" మీదకెక్కి కూర్చుందము," అంటిని. "ఇంక చాలప్రొద్దున్నది. ఈలోపుగానా"డైరీ"లో వ్రాయుటకుఇంకా ఏమిసంఘటించునో ఎవరికెరుక" అని అతడు పత్యుత్తరమిచ్చెను. ఈవిధముగ నతనితో మాట్లాడుచుండగనే యొక కారుమేఘము పశ్చిమాకాశమును క్రమ్ముకొని వచ్చుచుండెను. అప్పుడొక పెద్దతుపాను వచ్చునేమోయని భయపడితిని. తుపాను సమయమున పడవలో నుండుటక్షేమముగాదు, డింగీలోనికి పోవుదము రమ్ము," అని రాజనారాయణునితో నంటిని. పడవవాండ్రు పడవను డింగీప్రక్కకు చేర్చిరి. ఇద్దరు పడవవాండ్రు పడవను డింగీకి చేర్చి పట్టియుండిరి. నేను 'టాపు' మీదనుండి నిచ్చెనపై కాళ్ళుమోపియుంటిని. ప్రక్కనుండి వేరొకరు వారిపడవను లాగికొని పోవుచుం

డిరి. మా తెరచాపకొయ్యకు దానితాడు చిక్కుకొనెను. మామనిషి యొకడు ఒక్కపెద్దకర్రతో దానిని తప్పింప ప్రయత్నించుచుండెను. నేను దానివంక చూచుచుంటిని. ఆమనిషి కర్రబరువు నాపుకొనలేక పోయెను. అతని చేతులలోనుండి అదినాతలపై బడుటకు సిద్ధముగా నుండెను. అన్నివైపులనుండియు "జాగ్రత్త, జాగ్రత్త," యని కేకలు బయలువెడలెను. పెద్దగల్లంతయినది. నేను మాత్రమింకను తెరచాప కొయ్యవంకనే చూచుచుంటిని. ఆమనిషి పాపము సాధ్యమైనంతవరకు నాతలమీద కర్రపడకుండ ప్రయత్నము చేసెనుగాని పూర్తిగమా త్రము తప్పింపలేకపోయెను. కర్రయొక్కకొన నాకంటి కొలికివద్ద సులోచనములమీద తగిలెను. కంటికి అపాయము తప్పినదికాని సులో చనములతో నాముక్కుమాత్రము లోతుగాకోసికొని పోయెను. నా సులోచనములను లాగివేసితిని. రక్తము దడదడ ప్రవహింపజొచ్చెను. అప్పుడు 'టాపు'నుండి క్రిందికిదిగి కూర్చుండి రక్తమును కడుగనారంభిం చితిని. తుపానుమాట మరచితిమి. అందరమును పరధ్యానముగా నుం టిమి. పడవవాండ్రింకను డింగీని పట్టియేయుండిరి. ఈరీతిగా పడవను లాగికొనుచు డింగీనడచుచుండెను.

ఇంతనకస్మాత్తుగా నొక పెద్దగాలివచ్చిడింగీ తెరచాపకొయ్యను విర చివైచెను. విరిగిపోయిన తెరచాపకొయ్య తెరతోడను త్రాళ్ళతోడను మా పడవ తెరచాపకొయ్యతో చిక్కుకొని పడవ'టాపు'మీద పడెను. నేనింతకుముందక్కడనే కూర్చుండియుంటిని. ఇప్పుడునాతలపై వ్రేలా డుచుండెను. డింగీపడవనులాగికొని తుపానులోనికి జొరబడెను. రెం టినిచేర్చి పట్టుకొనియున్న మనుష్యులింక దానిని సరిగా పట్టుకొనలేక పోయిరి. డింగీచే లాగబడుటవలన పడవ ఒకప్రక్కకొరిగెను. ఒకఅం గుళము ఎడముగా నీటిమట్టముతో సరిగానుండెను. కొయ్యతో చిక్కు కొనియున్న త్రాటిని త్రెంపుడని కేకలు బయలువెడలెను. "కత్తి, కత్తి"

అని కేకలు. కానియెక్కడను కత్తిదొరకదయ్యెను. కడకొకబండకత్తితో నెవరోపైకెక్కిరి. ఎన్నియోసారులు దెబ్బమీద దెబ్బకొట్టినను ఆ మొండికత్తితో అది తెగదాయెను. విశేషకష్టముమీద నొకతాడు తెగెను. ఇంకొకటి, మరియొకటికూడక్రమముగా తెగెను. రాజనారాయణబాబు, నేనునిశ్శబ్దముగా నీటివంకచూచుచుంటిమి. ఈక్షణమిక్కడనున్నాము, మరుక్షణము మనమెవరమో! జీవన మరణములెప్పుడును తోడునీడలై సంచరించుచుండును. రాజనారాయణబాబు చక్షువులు స్థిరముగనుండెను, వాక్కుస్తబ్ధమయ్యెను, శరీరము కొయ్యబారెను, పడవవాండ్రింకను తాళ్లని కోయుచుండిరి. మరియొకగాలి విసరెను. "ఇదిగోఇదిగో"యని కేకలువైచుచు పడవవాండ్రుమిగిలినత్రాళ్లను త్రెంపిరి. ఇట్లువిడుదలచేయబడి పడవ వేగముతోపోయియొకటిఒడ్డునుచేరి నిలచిపోయెను. వెంటనే నేనుపడవనుండిఒడ్డునకుదిగితిని. రాజనారాయణబాబునుకూడ చేయూతయిచ్చి దింపితిని.

మేము సురక్షితముగా ఒడ్డునకు దిగితిమి. కాని డింగీమాత్రమింకను విసురుగనే పోవుచుండెను. "ఆపు, ఆపు" మని పడవవాండ్రు కేకలిడిరి. అప్పటికి సూర్యుడస్తమించెను. మేఘచ్ఛాయతో సంధ్యారాగముగలయుటచే చీకటిగా నుండెను. డింగీ ఆగినదో లేదో అంధకారములో కనుగొనలేకపోతిమి. మరియొకవైపునుండి మాపడవవైపున కింకొకపడవ వేగముగా వచ్చుచుండెను. చూడచూడ నాపడవత్వరలో మమ్ముచేరెను. "ఇదేమి, బందిపోటు దొంగల పడవైయుండునా", అనుకొంటిని, పడవలోనుండి యొకడొడ్డునకు దుమికెను. ఆతడు మాయింటినౌకరు స్వరూప్. అతని ముఖము శుష్కించియుండెను. అతడు నాకొకఉత్తరమిచ్చెను. ఆయంధకారములో చాలకష్టముమీద దానిని చదువగలిగితిని. చదువగల్గిన దానిబట్టిజూడ నందు మాతండ్రిగారి మరణవార్తయున్నట్లు తోచెను. "కలకత్తాయంతయు తలక్రిం

దయినది. అనేకులు మిమ్ము వెదకుటకు పడవలు వేసికొని బయలు దేరి నారు. ఇంతవరకెవ్వరును మిమ్ము కలసికొనలేకపోయిరి. నాకష్టము మాత్రము ఫలించినది. మిమ్ములను చేరగలిగితిని," అని అతడు చెప్పెను. ఈవార్త నాపైపిడుగువలె పడెను. స్తబ్ధుడనై, విషణ్ణుడనై, డింగీ వైపునకు నాపడవను నడుపుకొనివెళ్ళి డంగీనెక్కి దీపము వెలుగున ఉత్తరము స్పష్టముగా చదివితిని. ఇప్పుడు చేయునదేమున్నది? అప్పుడీ మరణవార్త నేనెవ్వరితోను చెప్పలేదు.

మరునాడుదయమున పెందలకడనే కలకత్తావైపునకుమరలితిని. నాపడవకు 14 తెడ్లుండెను. లోనిచక్కలకు బల్లలు దిగగొట్టి తివాసులు పరుపబడెను. నాభార్యాబిడ్డల నందులోనికి గొనిపోతిని. డింగీ రాజనారాయణబాబునకిచ్చి సావకాశముగ రమ్మంటిని. తెడ్లతోను తెరచాపతోను నడుపబడి భాద్రపదమాస గంగా ప్రవాహసహాయమున, బ్రాలెడు నక్షత్రముల వేగముతో పడవ పరుగిడుచుండెను. కాని నామనసంతకన్న వేగముగ నడచుచుండెను. మేఘావృతమైన ఆకాశమునందనవరతము వర్షముచేతను, వాయువుచేతను కోలాహలమగుచుండెను. 'కాల్నా' కొలది కాలమునకు చేరుకుమనగా మధ్య దారిలో నొకమైదానముచెంత నొక పెద్దతుపాను బయలుదేరి పడవను ముంచివేయుటకు సిద్ధమైనది. అప్పుడు పడవ ఒడ్డుచేరువనుండి పోవుచుండెను. తక్షణమే పడవవాండ్రు దుమికి దగ్గరనున్న యొకచెట్టు మోడునకు పడవనుకట్టిపెట్టిరి. కావున పడవ సురక్షితముగానుండెను. అప్పటికామోడే ఆనిరాశ్రయ ప్రదేశమందు మాకాశ్రయమును, పరమమిత్రమును అయ్యెను. అయిదునిమిషముల పిమ్మట తిరిగి మనోవేగముతో పడవ బయలుదేరెను.

ప్రొద్దుగ్రుంకుసమయమున, నీలమేఘములచాటున వెలవెల బోవుచున్న సూర్యుని చూచితిని. అప్పుడు 'సుఖసాగరము' చేరితిని.

సూర్యాస్తమయమగు సరికి 'చంద్రనగరము' చేరితిమి. అప్పటికి తెడ్లు వేయువాండ్రు చేతులు తిమ్మెరలెక్కెను. అవిశ్రాంతముగ యింతపరిశ్రమ చెందియుంటచే నింకపనిచేయలేకపోయిరి. నదికి పోటుకూడతగిలెను. ఇది విషమవ్యాఘాతము. అక్కడనుండి 'పాల్టా' చేరుటకురాత్రి ఎనిమిదిగంటలాయెను. ఇక్కడపడవ ఒకవైపునకొరగజొచ్చెను. ఉదయము 10 గంటలు మొదలు సాయంత్రమువరకు వదలక వర్షముకురియుచుండెను. ఎక్కువగాలి విసురుచే పడవకూడ ఒకటిరెండుసార్లు ఆపవలసివచ్చెను. పడవవాండ్రు తడిసి చలిచే వణకుచుండిరి. 'పాల్టా' చేరగనే పడవ ఒడ్డునుండి యొకడువచ్చి బండిసిద్ధముగానున్నదని చెప్పెను. ఇది వినినతోడనే అడుగంటిన నాప్రాణములు ఉట్టిపడి లేచివచ్చినవి. అంతవరకు కదలకమెదలక పడవలోనే కూర్చుంటిని. బండిమాట వినినతోడనే బయటగది తలుపువద్ద నిలువబడితిని. అచ్చట మోకాలిలోతు నీళ్లుండెను. నీళ్ళు పడవలోనికివచ్చి అడుగు పైగా నిలచియుండెను. అదంతయు వర్షపునీరు. ఇదివరకు నాకీసంగతి తెలియదు. 'పాల్టా' వద్దకు బండి రాకుండినచో, కలకత్తాకు తిన్నగా పడవమీాదనే వెళ్ళియుండినచో, నీటిబరువుతో నిశ్చయముగా పడవ మునిగియుండెడిది. ఈకథ చెప్పుట కెవ్వరును జీవించియుండకపోయి యుందురు.

పడవదిగి బండెక్కితిమి. రోడ్లనిండ నీరు నిలచియుండెను. బండి చక్రములు సగమువరకు నీటిలో దిగబడిపోయెను. మిక్కిలికష్టముమీాద రాత్రి రెండుజాములవేళ యిల్లు చేరితిమి. అందరు నిద్రించుచుండిరి. ఎవ్వరు కదలుటలేదు. నాభార్యాబిడ్డలను లోపలిగదులలోనికి పంపి నేను మూడవ అంతస్థునకు వెళ్ళితిని. అక్కడ మాజ్యేష్ఠ పితామహుని పుత్రుడగు వ్రజబాబు నాకు స్వాగతమిచ్చెను. అంతరాత్రి వరకు ఒక్కడు నాకొరకు మేల్కొని అపేక్షించుచుండుటచూడ నా మనసున కొకభయము జనించెను. ఎందువల్లనో తెలియదు.

## పదునైదవ ప్రకరణము.



మాతండ్రిగారు 1846 వ సం॥ శ్రావణమాసములో సీమయందు మరణించిరి. అప్పటి కాయన వయస్సు 51 సంవత్సరములు. అవసాన సమయమునందాయన వద్ద నాకనిష్ఠసోదరుడు నగేంద్రనాథుడును, నాబావ మరిది నవీనచంద్ర ముఖర్జీయును యుండిరి. మాకీ వర్తమానము భాద్రపద మాసములో చేరినది. భాద్రపద బహుళ చతుర్దశినాడు దర్భగడ్డితో నాయన విగ్రహము నిర్మించి నామధ్యమ భ్రాతతో గంగానది అవతల దరికి బోయి ఆ విగ్రహమునకు దహన క్రియలు జరిపితిమి. నాడు మొదలు యథారీతిగ పది దినముల వరకు మైలపట్టి హవిస్యాన్నమే భుజించితిమి. ఈపది దినములు శిష్టాచార రక్షణ నిమిత్తము ఉదయముననే లేచి మిట్టమధ్యాహ్నము వరకు కాలికి జోడులేకుండ కలకత్తాలో నున్న మాన్యులను చూచి సాయంకాలము వరకు వీరిని మాయింటి వద్ద నాదరించుచుంటిని. పితృవియోగానంతరమున పుత్రులు పాలింప వలసిన కఠోర నియమములన్నియు యథావిధిగ జరిపితిమి. మాపినతండ్రి రామనాథ ఠాకూర్, "చూడు, ఇప్పుడేమి 'బ్రహ్మ, బ్రహ్మ' యనుచు గోలచెయ్యకు సుమా! పెద్దన్నయ్య పేరు చాల ప్రసిద్ధికెక్కినది." అని భయము చెప్పెను.

రాజారాధాకాంత దేవ్ వద్దకు నేను వెళ్ళినప్పుడు మాతండ్రిగారిని గురించి అనేక సంగతులడిగి ఆయన మృత్యువును గురించి తమ ఆంతరిక దుఃఖమును తెలియజేసెను. నాయందాయనకు చాల యిష్టము. అందుచే మిత్రునివలె, "శాస్త్రములలో నేయేవిధానములు చెప్పబడియున్నవో వాని ననుసరించి యీశ్రాద్ధమును విశుద్ధ భావముతో జరుపుమీ" యని నాకు సలహా చెప్పెను. "నేను బ్రహ్మధర్మ దీక్షను స్వీకరించితిని. దానికి వ్యతిరేకముగా నే కార్యమును

చేయజాలను. అట్లుచేసినచో ధర్మమునుండి పతితుడనగుదును. కాని నేను చేసెడు శ్రాద్ధము మాత్రము సర్వశ్రేష్ఠమగు ఉపనిషత్తుల నను సరించియే యుండును." అని నేను సవినయముగా ప్రత్యుత్తరమిచ్చి తిని. "అట్లు పనికిరాదు. అటులైనచో శ్రాద్ధము విధిపూర్వకముగ నుండదు. శిష్టాచారమునకు విరుద్ధమగును. నేను చెప్పినమాట విను ము. అంతయు సరిగా నుండును," అని ఆయన చెప్పెను.

నా రెండవతమ్ముడు గిరీంద్రనాథునితో నేను, "మన మెప్పుడు బ్రాహ్మలమైతిమో అప్పటినుండి సాలగ్రామముతీసికొనివచ్చి శ్రాద్ధ ముజరుపకూడదు. అట్లు చేసెడిపక్షమున మనము బ్రాహ్మలమెందుక యితిమి? ప్రతిజ్ఞల నెందుకుగైకొంటిమి?" అని చెప్పితిని. వినమ్రవ దనుడై యాతడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను: "అట్లయినచో మనలనందరు పరిత్యజింతురు. అందరు మనకు ప్రతిపక్షమువారగుదురు. మనసంసార మెట్లు జరుగును? మనమప్పుడు మహావిపత్తులలో పడిపోదుము." దాని కినేను, "ఏమైనను సరే, విగ్రహారాధనను మాత్రము ఎంతమాత్రము అంగీకరింపజాలము," అంటిని.

ఈవిషయములలో నేనెవ్వరివద్దనుండి ప్రోత్సాహము పొంద లేదు. నాప్రియసోదరుడే నాయుత్సహమును చల్లార్చెను. ప్రతివా రును నాయభిప్రాయములకు విరోధులుగా నుండిరి. నేనందరను రసా తలమున ముంచివేయుచున్నట్లు నాకువారు విరోధులైరి. నేనుచేయు ఈయొక్క కార్యమునుబట్టి అందరును జీవించినయుండుటో నశించుటో సంభవించునని వారందరునభిప్రాయపడుచుండిరి. అందరునావలపక్షము, నేనొక్కడను ఒకపక్షము. ఎవ్వరును ఆశగలిగించుమాట నొక్కటై నను పలుకకుండిరి.

ఈవిధముగ నేను నలుప్రక్కల కష్టములలో చిక్కుకొనియుం డినపుడా యసహాయబంధుహీనావస్థలో నొక్కబ్రహ్మనిష్ఠాగరిష్ఠుడు

మాత్రమునాకు సహాయుడై నాహృదయాంతరాళమునందుండు అభిప్రాయములనే పల్కెను. "ప్రపంచమునకు భయపడెదవా? నీకేమి భయము? ఎవనికిభయపడినచో నన్యులవలనభయముండదో యాతనికి మాత్రము భయపడుము. ధర్మము కొరకు ప్రాణమునైన సమర్పింపవలెను. ధర్మముముందు లోకనింద యెంతమాత్రపుది? ప్రాణములు పోయిననుసరే మనము ధర్మమును మాత్రము వదలవద్దు."

ఇతడెవరు? లాలా హజారిలాల్. ధర్మనిష్ఠయందును, సాహసమునందును బంగాళీలకన్న పశ్చిమదేశవాసులును, హిందూస్థానికులును ఘనులు. ఈసంకటసమయమున నేనతని పరిచయముపొందితిని. నాతోనతడు ఏకమనస్కుడును, ఏకహృదయుడునై నాస్వపక్షమున నిలబడి యుండెను. మాపితామహుడు బృందావనమునకు తీర్థయాత్ర వెళ్ళినప్పుడు హజారిలాలొక పితృమాతృహీన బాలుడుగా నుండుట చూచి తనతో మాయింటికి తీసికొని వచ్చెను. ముందుముందు అతని జీవిత కళ్యాణము కొరకు ఏమికావలసినను చెయ్యవచ్చునని ఆతని కాశ్రయమిచ్చెను. కాని అతనిపక్షమున దీనికిని విపరీతము సంభవించెను. అతడు కలకత్తాకు రాగానే నగరముయొక్క పాపస్రోతములో కొట్టుకొనిపోయెను. ఇతనిని చూచువారెవరును లేకపోయిరి. ఇతనితో మాట్లాడువారెవరును లేకపోయిరి. దుస్సహవాసములో పడి అతని జీవితము పాపమయమై కళంకమయమైపోయెను. ఈదురవస్థయందితడు ఈశ్వరప్రసాదమువల్ల బ్రాహ్మసమాజమునందాశ్రయము పొందెను. బ్రాహ్మధర్మముయొక్క బలము అతని హృదయమునందవతీర్ణమయ్యెను. అతడాబలముతో పాపస్రోతము నతిక్రమించి పుణ్యపదవి నారోహించెను. ఈహజారిలాలే ప్రసిద్ధ బ్రాహ్మధర్మ ప్రచారకుడయ్యెను. ఎప్పుడతడు బ్రాహ్మధర్మము స్వీకరించి కుటిలపాపముల నుండినిష్కృతి చెందెనో అప్పటినుండియు తానుఇతరులనుకూడ పుణ్యపథ

మునకు తీసికొనివచ్చుటకు ప్రియత్నింపసాగెను. కలకత్తాలోనుండు ధనికులకును, దరిద్రులకును, జ్ఞానులకును, మాన్యులకును, ప్రతిమను జనకును బ్రాహ్మధర్మముయొక్క ప్రకృష్టమంగళపథముచూపనారంభించెను. అంత స్వల్పకాలములో నంతమంది బ్రాహ్మధర్మము స్వీకరించుట కేవలమతనిప్రియత్నమూలమున నే. ఇతడే నాకీసంకటసమయమునందు, "లోకులకుభయము జెందుటేల, లోకమెక్కువా? దైవమెక్కువా?"అనిఅడిగెను. ఇతనిమాటలు నాకుసాహసమును, ఉత్సాహమును పురికొల్పెను. నాహృదయములో బ్రహ్మాగ్ని మరింత రగుల్కొనెను.

ఈయాలోచన యందును, శోచనయందును నాకు రాత్రిబాగుగ నిద్రిపట్ట లేదు. తండ్రి చనిపోవుట యొకటి, దానితో దినమంతయు లౌకికముతో పరిశ్రిమ, కష్టము. అటుపై నాయాంతరిక ధర్మయుద్ధము. ప్రపంచము జయించునా ధర్మము జయించునా? ఎవ్వరుచెప్పజాలరు. ఇదియేనన్ను బాధించుచుండెను. "నాదుర్బల హృదయమునకు బలము నిమ్ము. నాకు ఆశ్రియమునిమ్ము." అని యీశ్వరుని ప్రార్థించుచుంటిని ఈసకలచింతనలతోను, శోచనలతోను నాకురాత్రి నిద్రిలేకుండెను. 'బాలీసు' పై నాతల దిమ్మెక్కి యుండెను. రాత్రి యొకసారి నిద్రిపట్టుచుండెడిది, తిరిగి మెలకువ వచ్చుచుండెడిది. నిద్రా జాగ్రిదావస్థలసంధి స్థలములో నుంటిని. అట్టిసమయములో నాయంధకారములో నెవరో యొకరు వచ్చి 'లే' అనిరి. నేను లేచి కూర్చుంటిని. తిరిగి, "పక్కమీాదనుండి దిగు," అనిరి. పక్కమీాదనుండి దిగితిని. "నావెనువెంట రమ్ము" అని యతడనెను. నేనతని వెనువెంటనే వెళ్లితిని. అతడు గది చీడీలు దిగెను. నేనును అట్లే దిగితిని. అతనితో సావడిలోనికి వచ్చితిని. దేవిడీ ద్వారము వద్ద నిలచితిమి. 'దర్వానులు నిద్రించుచుండిరి. అతడు తలుపులు తాకెను. వెంటనే తలుపులు రెండును చివాలున తెరచుకొనెను.

అతనితో నింటి ముందున్న వీధిలోనికి పోతిని. ఆతడు ఛాయాపురుషు నివలె నుండెను. అతనిని స్పష్టముగా చూడలేక పోతినిగాని అతడు నాకేది నియమించినను అది వెంటనే నెరవేర్చుటకు మాత్రము బద్ధుడ నైతిని. ఇక్కడనుండి అతడు ఊర్ధ్వముగ ఆకాశమువంక నెక్కెను. నేను నతని వెంటనే యాకస మెక్కితిని. ఇరుప్రక్కలను గ్రహానక్షత్ర పుంజము. తారకాసమూహము నాదక్షిణమున, వామమున, సమ్ముఖమున, సముజ్వలమై యెల్లెడల కాంతులు వెదజల్లుచుండెను. వాని మధ్యనుండి నేను నడచుచుంటిని. నడువగా నడువగా మేమొక పొగ మంచుచే నావరింపబడితిమి. ఇంక నచట తారకలు, గ్రహములు నేమియు గానరావయ్యెను. ఆపొగమంచులో కొంతదూరము నడచిన పిమ్మట ఆమంచు సముద్రము నందలియొక ద్వీపమువలె పూర్ణ చంద్రుడు స్థిరముగా నిలచి యుండెను. దానిచెంత చేరినకొలది చంద్రబింబము వృద్ధిచెందుచుండెను. ఇకనది గోళాకారముగ నగపడుటలేదు. మన పృధివివలెనే చదునుగా నుండెను. ఆఛాయా పురుషుడు వెళ్ళి ఆపృధివియందు నిలబడెను. నేనునట్లే ఆపృధివియందు నిలచితిని. ఆభూమియంతయు శ్వేతప్రస్తరము. ఒకతృణమైనను లేదు. పుష్పములు లేవు, ఫలములులేవు. ఆ నున్నని తెల్లని బయలు మాత్రము అన్నివైపులకు వ్యాపించి యుండెను. దాని జ్యోత్స్న సూర్యునివద్ద నుండి పొందలేదు. తన కాంతితోనే తాను వెలుగు చుండెను. దానికి నాలుగు ప్రక్కలను వ్యాపించియున్న మంచును భేదించి సూర్యరశ్మి చొరలేకుండెను. తన నిజరశ్మి అతిస్నిగ్ధము. అచ్చటి వెలుతురు ఇక్కడ పట్టపగటి నీడను పోలియుండును. అచ్చటి వాయువు సుఖస్పర్శము.

ఈబయలులో సంచరించి సంచరించి యందొక నగరము ప్రవేశించితిమి. ఇండ్లు, వీధులు సర్వము శ్వేతప్రస్తరముతో నిర్మింప

బడియుండెను. పరిశుభ్రముగను, స్వచ్ఛముగను యున్న ఆవీథులలో నొక్కమనుష్యుడైనను కనబడలేదు. కోలాహలమునులేదు. సర్వమును ప్రశాంతముగనుండెను నామార్గదర్శి వీథిప్రక్కనున్న ఒకయింటిలో ప్రవేశించి దానిమేడలోనికెక్కెను. నేనును అతనివెంటనే యెక్కితిని. అదొకదివ్యమైన గృహము. లోపల తెల్లచలువరాతితో చేయబడిన యనేకమైన మేజాలు, కుర్చీలు. అతడు నన్నుకూర్చుండుమనెను. నే నొకకుర్చీలో కూర్చుంటిని. ఇంతలో నాఛాయ అదృశ్యమయ్యెను. అక్కడ నింకెవ్వరును లేరు. నిశ్శబ్దముగానున్న యాగదిలో నేను నిశ్శబ్దముగా కూర్చుంటిని. ఒకక్షణమైన పిమ్మట గదిముందున్న ద్వారము యొక్క తెరయొకటిఒత్తిగింపబడెను. ఆసీనురాలయ్యెను నాజనని! మరణదినముననామె కేశజాలమెట్లు విరగపోసియుండెనో యిప్పుడునట్లేవిరగ పోసియుండెను. ఆమె మరణించినప్పుడు నిజముగా మరణించెనని నేననుకొనలేదు. ఆమెకు అంత్యక్రియలు జరిపి స్మశానవాటికనుండి యింటికివచ్చిన పిమ్మటకూడ ఆమె మరణించినదని నమ్మజాలనైతిని. ఇంకను జీవించి యున్నదనే నిశ్చయించికొంటిని. సజీవమైన నాతల్లినిప్పుడు నా సమ్ముఖమున చూచితిని. “నిన్నుచూడవలెనని యిచ్ఛజనించెను. నీకొరకు కబురుపంపితిని. నీవు నిజమైనబ్రహ్మజ్ఞానివైతివిగా! కులంపవిత్రం జననీకృతార్థం!” అనెను. ఆమెనుచూచి యామె యొక్కయీ మధుర వాక్యమును విన్నపిమ్మట ఆనందముచే నానిద్రభంగమయ్యెను. అప్పటికింకను నాపక్కమీదనే దొర్లుచుంటిని.

శ్రాద్ధదినము వచ్చినది. గృహసమ్ముఖమున పశ్చిమప్రాంగణమున నొక దీర్ఘమైనపందిరి వేయబడియుండెను. దానములిచ్చు సమయమందివ్వవలసియున్న బంగారువస్తువులచే నాపందిరి యలంకరింపబడియుండెను. క్రమముగా నాసాలయంతయు కుటుంబస్నేహబాంధవ జనముతో క్రిక్కిరిసిపోయెను. విగ్రహారాధన సంస్రవవిసర్జితమైన యొక

మంత్రము స్థిరపరచి దానోత్సర్గసమయమందీమంత్రము నాచే చదివింపుమని శ్యామచరణభట్టాచార్యునితో చెప్పియుంచితిని. ఇక నావలపక్షమున పురోహితులు, ఆత్మీయ స్వజనులతో సాలమధ్యస్థమున సాలగ్రామాదుల స్థాపనజేసి నాయుపవేశనకొరకపేక్షించుచుండిరి. ఏవంకజూచినను కోలాహలము. నలుప్రక్కల తొడతొక్కిడి. ఇట్టియవసరమున నేను శ్యామచరణభట్టాచార్యుని నొకమూలకు తీసికొనివెళ్ళి యానిర్దిష్టమంత్రముద్వారా దానసామాగ్రి నుత్సర్గముచేయ నారంభించితిని. ఈవిధముగా రెండుమూడు దానములిచ్చుట యయ్యెను. ఇంతలో నామేనమామ మదనబాబువచ్చి, "మీరిక్కడేమి చేయుచున్నారు? అటుప్రక్క దానములిచ్చుచున్నారే. ఇచ్చట సాలగ్రామములేదు పురోహితులులేరు, ఏమీలేదు" అని కేకలుపెట్టెను. మరియొకచోటునుండి మరియొకగోల, "అయ్యో కీర్తనపాటకులను లోనికి రానిచ్చుటలేదు", అని యందరు కేకలుపెట్టిరి. నీలరత్నహాల్దార్, "అయ్యో, యజమానికి కీర్తనవినుట మిక్కిలి యిష్టముగా నుండెను," అనెను. నా పినతండ్రి రామనాథఠాకూర్ వచ్చి "కీర్తనపాటకులు రాకుండ నాటంకపరచితివేల?" అని యడిగెను. నాకదేమియు తెలియదనియు, నేనడ్డుపెట్టలేదనియు జెప్పితిని. "అదిగోచూడు, హాజారీలాల్ పాటకుల నింటిలోనికి ప్రవేశింపనిచ్చుటలేదు," అనెను. నేను త్వరితముగా షోడశదానములను, తదితరదాన సామాగ్రుల నుత్సర్గము కావించి మూడవ యంతస్థులో నాగదిలోనికి వెళ్ళిపోతిని.

అటుపిమ్మట నాకెవ్వరును కనబడలేదు. గిరీంద్రనాథుడు శ్రాద్ధముపెట్టుచుండెనని మాత్రము వింటిని. మధ్యాహ్నానంతరమున నీకోలాహలమంతయు సర్దుకొనినపిమ్మట శ్యామచరణ భట్టాచార్యుని మరికొందరు బ్రాహ్మలను చలువరాళ్ళు పరుపబడిన నాక్రిందిగదిలోనికి తీసికొనివెళ్ళి కఠోపనిషత్తు చదివితిని. ఏలనన శ్రాద్ధసమయము నందా

యుపనిషత్తెవరు చదువుదురో వారికా శ్రాద్ధఫలమనంతమని కఠోపనిషత్తునందు వ్రాయబడియున్నది. నాడింకేమియు జరుగలేదు. జ్ఞాతులు, కుటుంబబంధువులు, స్నేహితులు నందరు భోజనముచేసి ఎక్కడనుండి వచ్చిన వారక్కడకు వెళ్ళిపోయిరి. మరునాటివిందునకు జ్ఞాతులు కుటుంబీకులు మెవ్వరునురాలేదు, వాడందరును నన్ను త్యజించిరి. నామేనమామ, బావమరదులు, నలుగురత్తలుమాత్రము నాపక్షముననుండిరి. వారందరును వేర్వేరు గృహములలో నుండిరి. కావున తక్కినవారు నన్ను వెలివేయలేకుండిరి.

నేను గిరీంద్రనాథునితో, "నీవు శ్రాద్ధముపెట్టినంటువల్ల నీకేమి లాభముకలిగెను? ఎవ్వరుదానిని స్వీకరింపలేదుగదా! నీప్రతిజ్ఞమాత్రము భంగమయ్యెను. ఎవరిని సంతోషపెట్టుటకు నీవు నీధర్మమునకు విరుద్ధమైన కార్యముచేసితివో వారే భోజనమునకు రాలేదే?" అని యడిగితిని. ప్రసన్నకుమార ఠాకూర్, "దేవేంద్రుడింకెన్నడును అట్లు చేయనిచో మేమందరమును భోజనమునకు వత్తు" మని వర్తమానమంపెను. "అట్లైనచో ఇంతగడబిడయేమునకుచేసియుందును? నేనింక విగ్రహారాధనలోమిళితము కాజాలను" అని ప్రత్యుత్తర మిచ్చితిని. బ్రాహ్మధర్మానురోధముగ విగ్రహారాధన పరిత్యజించిన శ్రాద్ధానుష్ఠానమున కిదియే మొదటి దృష్టాంతము. బంధువులు, మిత్రులు నన్ను పరిత్యజించిరి. ఈశ్వరుడునన్ను మరింత దగ్గరకు లాగుకొనెను. ధర్మమే జయమందెనుగదా యని నాయాత్మసంతుష్టి చెందెను. ఇదితప్ప నాకేమియు నక్కరలేదు.



## పదునారవ ప్రకరణము.

మాతండ్రిగారు ప్రథమమున 1841 వ సంవత్సరములో ఐరోపాను సందర్శించిరి. హుగ్లీ, పాబ్నా, రాజషాహి, కటకము, మేదినీపురము, రంగిపురము, త్రిపుర మొదలగు జిల్లాల యందప్పుడాయనకు గొప్పజమీందారీ భూములుండెను. నీలిమందు కర్మాగారములలోను, బొగ్గు గనులలోను, సూరేకారము, చక్కెర, తేయాకు మొదలగువాని వాణిజ్యములోను ఆయనకు విస్తారవ్యాపారముండెను. వీనితోబాటు రాణిగంజి బొగ్గు గనులలో కూడ పనిసాగించుచుండిరి. అప్పుడు మాసంపద మహోచ్ఛదశయందుండెను ముందుముందీ సకల మహాకార్యములభారము మాచేతిలోపడిన యెడల వానిని రక్షింపలేమని తన సుతీక్ష్ణబుద్ధితో నాయన కనుగొనెను. మాహస్తములలోపడి వాణిజ్య వ్యవసాయ కార్యములన్నియు పతనము చెందినచో వానితోబాటు మాస్వార్జితమైన గొప్ప గొప్ప జమీందారీలు విలుప్తమగుటయేగాక మాపూర్వులు సంపాదించిన బరహింపూరు, కటక్ జమీందారీలకుకూడ నాదశయేపట్టును. తన వాణిజ్యవ్యాపారము చెడుటవల్ల మాపూర్వుల ఆస్తికూడ నశించి పోవును. ఇది ఆయన మనస్సునకతిశయ చింతావిషయమై యుండెను. కావున 1840 సంవత్సరములో, ఐరోపాకు పోకముందు తనపూర్వులు సంపాదించిన బరహింపూర్, కటక్ జమీందారీలతో స్వార్జితమైన డిహీసజడ్‌పూర్, పర్గణా కాలీగ్రామమును చేర్చి, ఈనాలుగు 'ఇస్టేట్లను' నొక "ట్రస్టుడీడ్" వ్రాసి ముగ్గురు 'ట్రస్టీలను' నియమించిరి. ఈసమస్తమునకు నధికారులు వారే. మేము కేవలముపసత్వ భోగులముగనుంటిమి. దీనింబట్టి ఆయనకు మాయందుండు ప్రేమయు, సూక్ష్మమైన తనదూరదృష్టియు కూడ స్పష్టపడెను.

ఐరోపా పరిభ్రమ సందర్శనానంతరమున తిరిగి వచ్చిన ఆరు మాసములకు, మాతండ్రిగారు 1843 వ. సం॥ రం. భాద్రపదమాస ములో తన యావదాస్తిని మాముగ్గురుసోదరులకుసమభాగముగావిభ జించి యొక ' వీలు ' వ్రాసెను. భద్రాసనగృహము, మూడంతస్థుల కచేరిమేడ, నా రెండవ తమ్ముడు గిరీంద్రునకును, గృహము యొక్క పశ్చిమ ప్రాంగణముననున్న స్థలమంతయును, గృహనిర్మాణము కొరకు 20,000 రూపాయలునుమా చిన్నతమ్ముడు నాగేంద్రనాథున కును ఇచ్చి వేసెను. Carr Tagore & Co, పేరుతోనున్న వాణిజ్య వ్యవ సాయములందు మాతండ్రి కొక అర్ధభాగముండెను. మిగిలినభాగస్థు లాంగ్లేయులు, మాతండ్రి సగముభాగము నాకే యిచ్చెను, గాని దానిని పూర్తిగా నేనే ఉంచుకొనక మాముగ్గురన్నదమ్ములకు సమముగా పంచి యిచ్చితిని.

గిరీంద్రునకు వ్యవహారములో మంచి చాక చక్యముండెను. ' కంపెనీ ' లో భాగస్థుడైన పిమ్మట నొకానొకదినమాతడు నాతో నిట్లనెను, " కంపెనీ పెట్టుబడి అంతయు మనదేకదా ! ఈ ఆంగ్లేయు లతో మనకేల భాగముండవలయును? వ్యవహారమంతయు మనమేల తీసికొనరాదు ? "—ఈ అభిప్రాయమునాకు నచ్చలేదు. " ఇదంత మంచిమాటకాదు. వారు భాగస్థులుగానుండుటచే వారు ఉత్సాహ ముతోను మనోబలముతోను కార్యములు చేయుచున్నారు. ఇప్పుడు వారి నాభాగములనుండి తప్పించినచో మనకార్యములయందు వారి కింక అశ్రద్ధయు నుత్సాహమును ఉండవు. మనంతట మనమీవ్యవహా రము నెన్నడును చక్కబెట్టుకొన జాలము. పని జరుగుటకు వారుండు ట యవసరము. భాగస్థులుగాన మనలాభములో వారికి భాగ ముండుట వాస్తవమే కాని నష్టము వచ్చినను వారు కొంత భరింప వలయును గదా ! అట్లుగాక వారిని భాగస్థులుగా నుండుట మాన్పి

జీతగాండ్రుగా నుంచినచో మనమన్ని సందర్భములలోను వారికి జీతములనివ్వకతప్పదు, పనిలో వారికంత శ్రద్ధయునుండదు. కావుననీమాట నాకంగీకారములేదు" అంటిని. అతడిట్లు వాదింప దొడగెను. "కాని దొరలకు స్వంతఆస్తి ఏదియులేదు. ఎప్పటికైనను వాణిజ్యము పతనము చెందినచో అప్పుల వాండ్రు మన ఆస్తినే పట్టుకొందురు. అన్ని వ్యవహారములు మనమే చక్కబెట్టుకొనవలసియుండును. అప్పులు తీర్చుటకు మనభూములన్నియు అమ్ముకొనవలసియుండును. ఇప్పుడు మనలాభములను మాత్రము పంచి కొందురుగాని నష్టసమయములో నష్టము భరించుటకు మాత్రము వారికేమియునుండదు. లాభము లనుభవించిన పిమ్మట వారు వెడలుదురు. మనము మాత్రము నష్టము లెక్కించుకొనుచుందుము. ఇప్పుడుకూడ ఏమి జరుగుచున్నదో చూడుము. మన జమీందారీ సొమ్మంతయు కంపెనీకై వెచ్చించుచుందుము. మనమెంత సొమ్మిచ్చిన వ్యాపారమునకంత యాకలిహెచ్చుచుండును. దాని రాక్షసక్షుధ యింకను తీరదు. కాని ఆంగ్లభాగస్థులొక్కపైసనైననివ్వరు." ఇట్లనుటవిని ఆతని చాకచక్యమును ప్రశంసచేసి కంపెనీ కర్తృత్వభారమంతయు నాతనిపై నుంచితిని. ఈ విధముగ నేను బ్రాహ్మసమాజమునకు పని చేయుటకును, ప్రచారము చేయుటకును కొంతతీరిక చేసికొంటిని.

మేము ముగ్గురన్నదమ్ములము కంపెనీయొక్క సంపూర్ణాధికారము సంపాదించితిమి. మునుపు మాభాగస్థులుగా నుండిన ఆంగ్లేయులకు ఉద్యోగము లిచ్చితిమి. వారివారి కిదివరలో నుండిన భాగములను బట్టి మాసమునకు కొందరకు వేయేసి రూపాయలు కొందరకు రెండేసి వేల రూపాయలు వేతన మిచ్చుచుంటిమి. అందుచే నీయేర్పాటునకు వారంగీకరింపవలసి వచ్చెను. ఇదివరలో వారువారు చేయుచుండిన పనులను చేయుచుండిరి. కాబట్టి గిరీంద్రుని అభిప్రా

యానుసారముగా **Carr Tagore & Co,** ఈనూతన ప్రణాళిలోనిబద్ధ మయ్యెను. నేనతని యభిప్రాయములను మెచ్చుకొనుటచే నతడుత్సాహముపొంది కంపెనీ వాణిజ్య కార్యమంతయు తన యావచ్ఛక్తితో శ్రద్ధాపూర్వకముగా యథాసాధ్యముగా చూడనారంభించెను.



## పదునేడవ ప్రకరణము.



ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము, శిక్ష, కల్పము, నిరుక్తము, ఛందస్సు—అన్నియు అశ్రేష్ఠవిద్యలనియు, ఏవిద్యద్వారా పరబ్రహ్మమును తెలిసికొనగలుగుదుమో అదియే శ్రేష్ఠవిద్యయనియు ఉపనిషత్తుల యుపదేశమువల్ల నేర్చికొంటిమి అతిశ్రద్ధాపూర్వకముగా నీసంగతి గ్రహించితిమి. మాలక్ష్యముతో నిది పూర్తిగనేకీభవించి యున్నది. ఈలక్ష్యమును జనసామాన్యమునకు ద్యోషింపవలెనను యభిప్రాయముతో 'తత్వబోధినీ' పత్రికయొక్క ద్వితీయకల్పములోని ప్రథమభాగమునుండియు దాని శిరోభాగమున నీక్రింది వేదవాక్యము ప్రకటింప నారంభించితిమి.

> "అపరాఋగ్వేదోయజుర్వేదః సామవేదో
> ధర్వవేదః శిక్షాకల్పో వ్యాకరణం
> నిరుక్తంఛందో జ్యోతిషమితి । అథపరా
> యయా తదక్షర మధిగమ్యతే॥"

దీనింబట్టి వేదములలో పరావిద్య అపరావిద్యయను రెండుభాగములున్నవని గ్రహించితిమి. ఈరెండువిద్యల విషయములును విపులముగా గ్రహించుటకుగాను వేదానుసంధానములో ఉత్సుకుడనైతిని. నేను స్వయముగ కాశికిపోవుటకు సిద్ధపడితిని. లాలాహజారిలాల్‌తో,

అంచీలమీద పాలకీనెక్కి కాశికిప్రయాణమైతిని (1843 అక్టోబరులో) అతికష్టముమీద పదునాల్గుదినముల కచటచేరితిమి. గంగాతీరమున 'మాన్మందిరము' నావాసస్థానము చేసితిని. నేనచటకు వచ్చుటచూచి నేను పంపినవిద్యార్థులు విశేషాహ్లాదితులైరి, వారణాసీపుర విశేషములను, వారివారి స్వీయావస్థలను తెలిసికొంటిని. కాశిలోని ప్రధానవేదజ్ఞులను, బ్రాహ్మణులను, శాస్త్రులను నిమంత్రణచేసి, "నేనిక్కడ నొకసభ గావించెదను. వేదములన్నంటిని యాలకించి అర్థమును గ్రహింపవలెనని యున్నది. రామనాథా! నీవు మీఋగ్వేదగురువుతో ఈపురమునందున్న ఋగ్వేదబ్రాహ్మణులనందరిని పిలువమని చెప్పుము. వాణేశ్వరా! యజుర్వేదబ్రాహ్మణులనందరిని పిలువుమని మీ యజుర్వేదగురువుతో చెప్పుము, తారకనాథా! సామవేద బ్రాహ్మణులనందరిని పిలువమని మీసామవేదగురువుతో చెప్పుము. ఆనందచంద్రా! అధర్వవేద బ్రాహ్మణులనందరిని పిలువుమని మీఅధర్వవేదగురువుతో చెప్పుము" అంటిని. ఈప్రకారముగా కాశిలోని బ్రాహ్మణులందరును నిమంత్రణ గావింపబడిరి.

వేదములన్నియు వినుటకు ఎవరో బంగాళాదేశమునుండి ఒక శ్రద్ధావంతుడగు యజమానుడు వచ్చియున్నాడని కాశిలో వదంతిపుట్టెను. విశ్వేశ్వరాలయపుపండా నావద్దకువచ్చి విశ్వేశ్వరాలయమునకు నన్ను రమ్మని ఆహ్వానించెను. "ఇప్పుడున్నది విశ్వేశ్వరాలయములో కాక వేరెక్కడ? ఇంకెక్కడికి రమ్మనెదవు?" అంటిని. నేను కాశికివచ్చిన మూడవదినము ప్రాతఃకాలము మాన్మందిరములోని విశాలమైన సావడియంతయు బ్రాహ్మణులతో నిండిపోయెను. వారినందరిని నాలుగు పంక్తులుగా కూర్చుండబెట్టితిని. ఋగ్వేదులు రెండుపఙ్క్తులు, అథర్వవేదులొక పంక్తి, సామవేదమున కిద్దరుబాలకులు మాత్రముండిరి, వీరిని నాపార్శ్వమున కూర్చుండబెట్టుకొంటిని. వారునూ తన బ్రి

హ్మాచారులు, అయినను చెవులకు కుండలములుండెను. వానివల్ల వారి ముఖములకు విశేషశోభకలిగెను.

వాణీశ్వరుడు చందనపు గిన్నె తీసికొని వెళ్ళెను. తారకనాథుడు పుష్పమాలలు పట్టుకొని యుండెను. రామనాథుడు వస్త్రములు చేతబూని యుండెను. ఆనంద చంద్రుడు అయిదువందల రూప్యములు పట్టుకొనియుండెను. వాణీశ్వరుడు బ్రాహ్మణుల లలాటముల చందన మలదినవెంటనే తారకనాథుడు వారి కంఠముల పుష్పమాలలుంచు చుండెను. పిమ్మట రామనాథుడొక్కొక్క నేతవస్త్రమిచ్చుచుండెను. కడపట ఆనందచంద్రుడు వారిచేతులలో రెండేసిరూపాయలుంచుచుం డెను. ఈవిధముగా ప్రతిబ్రాహ్మణునకును ఒకబొట్టు, ఒకమాల, ఒక ధోవతి బహుమానము లభించెను. బ్రాహ్మణులీపూజను గ్రహించి ప్రహృష్టాంతరంగులై, "ఈయజమానుడెంత శ్రద్ధావంతుడు! ఇదివ రకెవ్వరును కాశిలో నిట్లు చేసియుండలేదు," అని పలుకజొచ్చిరి.

"ఇకమీరు వేదములు గానముచేసి నన్ను పవిత్రునిగావిం పుడు," అని హస్తములు జోడించి సవినయముగా పల్కితిని. ఋగ్వేద బ్రాహ్మణులందరును కలసి అత్యుత్సాహముగా నుచ్చైస్స్వనముతో, "అగ్నిమీడే పురోహితం" అని వర్ణింప నారంభించిరి. తోడనే యొక బ్రాహ్మణుడు, "యజమాని నన్నవమానపరచుచున్నాడు," అని కేక లిడెను. అదియెట్లని నేనడిగితిని. "కృష్ణయజుర్వేదము ప్రాచీనమైన ది. దానిని ముందు సన్మానించుటలేదు. ముందది పఠింపబడుటలేదు. మాకిది యవమానముగా నున్నది", అనెను. "ఈతగాదామీలోమీరు తీర్చుకొనుడ" ని నేనంటిని. ముందెవరు పఠించుటయనియిరుపక్షములవా రికి వివాదము సంభవించెను. దీనికంతము లేనట్లుతోచి, యిద్దరును ఒక్కసారే ప్రారంభింపుడని యాజ్ఞాపించితిని. దీనికివారు సంతుష్టిచెం దియిరుపక్షములవారును ఉచ్చైస్స్వనముతో గోలగావించుచు పఠింపనా

రంభించిరి. అందువల్ల నేమియు తెలియలేదు. నేనప్పుడిట్లంటిని: "మీ రెండుదళములగౌరవము కాపాడబడినది గావున ఇప్పుడొక్కదళమువా రాగి ఒకదళమువారుపఠింపుడు. మొదటశుక్లయజుర్వేదమును, పిమ్మట కృష్ణయజుర్వేదమును పఠింపుడు." యజుర్వేదము పఠించుసరికి మిక్కిలి ఆలస్యమయ్యెను. సామవేదబాలురు సామగానము వినిపించుటకు విశేషఉత్సాహముతో నిండియుండిరి. యజుర్వేదమాలస్యమగుట చూచి విసుగుచెందుచుండిరి. అది ముగిసినపిమ్మట వెంటనే వారు నాముఖము వంక చూచిరి. "పఠింపుడు" అంటిని. వెంటనేవారిరువురుసు మధురస్వరముతో, "ఇంద్రఆయాహి" అని సామగానము చేయజొచ్చిరి అంత మధురమైన సామగానము మున్నెన్నడును నేను వినియెరుగను. చిట్ట చివర అధర్వవేదము చెప్పిరి. అంతతో సభముగిసెను.

బ్రాహ్మణులు సదయులై సభానంతరమున నాతో, "యజమానిఅనుగ్రహించి బ్రాహ్మణ సంతర్పణగావించినచో ఒకవనములో మన మందిరము కలసి భుజింపవచ్చును," అనిరి. నేను వారిమాట కేమియు ప్రత్యుత్తరమియ్యకమునుపే తారకనాధుడు నాచెవిలో "ఈబ్రాహ్మణులకింకను విందా? ఒక్కొక్కరొక్కొక్కచోట కూర్చుండి వేర్వేరు భోజనము లారంభింతురు. ఇన్ని యేర్పాటులు చేయవలసియుండును. అట్లు చేసినను ఏమిప్రయోజనము? మనయూళ్లలో బ్రాహ్మణ సంతర్పణచేసినట్లుండదు. అక్కడ మనము వండిపెట్టిన నందరు కలసిభుజింతురు" అనెను. మరియొకబ్రాహ్మణుడువచ్చి "త్వరలో నొకయజ్ఞము గావింపనున్నాము. తమరు చూడనిచ్చగింతురేని దయచేసి చూడవచ్చును" అని చెప్పెను. నేనీకార్యముమీద మాత్రమే వచ్చియుంటినని చెప్పితిని. అతడు "మాయజ్ఞములో జంతువులను చంపము. పిండితో పశువులను నిర్మాణముచేసి చంపుదుము" అనెను. మరియొకప్రక్కనుండికొందరు బ్రాహ్మణులు "జంతువులను చంపకుండ యజ్ఞమేమిటి?

వేదములో 'స్వేతంఆలభేతా'—తెల్ల మేకను చంపవలెను—అనియు న్నది" అనిరి. యజ్ఞమునుగూర్చిగూడ భేదాభిప్రాయము లున్నవిగదా యనుకొంటిని. ఎట్లయినను బ్రాహ్మణులు సంతుష్టిచెంది ఇళ్ళకుతిరిగి వెళ్ళిరి.

నామధ్యాహ్నభోజనము కొరకొక శుద్ధసత్వ బ్రాహ్మణుడు నాకు బియ్యము కూరలు తెచ్చియిచ్చెను. తిరిగిమధ్యాహ్నము మూడు గంటలకు కాశిలోని పండితులు, శాస్త్రజ్ఞులు శాస్త్రాలోచనకొరకు 'మాన్మందిరము' నకు వచ్చిరి. వేదములలోని విజ్ఞానకాండ కర్మకాం డలు, ఇంకను ఇతరములైన శాస్త్రములుతర్కింపబడెను. ప్రసంగవశ మున నేను వారిని "యజ్ఞములో పశువులను చంపుట వేదవిహితమా" యని అడిగితిని. పశువులను చంపసిదేయజ్ఞము చేయుటకే వలనుపడ దనివారు ప్రత్యుత్తర మిచ్చిరి. నేనీప్రకారముగా పండిత గణముతో శాస్త్రాలోచన జరుపుచుండగా మందిరమునుండి వారి బంధువర్గములో నొకరు నావద్దకు వచ్చి, "మహారాజుగారు తమరిని దర్శింపగోరుచు న్నార"నిచెప్పెను. ఈయాహ్వానమునందు కొంటిని. అప్పటికి సభచా లింపబడినది. బ్రాహ్మణులు సంభావనతీసికొని ఇండ్లకు వెళ్ళిపోయిరి. అందులోనొక శాస్త్రి, "సాధారణముగా ఈయూరిలో శూద్రునివద్ద దానములు గైకొనుట యనగానే ఒడలు గరిపొడుచును. కానిసీదాన ములు మేమతి సంతుష్టితో గ్రహించితిమి" అనెను.

మరునాడా రాజబంధువు వచ్చి తనతో నన్ను కాశికి ఆవలియొ డ్డుననున్న రామనగరమునకు గొనిపోయెను. అప్పుడు రాజుగారింటివద్ద లేకపోయిరి. ఆరాజబంధువు నాకు రాజుగారి ఐశ్వర్యములు చూపదొ డగెను. గదులన్నియు దుకాణములవలెబొమ్మలతోను, అద్దములతోను, తివాసులతోను, తెరలతోను, మేజాలతోను, కుర్చీలతోను నిండియుం డెను. నేనిటునటు చూచుచు తిరుగుచుండగా రాజుగారి యశస్సునుగా

నము చేయుచు నిద్దరు దాసీలుకనబడిరి. ఆస్వరము లతిమనోహరములుగ నుండెను. ఇది రాజుగారి ఆగమున వార్తయని తెలిసికొంటిని. ఆయన నాకు సాదరముగ స్వాగతమిచ్చి తమసభలోనికి గొనిపోయిరి. వెంటనే అచ్చట నృత్యము, గానము ప్రారంభించిరి. ఆయన నాకొక రత్నపు టుంగరము బహుమానముగా నిచ్చెను. దీనిని నేనతి వినయముతో గ్రహించి ఆయనవద్ద సెలవుతీసికొంటిని. ఆయన, "మిమ్ము దర్శించిఅత్యంతానందము పొందితిని. దశమినాడు తమరు తప్పక 'రామలీల' కు దయచేయవలెను" అనెను. నేనాయనకభివాదముచేసి సూర్యాస్తమయమునకు కాశిచేరితిని.

'రామలీల' దినమున నేను రామనగరముచేరితిని. రాజుగారొక పెద్ద యేనుగునెక్కి హుక్కా పీల్చుచుండెను. ఆయనవెనుక ఇంకొకచిన్న యేనుగ మీదరత్నఖచితమైన హుక్కా గొట్టములతో 'హుక్కా బర్దార్' కూర్చుండెను. ఇంకొకయేనుగుమీద రాజగురువు కాషాయాంబరముల ధరించి మౌనము వహించికూర్చుండెను. నోటినుండి ఎక్కడమాట వచ్చిపోవునో యను భయముతో ఆయనతన నాలుక నొకకర్రకట్టులో బాధించుకొనెను. ఈస్వల్పవిషయములో కూడ తనకే తనయందు నమ్మకములేకుండెను. నాలుగుప్రక్కలను కర్నల్, జనరల్, సైన్యాధ్యక్షులు, ఒక్కొక్కరొక్కొక్క యేనుగునెక్కి రాజును చుట్టియుండిరి. నేనెక్కుటకు కూడ నాకొక యేనుగునిచ్చిరి. మేమందరము కలసి 'రామలీల' రంగభూమికి యాత్రచేసితిమి. అక్కడకువెళ్లి చూచుసరికి ఆస్థలమంతయు జనులతో నిండి ప్రజారణ్యమువలె నుండెను. అది మరియొక కాశివలెనుండెను. అక్కడనొకచో నొక సింహాసనమువలె ఏర్పాటుచేయబడియుండెను. అదంతయు పుష్పములతో నలంకరింపబడియుండెను. దానిపైనొక పందిరియుండెను. ధనుర్బాణములను హస్తములలో ధరించిన బాలుడొకడు ఆసింహాసనముపై కూర్చుం

డబెట్టబడియుండెను. జనులందరును అతనివద్దకు వెళ్లి ప్రణామములు గావించుచుండిరి. ఆసమయమున నతడే అయోధ్యాధిపతియైన రామచంద్రుడట. మరికొంతదూరమున యుద్ధక్షేత్రముండెను. ఒకప్రక్క కొందరు ఒంటెలవలెను మరికొందరు గుఱ్ఱములవలెను, మరికొందరు మేకలవలెను ముఖములకు వేషములు వేసికొని అనేకమంది రాక్షసరూపధారులుండిరి. వారుబారులు తీర్చినిలబడి యేమేమో ఆలోచించుచుండిరి. గుఱ్ఱపుమూతిని ఒంటెచెవిప్రక్కను, ఒంటెమూతి మేకచెవివద్దను—ఈరీతిగా నుంచికొని పరస్పర రహస్యములు చెప్పుకొనుచుండిరి. గొప్ప యుద్ధసన్నాహముజరుగుచుండెను. కొంతసేపయినపిమ్మట వారిమధ్యనొక 'బాంబు' పడెను. అన్నివైపులను బాణసంచాకాల్చ నారంభించిరి. నేనెవ్వరితోను ఏమియు చెప్పకుండ అక్కడనుండిచల్లగా నవతలకు జారితిని.

పిమ్మట కాశివద్దనుండి వింధ్యాచలము దర్శించుచు మిర్జాపురమువరకు నౌకపై పయనమైతిని. అప్పుడావింధ్యాచలక్షుద్ర పర్వతములనుచూచియే నేనుపొందిన ఆనందము, యుత్సాహము ఇంతింతనిచెప్పజాలను. తెల్లవారుఝాముమొదలు మట్టమధ్యాహ్నము వరకు ఎండలో తిరిగితిరిగి, క్షుత్పిపాసలచే పీడింపబడి, పడవకుమరలివచ్చి, కొంచెము పాలుత్రాగి ప్రాణమునిలబెట్టుకొంటిని. వింధ్యాచలమందు యోగమాయ, భోగమాయ, కూడగాంచితిని. యోగమాయకుపదిచేతులుండెను. రాతితో చెక్కబడియుండెను. అక్కడ నొక్క యాత్రికుడైనను ఒక్కప్రాణియైనను కనబడలేదు. కాని భోగమాయమందిరమునకుపోగా కాళీఘట్టమువలె క్రిక్కిరిసియుండెను. నుదుట ఎర్రగంధము బొట్టుపెట్టుకొని, ఎఱ్ఱనిపాగాలు ధరించి జవాపుష్పమాలికలతో నలంకృతులై ఉత్తరహిందూదేశస్థులు మేకలను బలియిచ్చి రక్తమును ప్రవహిం

పజేయుచుండిరి. ఇదినాకద్భుతముగా తోచెను. నేనాగుంపులోనికిత్రో సికొని వెళ్ళి ఆలయము ప్రవేశింపలేక పోతిని. కావునదూరమునుండి చూడగలిగినంత వరకు చూచివచ్చితిని.

పిమ్మట మిర్జాపురమువద్దనుండి స్టీమరెక్కి, ఇంటికి మరలివచ్చితిని. కాశినుండివచ్చునప్పుడు నాతో ఆనందచంద్రుని వెంటబెట్టుకొని "కుమార్ఖాలీ" వరకు వచ్చితిని. అక్కడ నాజమీందారీని చూచికొని కలకత్తాకువచ్చి యిల్లుచేరితిని. కొలదికాలము పిమ్మటనే తక్కిన విద్యార్థులందరుకూడ తిరిగివచ్చి సమాజకార్యమునందు దీక్షవహించిరి. లాలాహాజారిలాల్ కాశీనుండి రిక్తహస్తములతో దూరదూర ప్రదేశములలోనికి మతప్రచారముకొరకు బహిర్గతుడయ్యెను. ఒక్క ఉంగరము మాత్రమతనివద్ద నుండెను. దానిమీద హిందీభాషలో, "ఇదికూడ నిలచియుండదు" అని చెక్కబడియుండెను. ఇట్లు బయలు వెడలి మరల ఎన్నడును అతడు తిరిగి రాలేదు. నేనాతని మరల కలసికొనలేదు.



## పదునెనిమిదవ ప్రకరణము.



వేదములలోని అపరావిద్య కేవలము దేవతలకుచేయవలసిన యాగయజ్ఞములనుగూర్చియే యను నిశ్చయసిద్ధాంతమునందుపనీతుడనైతిని. ఋగ్వేదములోని హోత యజ్ఞమునందు దేవతలను పొగడుచుండును; యజుర్వేదములోని అధ్వర్యుడు యజ్ఞమున దేవతలకు హవిస్సునర్పించును; సామవేదములోని ఉద్గాత యజ్ఞమున దేవతలమహిమను గానముచేయును. వేదములలో మొత్తము 33 గ్గురు దేవతలుగలరు, వారందరిలో అగ్ని, ఇంద్రుడు, మారుతుడు, సూర్యుడు,

ఉష మొదలగువారు ముఖ్యులు. వేదముయొక్క క్రియలన్నిటిలో నగ్నియుండును. అగ్ని లేనిదే దేవతలకు యజ్ఞముచేయుట వలనుపడదు. యజ్ఞములందు అగ్నిదేవత కేవలము సంస్తవనీయుడు మాత్రమే కాడు. అతడు యజ్ఞముయొక్క పురోహితుడు. రాజుయొక్క పురోహితుడు ఎట్లు రాజుకొరకు అభీష్టముసంపాదించునో, అట్లే అగ్నియు యజ్ఞముయొక్క పురోహితుడై హోమము సంపాదించును. ఏయే దేవతలనుద్దేశింపబడి అగ్నియందు హవిస్సు సమర్పింపబడునో ఆయాదేవతలకు దాని నగ్నియే పంచిపెట్టుచుండును. కావున నాతడు పురోహితుడే కాక దేవతలదూతగకూడ నుండును. మరియు హవిస్సును దానముచేసి భక్తులేయే దేవతలవద్దనుండి ఏయేఫలములకు ప్రాప్తులగుదురో వానినన్నింటెనిఅగ్నియొక భాండారమువలెనుండివారివారికిపంచిపెట్టుచుండును! అగ్నిదేవత కార్యములనేకములు. వేదములలో అగ్నిదేవతయొక్క ఏకాధిపత్యమే. ఇంతియెగాక ఈయగ్ని లేనిదే మనగృహకృత్యము లెవ్వియు నెరవేర్చుటకు వలనుపడదుగదా. జాతకర్మ మొదలు అంత్యక్రియలు, శ్రాద్ధకర్మలవరకు అన్ని కార్యములయందు అగ్ని. అగ్నివివాహముయొక్క సాక్షి. శూద్రులకు వేదములయందేయధికారము లేకపోయినను సాక్షిగానుండుటకు అగ్నిమాత్రముండవలెను. దానియందువారు అమంత్రిత హవిస్సునుమాత్రము సమర్పింపవలెను.

మనలో అగ్నిదేవతకింత యాధిపత్యమున్నట్లు పూర్వము నేనెఱుగను. నాబాల్యకాలము నుండియు సాలగ్రామము లేనిదేమాత్రము కార్యము జరుగకూడకపోవుట నెఱుగుదును. వివాహోద్యనుష్టానములందు సాలగ్రామము. పూజాపర్వములయందు సాలగ్రామము. సాలగ్రామము మనగృహదేవత. సర్వత్ర సాలగ్రామమునుచూచి దానిదేవకాధిపత్యమనుకొంటెని. సాలగ్రామమును, కాళీదుర్గపూజలను మానివేసినంతమాత్రమున విగ్రహారాధన పరిత్యజించినట్లే యనుకొంటెని,

కాని అగ్నిర్వాయురింద్ర సూర్యాద్యనేక దేవతావిగ్రహము లున్నట్లు గాంచితిమి. వీనికి చేతులు, కాళ్ళు, శరీరములు మొదలగునవి లేకున్నను అవి మన ఇంద్రియములకు మాత్రము ప్రత్యక్షము. వానిశక్తి నందరు ననుభవించుచుందురు. వీనికిసంతుష్టికలిగింపకున్నచో అతివృష్టి అనావృష్టులచేతను, సూర్యుని ప్రచండ ఉత్తాపముచేతను, వాయువు యొక్క ప్రబల వీవనలవల్లను, తుపానులవల్లను సృష్టినశించునని వైదికులు నమ్ముచుండిరి. వాటి యనుగ్రహముతో జగత్తునకు నిలకడ, వాటి యాగ్రహముతో జగత్తునకు వినాశము. కావున వేదములలో అగ్నిర్వాయురింద్ర సూర్యాదులు ఆరాధ్యదేవతలు. కాళీ, దుర్గ, రాముడు, కృష్ణుడు వీరందరు తంత్రములలోని, పురాణములలోని ఆధునిక దేవతలు. కాని అగ్నిర్వాయురింద్ర సూర్యాదులుమాత్రమే వేదములలోని పురాతనదేవతలు. యాగయజ్ఞముల మహాడంబరమంతయు వీరికొరకే. కావున కర్మకాండను పోషించు వేదముల సహాయమున బ్రహ్మోపాసన ప్రచారము చేయవలెనన్నయాశ ఒక్కసారిగా పరిత్యజింపవలసి వచ్చెను.

ఇక వేదముల పరిత్యజించితిమి. కాని గృహస్థులముగనుండియు సన్యాసులమైతిమి, మాగృహకృత్యములలో నింక అగ్నికి వేదవిహితమగు ఆధిపత్యములేదు. కాని పూర్వకాలపు బ్రహ్మవాది ఋషీశ్వరులు సర్వమును పరిత్యజించి సన్యాసులగుచుండిరి. వారు యాగయజ్ఞములనుత్యజించిన పిమ్మట ఇంట నుండలేకపోయిరి. జ్ఞానవిరోధమైన యజ్ఞముల ఆడంబరము యెడ విరక్తిచెంది ముక్తినన్వేషించుచు ఏకముగా అరణ్యమునకే పోవుచుండిరి. అరణ్యమధ్యమునకు పోయి పుత్రులకన్నను విత్తముకన్నను ప్రియతముడైన బ్రహ్మతో వారచ్చట ఐక్యము చెందుచుండిరి. ఇంద్రియగోచరమైన దేవతల ఉపాసనయందు విరక్తిచెందుచుండిరి. ఉపనిషత్తులు అరణ్యమునకు చెందినవి. అరణ్

ములోనే అవి కల్పింపబడినవి. అరణ్యములోనే అవి ఉపదేశింపబడినవి. అరణ్యములోనే అవి నేర్పబడినవి. వాటిని ఇంటివద్ద పఠించుట సహితము నిషేధింపబడి యున్నది. ఈయుపనిషత్తులు మాచేతిలోనికి ప్రథమముననే వచ్చెను.

కాని ప్రాచీన ఋషులుకూడ అగ్ని, వాయువు మొదలగు ఈ పరిమిత దేవతలకు యాగయజ్ఞములుసల్పి ఆత్మసంతుష్టి పొందలేదు వారిలోకూడ ఈదేవతలెందుండి వచ్చిరని జిజ్ఞాసబయలు వెడలెను. ప్రపంచ రహస్యమునుగూర్చి వారిలో మహాందోళన బయలుదేరెను. వారిట్లనుకొనిరి. "ఈయద్భుతమైనసృష్టి ఎందుండి బయలువెడలినదో ఎవరు సరిగా చెప్పగలరు? ఇవన్నియును ఎక్కడ జన్మించినవో యెవరైన చెప్పిరా? సృష్టి పిమ్మటనే యీదేవతలు జన్మించిరి. అట్టితరి ఎవరి నుండి ఈజగత్తు ఉత్పన్నమైనదో ఎవరికెరుక?" ఋషులు ఎప్పుడు ఈసృష్టియొక్కనిగూఢతత్వము కొంచము తెలిసికొనజాలక పోయిరో, వారెప్పుడు శాంతిహీనులైవిషాదాంధకారములో మూహ్యమానులైరో, అప్పుడు వారు స్తబ్ధులై ఏకాగ్రచిత్తముతో జ్ఞానమయ తపస్సాధన నిరతులైరి. అప్పుడు దేవదేవుడగు పరమదేవత ఏకాగ్రచిత్తులును, స్థిరబుద్ధి యుక్తులును అగు ఋషుల నిర్మలహృదయములలో ఆవిర్భూతమై మనస్సునకును బుద్ధికిని అతీతమైన జ్ఞానజ్యోతిని ప్రసాదించెను. దానితో ఋషీశ్వరులు జ్ఞానతృప్తులును సంతుష్టాంతరంగులునై ఈసృష్టియెందుండి వెలువడినదో, ఎవ్వరీసృష్టి రచననుగావించిరో తెలిసికొనిరి. అప్పుడు వారి యుత్సాహ సహాయమున ఋగ్వేదములోని యీ మంత్రమును వ్యక్తముగావించిరి.

"మృత్యురాశీదమృతం నతర్హిన్ నరాత్ర్యాఅహ్నఆసీత్ ప్రకోతః।
అనీదవాతీం స్వధయాతదేకం తస్మాద్ధాన్యన్నపరః కించనాస్॥"

"సృష్టికిపూర్వము మృత్యువు, అమృతము ఏదియు లేదు. రాత్రి లేదు, పగలు లేదు, విజ్ఞానము సహితము లేదు. తన స్వశక్తివల్లనే జీవించుచు ఈశ్వరుడొక్కడే యుండెను. ఆతడుతప్ప వేరేమియు లేదు. ఈప్రస్తుత ప్రపంచమప్పుడు లేదు."

ఏఋషులు తపోప్రభావముచేతను, ఈశ్వరప్రసాదమువల్లను బ్రహ్మమును తెలిసికొనిరో వారీప్రకారము నుడివిరి.

> "యఆత్మదా బలదాయస్యవిశ్వ ఉపాసతేపశిషం యస్యదేవాః।
> యస్యచ్ఛాయా మృతం యస్యమృత్యుః కస్మైదేవాయహ
> విషావిధామ."

"ఎవ్వని విధానమును విశ్వసంసారము పాసించుచున్నదో, దేవతలు ఎవ్వని విధానమునుపాసించుచున్నారో, ఆయన ఆత్మదాత, బలదాత. అమృతము ఎవ్వనిఛాయయో, మృత్యువుఎవ్వనిఛాయయో అతనికితప్ప ఇంకేదేవతకును మేము హవిస్సుదానము చేయము! అతడు ఈసృష్టినంతయు చేసియున్నాడు. అతనిని మీరెరుగరు. అతడు నీఅంతరమున నివసించి యున్నాడు. అన్యులకిది తెలియదు."

> "నతంవిదాథజాయ మాజజానాన్యత్ యుస్మాకమన్తరం వభువ।
> నీహారేణప్రావృతా జల్ప్యాసుతృపకుభాసాసశ్చరాంతి।"

"అజ్ఞాన నీహారముద్వారా, వృథాజల్పనద్వారా, ఇటునటు తిరుగుచు సర్వదా వాదభేదములలో మునిగి తేలుచు, ఇంద్రియ సుఖములచే సంతుష్టిచెందుచు, యజ్ఞమంత్రములతో అనుశాసింప బడియుండు వారి దెట్లు తెలియగలదు? బ్రహ్మజిజ్ఞాస, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మతత్త్వము—ప్రాచీనఋగ్వేద యజుర్వేదములలోనివియెట్లుఉజ్వల రూపముతో ప్రకాశించుచున్నవో చూడుము. ఉపనిషత్తులలో ఈసకల మహావాక్యములు ప్రాచీన వేదములోనున్నవను విషయము కడు

విచిత్రము. ఈసకల వాక్యములవల్లనే ఉపనిషత్తులకు మహాత్వము. ఉపనిషత్తులలోనున్న, "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ", "ద్వాసుపర్ణా సయుజా సఖాయా" మొదలగు నవన్నియు ఋగ్వేదములోనివి. అందులోనుండి ఉపనిషత్తులు గ్రహించినవి. వేదములలో మిగిలినవన్నియు నశించినను యీసత్యములు మాత్రమెన్నటికినశించవు.

ఈసత్యస్రోతము ముందుకు ప్రవహించుచు ఉపనిషత్తులు ఋషీశ్వరుల జీవితములోనికి ప్లావితమై పవిత్రపరచి ఉన్నతముగావించెను. ఈసత్యమునుండియే వారి జీవితము సంఘటితమయ్యెను. దీనినుండి వారు అమృతాస్వాదము పొంది ముక్తిమార్గము నందగోసరులైరి. ఈ సత్యముల పరిభావనమువల్లనే ముక్తహృదయములతో నిట్లనిరి.

> "వేదాహమేతం పురుషంమహాన్త మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ । త్వమేవవిద్యాతి మృత్యుమేతి నాన్యః పన్థావిద్యతే అయనాయ"॥

"నేనీతిమిరాతీతజ్యోతిర్మయ మహాపురుషుని తెలిసికొంటిని. కేవలము అతనిని తెలిసికొనియే మృత్యువు నతిక్రమించు చున్నారు. తద్భిన్నము మృత్యుప్రాప్తికి అన్యపథము లేదు."

ఇదియే పరావిద్యయనియు, ఈపరావిద్యా విషయము "ఏకమేవాద్వితీయం" బ్రహ్మయే అనియు గ్రహించితిని.



## పంచోవింశతి ప్రకరణము.

వారణాసినుండి ఇంటికి వచ్చుసరికి మా 'కంపెనీ' (Carr, Tagore & Co) శిథిలావస్థలో నుండెను. సొమ్ము కొరకు 'బిల్లులు' వచ్చుచుండెను. కాని వానికి తిరిగి చెల్లించ వలసిన సొమ్ము దొరకుట దుర్లభముగా నుండెను. విశేష ప్రయత్నముతోడను, మిక్కిలి కష్టముతోను ప్రతిదినము సొమ్ము చెల్లింపబడు చుండెను. ఇంకను ఎన్నాళ్లీవిధముగ గడపుట. ఇట్లుండ నొక దినము 30,000 రూపాయల కొక 'బిల్లు' వచ్చెను. సొమ్మింటలేక పోయెను. ఆదినము సంధ్యాసమయమైనది. కాని సొమ్ము చేరలేదు. ఆ 'బిల్లు' తెచ్చిన వాడు కాగితముతీసికొని సొమ్ము లేకయే మరలి పోయెను. అప్పటినుండి మా Carr, Tagore & Co సంభ్రమ మెగిరి పోయెను. కచ్చేరి తలుపులన్నియు మూయబడెను.

1847 వ సంవత్సరము మార్చిలో Carr, Tagore & Co వాణిజ్య వ్యాపార మడుగంటెను. నావయస్సప్పటికి 30 సంవత్సరములు. ముఖ్యోద్యోగియగు D. M. Gordon సలహా ననుసరించి అప్పులవాండ్ర కొకసభ గావింపఁబడెను. కంపెనీ కట్టివేసిన మూడు దినములకు వారందరు మూడవ అంతస్తుపై సమావేశమైరి. Gordon మాఅప్పు ఆస్తిపట్టిక తయారుచేసి సభవారి ముందుంచెను. మాఅప్పు మొత్తము కోటి రూపాయలున్నట్లు తెలియజేయబడెను. మాకురావలసినది 70 లక్షలు. కాబట్టి 30 లక్షలు తగులుబాటున్నవి. సభవారి నుద్దేశించి అతడిట్లనియెను. "కంపెనీ దార్లు వారి స్వంతఆస్తి కూడ నిచ్చుటకు సిద్ధముగా నున్నారు. కంపెనీ కున్న ఆస్తి రాబడులను, జమీందారుల స్వంత సొమ్మును మీయధికారములో నుంచికొని మీ మీ బాకీలను తీర్చికొనుడు. కాని వారికి హక్కు లేనటువంటి 'ట్రస్టు'

'Trust' ఆస్తి కొంతకలదు. దీనినిమాత్రము మీరుముట్టుకొనుటకు వలనుపడదు.

ఈరీతిగా గార్డను సభ వారితో ముచ్చటించుచుండగ నేను గిరీంద్రనాధునితో "మన 'వీలు' ఆస్తిని ముట్టుకొన రాదని అప్పులవాండ్రితో గార్డను చెప్పుచున్నాడు. మన అప్పులు తీర్చుకొనుటకు దీని నమ్ముటకు మనకు హక్కులేక పోయినను ప్రస్తుతము మన బాకీలను తీర్చుటకు దీనిని కూడ ఇచ్చివేయ సంసిద్ధులమై యున్నామని మనము చెప్పవలదా? మన పూర్వులు అప్పులనుండి వెంటనే విముక్తులగుటకు ఏమిచేసిన బాగుండునో ఆపథము నవలంబించుట శ్రేయస్కరము. ఈ ఋణము మన స్వంత ఆస్తితో తీరనియెడల మన 'వీలు' ఆస్తినికూడ అమ్మివేయవలసినదే."

ఆస్తిలోని కొంతభాగము మీద చెయ్యి వెయ్య రాదని వినుటతోడనే అప్పుల వాండ్రు సంతుష్టిని తెలుపుచుండిరి. కాని యిచ్చానుసారముగ ఏవిధమగు నిర్బంధము లేక, కోర్టులో ఏవిధమగు సూత్రము చేతను ఇబ్బంది పెట్టబడకయే వీలు సొత్తు సహా యావదాస్తియు వారి చేతులలో నుంచుటకు సంసిద్ధులై యున్నామన్న సంగతి ఉత్తరక్షణమందే విని వారందరును స్తంభితులైరి. మేమిట్లు చెప్పినతోడనే సహృదయులనేకులు, మహాజనులనేకమంది చక్షువ్వుల నుండి అశ్రువులు కార్చిరి. మాకాసన్నమైన విపత్తును చూచి వారును విషణ్ణులైరి. 'కంపెనీ' యొక్క ఔన్నత్యమునకుగాని పతనమునకుగాని మేము కారకులము కామన్న సంగతియు, మేము నిర్దోషులమనియు వారు గ్రహించిరి. ఈ అల్పవయస్సులోనే ఈ దారుణ విపత్తు మామస్తకములపై పడినది. రేపిందులో నొక్కపైసయైనను మాకు మిగలదు. ఇది తలంచియే వారు దయార్ద్రహృదయులైరి. వారికి నష్టము సంభవించినదని క్రోధము చెందుటకు బదులు వారు దయార్ద్ర హృదయు

లైరి. ఈసమయమందు వారికింత దయ ఎక్కడనుండి వచ్చెను? నాచి రజీవన సఖుడే వారి హృదయములలో దయప్రేరణ చేసెను. మా యావదాస్తియు వారి చేతిలో నుంచితిమి. గాన మాపోషణార్థమై మాకీయాస్తి నుండి సంవత్సరమునకు 25,000 రూపాయల నిచ్చెద మనిరి. ఇట్లు బాకీదార్లకును అప్పులవాండ్రకును ఒకవిధమగు సద్భావముదయించెను. అప్పు విషయమై ఎవ్వరును న్యాయవాదమునకు దిగలేదు. మాఆస్తి నంతయు వారి హస్తములలో నుంచుకొని దానిని సరిచూచుటకు వారిలో ముఖ్యులతో నొక కమిటీ నేర్పరిచిరి. వెయ్యి రూపాయల జీతముతో నొక కార్యదర్శి నియమింపబడెను. అతని క్రింద కొందరు సహాయోద్యోగుల నేర్పరచిరి. "Carr, Tagore & Co in Liquidation" అను పేరుతో వ్యవహారము జరుపుచుండిరి.

మాఆస్తి మీద అప్పువాండ్రు కర్తృత్వము స్థాపించిన పిమ్మట సభముగిసెను. మేమిరువురు సోదరులము ఇంటికి బయలు దేరితిమి. దారిలో గిరీంద్రునితో నిట్లంటిని. "మనము ఇప్పుడొక విశ్వజిత్యజ్ఞము చేసితిమి. మనకున్న దంతయు నిచ్చివేసితిమి." "ఔనౌను. మనకొరకేమియు మనముంచు కొనలేదని అందరు నెఱుగుదురు గాక. 'వారికున్న దంతయు ఇచ్చివేసిరే' యని చెప్పుదురుగాక. "సర్వవేదసంపదా" అని అతడనెను. "జనులట్లనిన మాత్రమేమి ప్రయోజనము? న్యాయసభలు వారి మాటలు వినవు. మన మీద నెవరైన దావాతెచ్చిన యెడల మనకున్న దంతయు నిచ్చి వేసితిమని మనము ప్రమాణము చెయ్యవలెను. లేనిచో న్యాయశాసనము మనలను వదలదు. కాని మనకొక గుడ్డపీలిక యున్నను మనము రాజద్వారమున నిలబడి మనకున్న దంతయు నిచ్చితిమని మనము ప్రమాణము చెయ్యజాలముగదా! మనకున్న దంతయు మాత్రమిచ్చి వేయవచ్చునుగాని ఇట్లు ప్రమాణము చెయ్యరాదు. పరమేశ్వరుడు మన

ధర్మమును మనలను రక్షించునుగాక. దివాలా కోర్టులో నెప్పుడు మనము తలయొగ్గ కుందుముగాక" ఇట్లు సంభాషించుచు నిల్లు చేరితిమి.

నేనేమి కోరితినో అదే జరిగినది. మాఆస్తి అంతయు మాచేతిలో నుండి తప్పిపోయెను. నామనసులో ప్రపంచాభిలాష లేకుండెను. అట్లే ప్రపంచ వస్తువులు నాకింకేమియు లేకుండెను. రెండింటికిని సరిపోయెను.

"ఆయభిలాషలో మెఱుపు కొరకే కాని వేరెందుకు ప్రార్థన లేకుండుగాక. అప్పుడు విద్యుత్తు వచ్చి నాధనధాన్యములను తగలబెట్టినచో ఆశ్చర్య మేమియు లేదు."

నేనిట్లు మెఱపు కొరకు ప్రార్థించుచుండగా మెఱుపు వచ్చి సర్వమును తగల బెట్టెను. ఆశ్చర్యమే మున్నది? నేనన్న దేమనగా, "హే ఈశ్వరా! నీవుతప్ప నాకేమియు నక్కర లేదు." ఆయన ప్రసన్నుడై నాప్రార్థన నంగీకరించెను. అంగీకరించి నాకు సాక్షాత్కారమై నావద్ద మిగిలియున్న వన్నియు పీకివేసెను. "గ్రుక్కెడు మంచి నీళ్ళు త్రాగుటకు, మహేశ్వరా, నావద్ద నొక్కపైస పంచదారమైనను లేదు." నాప్రార్థన పూర్ణమై ఈ కార్యములో పరిణమించినది.

నాడా స్మశానవాటిక యందున్న దినమే దినము. మరల ఈ దిన మటువంటిది. నేనింకొక సోపానమెక్కితిని. నానౌకర్ల దళము తగ్గించితిని. నాగుఱ్ఱములను, బండ్లను అన్నిటిని వేలమునకు బంపితిని. నాభోజనము, దుస్తులు తగిన రీతిని తగ్గించితిని. ఇల్లువిడువకుండ సన్యాసినైతిని. మరుసటి దినమేమి భుజింతును, ఏమి ధరింతును అని ఇంక ఆలోచించుట లేదు; రేపు ఇంటి వద్ద నుందునో, ఇల్లు విడుతునో గూడ ఆలోచింపను. ఒక్కసారిగా నిష్కాముడనైతిని. నిష్కామ పురుషునకెట్టి సుఖమును, శాంతియు ఉండునో ఉపనిషత్తులలో చదివి

యుంటిని. ఇప్పుడు వానిని నాజీవితములో భోగించుచుంటిని. రాహువునుండి విముక్తమైన చంద్రునివలె నాయాత్మ ప్రపంచమునుండి విముక్తమై బ్రహ్మలోకము ననుభవించెను. హే ఈశ్వరా ! అతుల ఐశ్వర్యముమధ్య నాయాత్మ నిన్ను పొందకయుండి విలపించుచుండెను. ఇప్పుడు నిన్ను పొందితిని; గాన సర్వమును పొందితిని.

ఈదినములలో ఉదయము మొదలు రెండు జాముల వరకు గభీర దర్శన శాస్త్రచింతనలో నిమగ్నుడనై యుండువాడను. మధ్యాహ్నము మొదలు సాయంత్రము వరకు వేదములు, వేదాంతము, మహాభారతము మొదలగు శాస్త్రముల ఆలోచన యందును, ఋగ్వేదమును బంగాళి లోనికి భాషాంతరీకరించుట యందును నియుక్తుడ నగుచుంటిని. సాయంకాలము 'డాబా' మీద నొక ప్రశస్తమైన కంబళిపై కూర్చుందును. అచ్చట బ్రహ్మజిజ్ఞాసువులగు బ్రాహ్మలు, ధర్మజిజ్ఞాసువులగు సాధులు నావద్దకు వచ్చి కూర్చుండి నానాశాస్త్రాలోచనలు సలుపుచుండిరి. ఈ యాలోచనలతో నొక్కొక్కప్పుడు రాత్రి రెండు జాములు కూడ దాటుచుండెను. ఈ రోజులలో 'తత్వబోధిని' పత్రికా వ్యాసములు కూడ సరిచూచుచుంటిని.

మా 'కంపెనీ' పతనము చెందిన పూడు నాలుగు మాసములలో గిరీంద్రుడు నాతో నిట్లనియెను: "ఇంతకాలమైనది. ఋణము కొంచమైన తీర్పబడుటయే లేదు. దొరలు కూర్చుండి జీతములు మాత్రము తినుచుండిరి. ఈవిధముగా అప్పులు తీరునని ఆశపడరాదు. ఇదే విధముగ వ్యవహారము నడచుచుండినచో మన యిండ్లు వాకిళ్ళు అమ్ముకొనినను ఋణవిముక్తులము కానేరము. కాబట్టి వ్యవహారము మనచేతిలో నుంచినచో మన ప్రయత్నములతోను, అల్పవ్యయములతోను అనతికాలములోనే బదుళ్లు తీర్చెదమని సంఘముతో చెప్పవలెననుకొనుచున్నాను." నాకిది చిక్కులచిక్కని ఆలోచనగా

తోచెను. కొలది కాలము పిమ్మటనే అప్పుల వాండ్రి సభలో ఈ సంగతి తెలియ బరచితిమి. వారు దీనికి విశ్వాసచిత్తములతోను, ఆహ్లాదపూర్వకముగను సమ్మతించిరి. అటుపిమ్మట కార్యభారము మేమే స్వీకరించి 'కంపెనీ' కచ్చేరి మాయింటికి మార్చితిమి. ఒక ఆంగ్లమేనేజరును ఒక గుమాస్తాను నియమించితిమి. Carr, Tagore & Co యను గాలిపడగ దారమును మా గృహాగోపురము నుండియే చుట్ట నారంభించితిమి. తుదవరకు చుట్ట గలుగుదుమో, మధ్యదారిలో నది తెగి పోవునో యని మాత్రిను సంశయ ముండెను.



## ఇరువదియవ ప్రకరణము.



వారణాసికి పంపబడిన నలుగురు విద్యార్థులలో నానందచంద్రుడు నాతోకలకత్తాకు మరలి వచ్చెను. అప్పటికతడు కఠ, ప్రశ్న, ముండక, ఛాందోగ్య, తలవకార, శ్వేతాశ్వతర, వాజసనేయోపనిషత్తులను, బృహదారణ్యకోపనిషత్తులో నొకభాగమును చదివెను. వేదాంగములలో నిరుక్తము, ఛందము, సటీకసూత్రిభాష్యమును, వేదాంతపరిభాష, వేదాంతసారము, అధికరణమాలా, సిద్ధాంతలేష, పంచదశి, సటీకాగీతాభాష్యము చదివెను. కర్మమీమాంసలో తత్వకౌముది చదివెను. తక్కినముగ్గురిలోను ఋగ్వేదవిద్యార్థియగు రామనాథభట్టాచార్యుడు ఋగ్వేదసంహితలోని ఏడవఅష్టకము మూడవప్రికరణమువరకు, తద్వ్యాఖ్యానములోనిప్రిథమాష్టకములో ఆరవఅధ్యాయమువరకును ముగించెను. యజుర్వేద విద్యార్థియగు వాణీశ్వరభట్టాచార్యుడు మధ్యందిన సంహితలో 3 ప్రికరణములు, తైత్తిరీయ సంహితలో రెండవ అధ్యాయము వరకును, కణ్వభాష్య ప్రిథమభాగము

లోని 13 ప్రకరణములను, ద్వితీయభాగములోని 25 ప్రకరణములను నేర్చికొనెను. సామవేద విద్యార్థియగు తారానాగభట్టాచార్యుడు సామవేదములో వేయగానములో 36 సామములును, అరణ్యగానము లో నాల్గవ ప్రపాదకమును, ఉహగానములో ఏడవ ప్రపాదకమును, ఉత్తరభాష్యములో ఆరవ భాగములోని 3 వసూక్తభాష్యమును, కర్మ మీమాంసమును, వేదాంతములో శాస్త్రదీపికయొక్క జాతిఖండన మును చదివెను. ఈనలుగురిలోను ఆనందచంద్రుడే శాస్త్రపండితుడని యును,శ్రద్ధావంతుడనియును, నిష్ఠావంతుడనియుచూచి, వేదాంతవాగీశు డని అతనికి బిరుదమునిచ్చి అతనికి బ్రాహ్మసమాజ ఉపాచార్యపదవిని చ్చితిని.

వేదాలోచనవలన పురాతన ఋషీశ్వరులు పూజచేసినది కేవల ము ప్రకృతియందున్న, సూర్య, చంద్ర, అగ్నిర్వాయువులుకావని గ్ర హించితిని. వారు ఏకేశ్వరునే అగ్నిర్వాయు రిత్యాదిరూపముల బహు ప్రకారములుగా నుపాసించుచుండిరి. కావుననే ఋగ్వేదములోని ట్లుండెను:

"ఏకంసద్విప్రా బహుధావదంత్యగ్నిం యమం మాతరి శ్వాన మాహుః" ॥

"అతడొక్కడే కాని ఋషులు వేరువేరుగా అగ్నియనియు, వాయువనియు, యముడనియు బహుప్రకారములపిలుచుచుందురు." అట్లేయజుర్వేదములో "ఏషఉహ్యేవ సర్వే దేవతాః"—'దేవతలందరు నులతడే' యని ఉండెను.

ఈవేదమునందు దృష్టిఉంచియే నాఋుగ్వేదభాషాంతరీకరణ ముయొక్క భూమికలో నిట్లని వ్రాసితిని. "సూర్యుని అంతర్యామి యెవ్వడో అతడే సూర్యదేవత. అగ్ని యొక్క అంతర్యామి ఏపురు షుడో అతడే అగ్నిహోత్రుడు." దీనిని బట్టి వైదికులు సూర్యాది

బాహ్యజడస్వరూపము నుపాసింతురని కాదు అర్థము. వాని అంతర్యామియై ఏచైతన్య పురుషుడున్నాడో, అతని నే యుపాసింతురని. పురాణములలోను, తంత్రములలోను ఉండు దేవతలకును, వేదములలో ని దేవతలకును మిక్కిలి భేదమున్నది. కాని జన సామాన్యము ఈ భేదము నెఱుగరు. కాళి దుర్గపూజలు వేదములో విధింపబడి యున్నవని వీరి విశ్వాసము. ఈభ్రమల నన్నింటిని తొలగింప వలెనన్న అభిప్రాయముతోను, మన పూర్వకాలపు ఆచార వ్యవహారములయొక్క క్రమాభివ్యక్తిని తెలిసికొనుటకును ఒక కాశీపండితుని సహాయముచే ఋగ్వేదములను భాషాంతరీకరింప సమకట్టితిని. ఋగ్వేదముల మూలములోని మొదటి సగముభాగము సభచే సంపాదింపబడినది. ఇక భాష్యములన్ననో, మాభాషాంతరీకరణమునకు సరిపడినన్ని సంపాదించితిమి. కాని వేదములను భాషాంతరీకరించుట బ్రహ్మాండమైన పని. సంహితలోనే పదివేల శ్లోకములను మించి యుండెను. ఎప్పటికైన సమాప్తి చెయ్యగలుగుదునాయని బెంగ పట్టుకొనెను. ఐనను నాకు సాధ్యమైనంత భాషాంతరీకరించి ' తత్వబోధినీ ' పత్రికయందు ప్రకటించుచుంటిని.

ఇది వరకు బ్రాహ్మసమాజ ఉపాసనావిధానములో నీరెండు సూత్రములు మాత్రముండెను:—

" సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ "
" ఆనందరూప మమృతం యద్విభాతి. "

ఇవి అసంపూర్ణముగా నుండెను. " శాంతం శివమద్వైతం " అని చేర్చుటచే నదిపూర్తిగావింపబడెను. ప్రథమమున సమాజోపాసనాప్రణాళి వ్రాసిన మూడు సంవత్సరముల పిమ్మట 1848 వ సంవత్సరములో నిది చేర్చితిని.

ఎవడు మనఆత్మ కధినాథుడో, సర్వదా మన ఆత్మలో జ్ఞానధర్మములను ప్రేరేపించుచుండునో అతడే "సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ". అతనిని మనయాత్మలో కనుగొందుము. అసీమ ఆకాశస్థిత జగత్తుయొక్క శోభాసౌందర్యములమధ్య నీ "సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ" ను సందర్శించితిమేని అతడు ఆనంద రూపమునను అమృత రూపమునను ప్రకాశము పొందుచున్నాడని కనుగొందుము. "సబాహ్యాభ్యంతరోహ్యజః". ఆజన్మ విహీనమైన పరమాత్మ బాహ్యమునందును ఉన్నాడు, అంతరమునందును ఉన్నాడు. మరియు నతడు "అనంతర మవాహ్యం", "నిత్యమే వాత్మసంస్థం." అతడు అంతరమునందును బాహ్యమునందును ఉండుటేగాక తన యందు తానై నివసించు చున్నాడు. అతని మంగళేచ్ఛను సర్వదా ఎఱిగి యున్నాడు. జ్ఞానమునందును, ప్రేమమంగళములందును అందరును జౌన్నత్యము చెందుదురుగాక. ఆయన "శాంతం, శివం, అద్వైతం."

ఈశ్వరాన్వేషకులు బ్రహ్మను మూడు స్థలములందు తెలిసికొనవలయును. అంతరంగ మందును, బాహ్యమందును, అతడు స్వయంభూతుడైయుండు ఆ బ్రహ్మస్థానమునందును. అతనిని అంతరమునందు సందర్శించినప్పుడు, "నీవు అంతరతర అంతరతముడవు. నీవు నాబంధువు. నీవు నాసఖుడవు" అందు ము. అతనిని మనబాహ్యమున దర్శించినప్పుడు, "అసీమ ఆకాశమునందే నీరాజసింహాసనము," అందుము. అతనిలోనే అతనినిమనము గాంచినప్పుడు, తన స్వీయధామమునందే పరమసత్యమును గాంచినప్పుడు, "నీవు శివం, అద్వైతం; నీవు శాంతభావముతో నీమంగళయిచ్ఛ నిత్యము నెఱుంగుచున్నాడవు" అందుము.

వీటినన్నిటినిగుఱించియు ఏకక్షణమున తలపోయలేము. ఒకప్పుడతడు మన అంతరమునందున్నట్లు తలంచుచుందుము. ఒకప్పుడాతడు బాహ్యమునందున్నట్లు తలపోయుదుము. మరియొకప్పుడతనియందే నివసించునట్లు భావించుచుందుము. కాని ఒకే సమయమునందా యవాతప్రాశితనిత్య జాగ్రిత పురుషుడు తనలో తాను శాంతభావముతో అవస్థితుడై తన మంగళయిచ్ఛ నిత్యము నెఱుంగుచున్నాడు. మన అంతరమున జ్ఞానధర్మప్రేరణ గావించుచున్నాడు. మరియు బాహ్యజగత్తునందు జీవుల కవసరమైన వస్తుసముదాయమును విధించుచున్నాడు. " యుగ యుగమునుండియు ఏకోవశుడై యున్నాడు. " ఎవనిస్తుతించుటయందు శ్రుతి, స్మృతి, దర్శనము అవసన్న మయినవో అతని అపారమహిమావర్ణన నెవ్వరు చేయగలరు? ఏయోగి ఈతనిత్రిత్వమును ఏకక్షణమందు దర్శింపగలుగునో— తనలో తాను నివసించుచు మన యెల్లర హృదయములలో నివసించుచున్నాడనియు, తనలో తాను నివసించుచు అందరి బాహ్యమునను నివసించుచున్నాడనియు, తనలో తాను నివసించుచు తనమంగళయిచ్ఛ నిత్యము నెఱుంగుచున్నాడనియు,—అతడే నిజమైన యోగి యని ఈశ్వర ప్రసాదము వల్ల నాకు విశ్వాసము జనించెను. అతని ప్రేమనుపొంది అట్టివాడు తన ప్రాణము, మనస్సు, ప్రీతి, భక్తి, సర్వము నాతని కర్పించి అపరాజితచిత్తముతో ఆయన శాసనములను వహించుచు నాయన ప్రియకార్యసాధన చేయుచుండును. అతడే బ్రహ్మోపాసకులలో శ్రేష్ఠుడు.



## ఇరువదియొకటవ ప్రకరణము.



1848వ సంవత్సర ఆశ్వయుజమాసము నందిరోజులలోనే కొందరు స్నేహితులను వెంటబెట్టుకొని దామోదరనదిమీద విహారార్థమై బయలువెడలితిని. వారముదినములు దానివంపులన్నిటిమీదను తిరిగి తిరిగి పిమ్మట ఒకసాయంకాలము నాలుగుగంటలకు మాపడవనొక ఇసుకతిప్పవద్ద కట్టిపెట్టితిమి. వర్థమాన్ (Burdwan) అచ్చటికి సమీపములోనే నాలుగుమైళ్ళలో నున్నట్లు తెలిసినది. దానిని చూడవలెనని నాకు వెంటనే కుతూహలము జనించెను. నేను తక్షణమే నౌకదిగి యిసుకలో రెండుక్రోసులు కాళ్ళు ఈడ్చుకొనుచు బర్ద్వానుకు పోతిని. రాజనారాయణ బోసు, మఱియొకరిద్దరు కూడ నాతో నుండిరి. మేము పట్టణసమీపమును చేరుసరికి ప్రతిగృహమునందును దుకాణమునందును దీపములు వెలిగించిరి. మేము ఇటునటు తిరిగి, పట్టణము, బజారు, రాజమందిరము చూచితిమి. క్రొవ్వువత్తిదీపములు పెట్టబడియున్న ఒకగదిలో రాజుగారు కూర్చుండి యున్నట్లు నాకు బయటనుండి కాన్పించెను. మాకుతూహలము పూర్ణమైనపిమ్మట ఆయిసుకతిప్పలోనుండి మాపడవవద్దకు తిరిగివచ్చితిమి. అప్పటికి రాత్రిచాల ప్రొద్దుపోయెను. బహుశః రాజనారాయణబాబిదివరకెన్నడు నంత దూరము నడచియుండలేదేమో. మాతో నడువలేకపోయెను. బహుప్రయాసమీదట పడవచేరి అందు పరుండెను. పిమ్మట నతనికి జ్వరముతగిలెను.

నేను మరునాడు తెల్లవారుజామున తరుణసూర్యరశ్మిచే ప్రకాశించుచున్న ఆ దామోదరనదీపుణ్యస్రోతమునందు స్నానమాచరించి నీలవర్ణపు పట్టుబట్టలను ధరించి, నియమిత ఉపాసన గావించు

కొని పవిత్రుడనైతిని. ఇంతలో హఠాత్తుగా నలుదిక్కుల ధూళి నెగర గొట్టుచు నాయిసుకలోనుండి యొక సుందరమైన ఫీటన్‌బండి వచ్చుచుండెను. ఒంటెలుమాత్రము నడువదగిన ఆమార్గమున బండినడచుటకు వీలగునా? గుఱ్ఱములు పరుగెత్తుటకు సాధ్యమగునా? ఇటువంటి ప్రదేశమునుండి అది యెచ్చటికిపోవునో నాకు తెలియలేదు. ఇంతలో నాబండి మాపడవకెదురుగ నాగెను. బండిలోనుండి యొకడు దిగి నన్ను సందర్శింప నిచ్ఛగించెను. నేనాతని పిలచి, ఏమికావలెనని యడిగితిని. అతడు చేతులుజోడించి, "వర్థమాన్ రాజాధిరాజావారు మిమ్ములను కలసికొనవలెనని ఎంతయు గోరుచు ఈబండిని పంపియున్నారు. తమరు అనుగ్రహించి ఆయన యిచ్ఛ నెరవేర్పుడు" అనెను. "నేను నదీప్రవాహము, వనము, పర్వతములను చూచుటకు మాత్రమేవచ్చితిని. నేనిక్కడ రాజావారిని చూడజాలను. నేను నదిమీదనే వచ్చి, నదిమీదనే తిరిగిపోదలచితిని. నేనింక భూమిమీదికి రాజాల"నని యాతనితో చెప్పితిని. "తమరిని నాతో తీసికొనిపోకుండినయెడల మహారాజుగారియెడల నేను మహాపరాధినగుదును. నాయందనుగ్రహముంచి యొక్కమారు రాజుగారికి దర్శనమిందు. మీయెడల నాయనకుగల అనురాగము చూచినచో మీరవశ్యము పరితృప్తులగుదురు. నేను మిమ్ములను కొనిపోకుండ తిరిగివెళ్ళను" అనెను. ఇట్లు నన్ను చాలవరకు బ్రతిమాలుకొనగా చివరకు నేనాహ్వానమును స్వీకరించితిని. నేను భోజనముచేసి మధ్యాహ్నము రెండుజాములు దాటిన పిమ్మట బయలుదేరితిని. బర్ద్వాను చేరుసరికి సాయంకాలమయ్యెను.

సమస్తోపకరణసమన్వితమగు నొక వాసస్థానము నాకొరకు నిర్ధారితమై యుండెను. అచ్చటరాజవరేణ్యుని ప్రధానామాత్యవరులు—గోవిందబెనర్జి, కీర్తిఘటర్జి మొదలగువారందరు నాచెంత హాజరై యుండిరి. నేనేమిచేయుచున్నానో, యేమిమాట్లాడుచున్నానో, ప్రతి

ముహూర్తము మహారాజుగారికి వర్తమానము చేయుటకు నావాస స్థానమునుండి రాజమందిరమువరకు అంచీలమీద మనుజులుంచబడిరి. మరునా డుదయము నావద్దకు మూడునాలుగు బండ్లమీద బియ్యము, పప్పు, గోధుమపిండి, సగ్గుబియ్యము మొదలగు భోజనసామాగ్రిలు నాబసకు వచ్చియుండెను. ఇంతసామానేల పంపబడెనని అచటనున్న వారి నడిగితిని. రాజగురువున కేర్పాటుచేయుబడిన పద్ధతిని మీకును మహారాజుగారు పంపిరని వారుచెప్పిరి. మధ్యాహ్నము నాబసవద్ద కొక జోడుగుఱ్ఱముల బండి వచ్చి నిలబడియుండెను. నేను బండిలో నెక్కి రాజమందిరమునకు వెళ్ళితిని. రాజును కలసికొంటిని. ఆయన నాకత్యంతాదరముతో స్వాగతమిచ్చెను. అతడప్పుడొక బంతియాట (Billiards) నాడుచుండెను. నేనును ఆయాటవేడుక చూచుచుంటిని. ఆయన నన్నొక యున్నతాసనముపై కూర్చుండబెట్టెను. ఆతనినమ్రత, వినయము, అనురాగము చూడ ఆయనయెడల నాకును అనురాగము బయలుదేరెను.

ఈప్రకారముగా ఆయన నాతో సమ్మిళితమయ్యెను. క్రమ ముగా నతనికి బ్రాహ్మధర్మమునందుత్సాహము అభివృద్ధిచెందుచుండె ను. నాప్రేరణవల్ల ఆయన రాజమందిరములో నొక బ్రాహ్మసమా జము స్థాపించెను. ఈబ్రాహ్మసమాజములో నుపాసన సలుపుటకును, రాజుగారికి బ్రాహ్మధర్మము నందుపదేశము నిచ్చుటకును శ్యామచర ణభట్టాచార్యుని, తారకనాథభట్టాచార్యుని ఆయనవద్దకు పంపితిని. అటుపిమ్మట నేను తరుచు బర్ద్వానుకు వెళ్ళి యాతనియుత్సాహము పురికొల్పుచు, నాతనితో ధర్మాలోచన సలుపుచుండువాడను. ఆయ నయు నన్నుజూచి అత్యంత సంతుష్టిచెందుచుండెను. నేనాతని జన్మో త్సవమునకు వెళ్ళినను వనభోజనమునకు వెళ్ళినను, మరియేయితర సం దర్భములలో వెళ్ళినను, నాతోకలసి ఆయన బ్రహ్మోపాసన గావిం

చుచుండెడివాడు. అతనిహృదయమునందు భక్తియు శ్రద్ధయు కూడ నుండెను.

ఒకరాత్రి బ్రహ్మోపాసనా సమయమునందాయన ఈరీతిగా ప్రశంసించెను. "నేనెంతకృతఘ్నుడను. నాకీశ్వరుడింత సంపదనిచ్చి యున్నాడు. అందుల కాతనియెడల నేను యథోచిత కృతజ్ఞత జూపుటలేదు. నేనాతని స్మరించుటలేదు. కాని ఎందరెందరు దీనదరిద్రులు ఆతనివద్ద బహుస్వల్పమునుపొందియునాయన యెడల నెంతకృతజ్ఞులై ఆతని పూజించుచున్నారు. నేనెంతకృతఘ్నుడను! ఎంత అధముడను!" అని యీమాటలతో నతడు కన్నీరు కార్చనారంభించెను. ఒకనాడుఆయన నన్నుతన అంతఃపురాంతర్భాగములలోనికితీసికొనిపోయెను. అచ్చట నొక పుష్కరిణియుండెను. దానిని నాకు జూపి, "మేమిచ్చటకూర్చుండి చేపలపట్టుదుము"అనెను. పిమ్మట నన్ను మేడమీదికిగొనిపోయెను. జల్తారు మస్లిందు పరుపబడిన యొకగదియుండెను. అది వివాహగృహమువలె అలంకరింపబడియుండెను. అదిచూపి, 'మేమిక్కడ కూర్చుందుము' అనెను. ఇంకొకగదిలోనికి గొనిపోయి, "ఇచ్చటనుండి నేను 'బిలియర్డ్సు' ఆడుచుండ రాణి నన్ను చూచుచుండును" అని చెప్పెను. అంతఃపురములో నేను కనివినియుండినదానినిబట్టి రాజురాణియెడల నెంతప్రీతితో నుండెనో రాణియు రాజుయెడలగూడ నంతప్రీతితోనే యుండినట్లు తోచెను. "సంతుష్టో భార్యయాభర్తా భర్త్రా భార్యాతథైవచ."

రాజు నాతో నొకనాడు, "నాకొకకోరికయున్నది. మీరు దానిని తీర్పవలెను" అనెను. ఏమడుగునోగదాయనుకొని, చెప్పుమంటిని." "మీరొకసారి దయచేసి కొంచము శ్రమతీసుకొని కూర్చుండవలెను. తమపటము చిత్రింపించవలెనని యున్నది," అనెను. నేర్పరియగు నొక ఆంగ్లచిత్రలేఖకు డప్పుడాతనియింటికి వచ్చెను. ఆతడు

నాపతము వ్రాసెను. నేనప్పుడు కూర్చుండినట్లు వ్రాయబడిన ఆపత మిప్పటికి నాతనిగదిలో నున్నది. రాజామహతాబ్ చంద్రుడు స్వర్గస్థుడాయెను. అతనికుమారుడు అబ్ తాబ్ చంద్రుడును అల్పవయస్సునందే ఇహలోకజీవనము చాలించెను. కాని యాతని బ్రాహ్మసమాజముమాత్రమింకను యున్నది. నేటికి నొక ఉపాచార్యుడు నియమిత కాలములందు బ్రహ్మనామమునచ్చట ధ్వనింపచేయుచుండును; గాని వినువారుమాత్ర మెవ్వరును లేరు. ఆశూన్యసమాజగృహముయొక్క అధిష్టాతృదేవతమాత్రమే దానిదీపము.

కలకత్తాలో నొకనాడు నేను బండిదిగి షికారు వెళ్లుచుండ మార్గమునందు నాకొకయుత్తర మియ్యబడెను. తెరచిచూడగా నది కృష్ణనగరాధిపుడగు రాజా శిరీష్ చంద్రునివద్దనుండి యని తెలిసికొంటిని. "పురమందిరమున రేపు సాయంకాలము అయిదుగంటలకు నన్ను కలసికొనగలుగుదురేని అమితానందము నొందువాడను," అని వ్రాసెను. మరునాడయిదుగంటలకు నేను పురమందిరమునకు పోతిని. ఆయన కొరకపేక్షించుచుంటిని. మరికొంచెముసేపునకు రాజువచ్చి దర్శనమిచ్చెను. పరస్పరసమ్మేళనముతో విశేషానందము నొందితిమి. అక్కడ నాతో నాయన కేవలము ధర్మాలోచనయే గావించెను. వెళ్ళునప్పుడతడు నాతో, "ఇక్కడ కొలది నిమిషములుమాత్రమే మీతో మాట్లాడగలుగుటచే నామనసున కెంతమాత్రము సంతుష్టి గాలేదు. నేనింకను కలకత్తాలో మూడునాలుగు దినములుండెదను. ఈలోగా ఎప్పుడైన నొకసాయంకాలము నాబసకు దయచేసి సంభాషింపగలిగినచో మిక్కిలి సంతసింపగలవాడను," అనెను. నలుగురిలో నన్ను కలసికొనుట ఆతనికి కొంచము సంకోచముగా నుండెను. నేను బ్రాహ్మసమాజనేతను; అతడన్ననో నవద్వీపాధిపతి; విగ్రహారాధకులప్రభువు.

ఇదియే మాప్రథమసమావేశము. ఈయన తనంతతానే నాతోవచ్చి పరిచయము చేసికొనెను. కృష్ణనగరములో నొక బ్రాహ్మసమాజము స్థాపించి నేనచ్చటికి తరుచు పోవుచుంటిని. లోకులద్వారా సంగతి వినుచుండుటవల్లను, నాయుపన్యాసములు చదివియుండుటవల్లను నాతో మాట్లాడవలెనని ఆయన కుతూహలపడెను. అతని సందర్శించుటకొరకు సాయంకాలము నేనాతనిబసకు వెళ్ళితిని. నన్నతడు తనమేడమీదికి తీసికొనివెళ్లెను. అచ్చట నింకెవ్వరును లేరు. అచ్చట నొక దీపమైనను లేదు. వెంటనే యాతడు క్రిందకూర్చుండెను. నేనును అట్లే చేసితిని. ఇద్దరము ఫకీర్లవలె నిర్విచారముగా నుంటిమి. అతడు "ఏకో దేవః సర్వభూతేషుగూఢః। సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా। కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ" అనెను.

అతని అమాయకత్వము సరళభావము చూచి ఆయనయెడల నాకు విశేష సద్భావము జనియించెను. మేము ఏకహృదయులమైపోతిమి. నేనాతని వీడ్కొనిపోవునపుడు, "ఇంకొకసారి మీరు కృష్ణనగరమునకు వచ్చినపుడు మాయింట నొకరాత్రి యుండవలెను. ఉండెదరుగదా!" అనెను. "అంతకన్న ఆహ్లాదము, సౌభాగ్యము ఇంకేమియుండును. నన్ను మీరెప్పుడుపిలచిన అప్పుడు వచ్చెదను" అంటిని.

పిమ్మట నేనొకసారి కృష్ణనగరమునకు పోయినప్పుడు నన్నతడాహ్వానము చేసెను. సంధ్యాసమయమున నేనారాజభవనమునకు బోతిని. నన్ను నిభృతమగు, సుందరమగు ఒక గదిలోనికి గొనిపోయి కూర్చుండబెట్టెను. అతనికుమారుడగు సతీశ్చంద్రుడు తక్క వేరెవ్వరును అచ్చట లేరు. మమ్మానందపెట్టుటకొరకాతడొక కృతి పాడి వినిపించెను. రాత్రి రెండుజాములవరకును ఆసంగీతము జరుగుచునే

యుండెను. భోజనమువద్ద నాకు అరువదిరకముల పదార్థములు వడ్డింపబడెను. నేనాయనభవనమునందే నిద్రించితిని. ఇంకను చాలప్రొద్దుండగనే రాజే స్వయముగవచ్చి నన్నులేపి అతని పూజాగృహము నాకు జూపి ప్రభాతవేళ నన్ను సాగనంపెను.

ఆకాలమునందీరీతిగ ధర్మసంబంధమున నీయిరువురు రాజులతో బంధింపబడి యుంటిని. వీరిరువురిలో నొకరు నన్ను బాహాటముగా స్వీకరించెను. రెండవవారు మిక్కిలి గోప్యముగ నయినను విశేషఆంతర్యముతో స్వీకరించెను.



## ఇరువదిరెండవ ప్రకరణము.



అన్నియు పదునొకండు ఉపనిషత్తులు కలవనియు, వానిభాష్యములు శంకరాచార్యులువారు వ్రాసిరనియు పూర్వము నేనభిప్రాయపడితిని. శంకరాచార్యులు భాష్యము వ్రాయని యుపనిషత్తు లనేకములు గలవని యిప్పుడు తెలిసికొంటిని. అన్వేషింపగా 147 ఉపనిషత్తులున్నట్లు తేలెను. శంకరాచార్యులు భాష్యము వ్రాసిన ఆప్రాచీనోపనిషత్తులే యన్నిటిలో ప్రామాణ్యములు. వానిలోనే బ్రహ్మజ్ఞాన బ్రహ్మోపాసనలగూర్చియు, ముక్తిసోపానములనుగూర్చియు బోధింపబడియుండెను. సకల శాస్త్రములలో ఈయుపనిషత్తులు వేదముయొక్క శిరోభాగములు, సర్వశ్రేష్ఠములుగను పరిగణింపబడినప్పుడు వైష్ణవశైవ సాంప్రదాయకులు ఉపనిషత్తుల పేరుపెట్టి గ్రంథప్రచారము చేయ నారంభించిరి. ఆగ్రంథముతో పరమాత్మకు మారు వారివారి దేవతల యుపాసనప్రచారము చేయ నారంభించిరి. అప్పుడే గోపాలతాపనీ ఉపనిషత్తు వ్రాయబడెను. దానిలోపరమేశ్వరుని స్థానమున

శ్రీకృష్ణుడు పరబ్రహ్మయని వ్రాసిరి. గోపీచందనోపనిషత్తు అని ఇం కొకటి ఉండెను. అందులో తిలక మేరీతిగా చెయ్యబడెనో చెప్పబడి యుండెను. ఈరీతిగా వైష్ణవులు తమ దేవతయొక్క మహిమను ఘోషించుచుండిరి. అదేరీతిగా స్కంధోపనిషత్తు అను మరియొక గ్రంథము నందు శైవులు శివుని మహిమ సాటించిరి. సుందరతపనీ ఉపనిషత్తు, దేవీ ఉపనిషత్తు, కౌలోపనిషత్తు మొదలగు మరికొన్ని కూడ ఉండెను. వానిలో కేవలము శక్తిమహిమాప్రచారము చేయజొచ్చిరి. అక్బరు కాలములో హిందువులను మహమ్మదీయులలో కలుపుటకుగాను మరియొక ఉపనిషత్తును వ్రాసి అల్లోపనిషత్తని పేరుపెట్టిరి.

ఎంతవింత! ఈయుపనిషత్తుల కంటకారణ్యమునే నిదివరలో ఎఱుగను. పదునొకండు ఉపనిషత్తులు మాత్రమే నేనెఱుగుదును. వీని సహాయమువల్ల బ్రాహ్మధర్మ ప్రచారము చేయనారంభించితిని. ఈ యుపనిషత్తులనే బ్రాహ్మధర్మమునకు పునాదిగాచేసితిని. కాని యీ పునాదికూడ ఇసుకవలయదు, శిథిలము అనియు, ఇచ్చటకూడ గట్టినేల లేదనియు ఇప్పుడు కనుగొంటిని. మొట్టమొదట వేదములచెంత చేరితిని. కాని బ్రాహ్మధర్మపు పునాది నచట స్థాపన చేయలేకపోతిని. పిమ్మట ప్రమాణములగు ఏకాదశ ఉపనిషత్తులవద్దకు వచ్చితిని. కాని అదియేమి దురదృష్టమో కాని అచటకూడ పునాది నిర్మింపలేకపోతిని. ఈశ్వరునకును మనకును ఉపాస్యఉపాసకుల సంబంధము అనునదియే బ్రాహ్మధర్మముయొక్క ప్రాణము. శంకరాచార్యుని వేదాంతదర్శనముయొక్క శారీరక మీమాంసలో దీనివిపరీతసిద్ధాంతముచూచినప్పటి నుండియు వానిలో నింక నమ్మకముంచ లేకపోతిమి. మాధర్మపోషణమునకు దాని నంగీకరించ లేకపోతిమి. వేదాంతదర్శనమును విసర్జించి ఏకాదశ ఉపనిషత్తులనుమాత్ర మంగీకరించినచో బ్రాహ్మధర్మమునకు పోషణ బడయవచ్చునని కనుగొంటిని. కావున తక్కినవన్నియు వదలి

వేసి కేవలము ఆఉపనిషత్తులమీదనే ఆధారపడితిని. కాని "సోహం అస్మి", "తత్వమసి" మొదలగునవి గాంచినపుడు ఉపనిషత్తులయందు కూడ నిరాశ చెందితిని.

ఈయుపనిషత్తులు కూడ మాయభావములను దూరవు చేయలేకపోయెను; మాహృదయములను పూర్ణము గావింప లేకపోయెను. ఇంక ఏమి చేయవలెను? మాకింక ఉపాయమేమి? ఇక బ్రాహ్మధర్మమునకు ఎక్కడ ఆశ్రియమివ్వగలము? వేదములను ఉపనిషత్తులను దానిపునాదులుగ చేయవీలులేదు. ఇకదాని పునాదులు నిర్మించు టెక్కడ?

చూచితిని. ఇంక ఆత్మప్రత్యయ సిద్ధజ్ఞానోజ్వలితవిశుద్ధహృదయమే దాని పునాదిస్థానమని కనుగొంటిని. పవిత్రహృదయమునందే బ్రహ్మముయొక్క అధిష్ఠానము. హృదయముతో ఉపనిషత్తు లెక్కడ మిళితము చెందునో అట్టి ఉపనిషద్వాక్యములమాత్రము గ్రహింపగలిగితిమి. హృదయముతో ఏదిఐక్యము చెందకుండెనో ఆవాక్యములను మేము గ్రహింపజాలకుంటిమి. సకల శాస్త్రములలో శ్రేష్ఠములగు ఉపనిషత్తులకును మాకునుగల ప్రస్తుతసంబంధమిదియే. "నిష్పాపప్రశాంత హృదయముయొక్క విరుద్ధభావమునందు ఈశ్వరుడు అభిప్రకాశితుడగును," * అని యుపనిషత్తులలోనే యున్నది. పవిత్రవంతుల ఆత్మకు ఈశ్వరజ్ఞానము ప్రసాదింపబడుచుండును. పూర్వము ధ్యానయోగమువల్లను జ్ఞానప్రసాదమువల్లను తమశుద్ధహృదయములలో బ్రహ్మము నాదర్శించిన ఋషీశ్వరునిచే పరీక్షితమైన విషయమిదియే. "జ్ఞానప్రసాదేనవిశుద్ధసత్వస్తతస్తుతం పశ్యతే నిష్కలంధ్యాయమానః"

ఈపదములు నాస్వానుభవముతో మిళితము చెందెను. కావున వాని నంగీకరించితిని.

---

* హృదామనీషా మనసాభి క్లప్తః॥

ఎవరు తమ స్వగ్రామములలోనుండి యాగయజ్ఞాదికర్మకాండ ముల ననుష్ఠించెదరో వారు మరణానంతరమున ధూమ ప్రపంచమును చేరుదురనియు, ధూమమునుండి రాత్రిలోనికి, రాత్రినుండి కృష్ణపక్ష మునకును, కృష్ణపక్షమునుండి దక్షిణాయనమాసములకును, దక్షిణా యనమాసములనుండి పితృలోకమునకును, పితృలోకమునుండి ఆకాశ మునకును, ఆకాశమునుండి చంద్రలోకమునకును వెళ్ళుదురనియు, ఆచంద్రలోకమునందు స్వీయపుణ్యఫలము లనుభవించిన పిమ్మట ఈ ప్రపంచములో పునర్జన్మము నొందు నిమిత్తము చంద్రమండలమునుండి ఆకాశములోనికి పడుదురనియు, ఆకాశమునుండి వాయువులోనికి, వా యువునుండి ధూమమై, ధూమమునుండి ఆవిరియై, ఆవిరినుండి మేఘమై మేఘమునుండి వర్షితులై వారిచ్చట గోధుమలుగను, జొన్నలుగను, ఓషధులుగను, వనస్పతులుగను, తిలలుగను, కాయధాన్యములుగను, బయలుదేరుదురనియు ఉపనిషత్తులలో చదివితిని. ఆగోధుమలు మొదలగు వానిని ఎవరెవరు భక్షింతురో ఆయా స్త్రీపురుషులనుండి వారిక్కడ జీవులై జన్మగ్రహణము నొందుదురట. ఈవాక్యములన్నియునాకు అయోగ్యకల్పనలుగా తోచెను: అందువల్ల వీనిని నేనంగీకరింపలేకపో తిని. ఇట్టి భావములు సహజముగా నాహృదయముయొక్క అనువాద ములుకావు.

కాని ఉపనిషత్తులలోని యీక్రింది మహావాక్యముతో సంపూ ర్ణరూపముగా నాహృదయము ఐక్యము చెందెను. "ఆచార్యకులోద్వేద మాధీత్యయథావిధానంగురోః కర్మాతిశేషేణాభిసమావృత్య కుటుం బే శుచౌదేశే స్వాధ్యాయమధీయానో ధార్మికాన్విదధత్ అత్మాని సర్వేన్ద్రియాణి సంప్రతిష్ఠాప్యాహింసక్ సర్వభూతాన్యన్యత్ర తీర్థే భ్యఃసఖల్వేవంవర్తయన్ యావదాయుషం బ్రహ్మలోకమభిసంపద్య తేనచ పునరావర్తంతేనచ పునరావర్తంతే"--సీగురునివాసమువద్ద వేద

ములు అధ్యయనముచేసి గురుశుశ్రూష యొనర్చినపిమ్మట ఇంటికిపోయి వివాహానంతరమున నొకపవిత్ర స్థానమునందు వేదాధ్యయనము గావింపుము. నీశిష్యులకును, ధార్మికపుత్రులకును జ్ఞానోపదేశము చేయుము. నీఆత్మయందు ఇంద్రియములను ప్రతిష్ఠితముచేసికొని ఏప్రాణికిని నీవు పీడాదాయకుడవుగాకుండి న్యాయార్జితమైన విత్తముద్వారా నీజీవనము పోషించుకొనుము. ఈవిధముగా ఇహలోకమునందు యావజ్జీవము నుగడపినవాడు మరణానంతరమున బ్రహ్మలోకము ప్రవేశించును. మరెన్నడును ఇహలోకమునకు ప్రత్యాగమనము గావింపడు—

ఏవ్యక్తి ఇహలోకమందు ఈశ్వరాదిష్టధర్మానుష్ఠానముచే ఆత్మనుపవిత్రముచేసికొనునో ఆవ్యక్తి ఈపృథివినివదలినవెంటనే పుణ్యలోకము నకరిగి పశుభావమును పరిత్యజించి దివ్యశరీరమును ధరించును. ఆ పుణ్యలోకమునందు ఈశ్వరుని జాజ్వల్యతరమహిమను చూచి, జ్ఞానమునందును, ప్రేమయందును, ధర్మమునందును ఔన్నత్యముగాంచి ఇంకను ఉన్నతతరలోకమునకు గొనిపోబడును. ఈప్రకారముగా ఔన్నత్యమునుండి ఔన్నత్యము పొందుచు, పుణ్యలోకమునుండి పుణ్యలోకమునకు పోవుచు, అసంఖ్యాకస్వర్గములనుండి స్వర్గలోకములకు పోవుచుండును. "ఏషదేవ పథో పుణ్యాపథః" ఈప్రపంచమునకు ఇకతిరిగి రాకుండును. స్వర్గలోకమునందు పశుభావములేదు. క్షుత్పిపాసలులేవు. స్త్రీల యెడలను ధనము యెడలను కాంక్షలేదు. కామములేదు. క్రోధములేదు. లోభములేదు. అచ్చట చిరజీవము, చిరయౌవనము ఉండును. ఈరూపముగా స్వర్గమునుండి స్వర్గమునకు జ్ఞానముయొక్కయు, ప్రేమయొక్కయు, మంగళముయొక్కయు ప్రవాహములు ప్రవహించి ఆదివ్యాత్మను అనంతౌన్నత్యాభిముఖముగా కొనిపోయి అతనిహృదయమునుండి ఆనందోత్సవమును సర్వదాయుత్సారితము గావించుచుండును.

కఠోపనిషత్తునందలి యొకఉపాఖ్యానములో మృత్యువుతో నచికేతుడు స్వర్గమును గురించి ఈరీతిగ వర్ణించెను. "స్వర్గేలోకేనభయం కించనాస్తి నతత్రత్వం నజరయావిభేతి ఉభేతీర్త్వా అశనాయాపిపాసే శోకాతిగోమోదతేసర్వలోకే". "స్వర్గమునందు ఏమియుభయములేదు. మృత్యువా, నీవచ్చుటలేవు. వృద్ధాప్యముకూడ అచటలేదు. క్షుత్పిపాసలనుండి యుత్తీర్ణమై శోకము నతిక్రమించి ఆదివ్యాత్మ స్వర్గలోకమునందు ఆనందము నందుండును."

ఈప్రపంచమందు పాపానుష్ఠానము గావించిన పాపుల గతియేమి? ఇక్కడ పాపములుచేసి ఆచేసిన పాపములకు పశ్చాత్తాపము నొందనివాడు దానిలోనుండి నివృత్తి చెందక పునఃపునః పాపాచరణమే గావించుచుండి మరణానంతరమున పాపలోకమే చేరును.

"పుణ్యేన పుణ్యంలోకన్నయతి పాపేన పాపం". పుణ్యముద్వారా పుణ్యలోకమునకును పాపము నుద్వారా పాపలోకమునకును దిగుదును.

ఇది వేదవాక్యము. పాపముయొక్క తారతమ్యము ననుసరించి తదుపయుక్తమైన పాపలోకమునకు పోయి, ఆపాపియొక్క ఆత్మ పాపాశ్రితదేహము ధరించి, అక్కడ ననేకకుటిలపాపముల అనుతాపాగ్నియందు దగ్ధము గావింపబడి, అప్పుడుతన పాపసమూహమంతయు భస్మీభూతమై, తనప్రాయశ్చిత్త మవసానమై దాని ప్రసాదమును పొందును. అటుపిమ్మట తానీపృథివియందు సంపాదించిన పుణ్యమునకు ఆపుణ్యబలమువల్ల దానికనుగుణ్యమగు పుణ్యలోకముచేరి అక్కడ పశుభావమునకు వ్యతిరేకమైన దేవశరీరధారణ గావించి పుణ్యఫలమనుభవించును. ఎంతవరకు జ్ఞానము, ధర్మము, పుణ్యము సంపాదింపగలుగునో తదనుసారముగ నింకను ఉన్నతలోకములను చెందును.

ఆదివ్యపథముయొక్క, పుణ్యపథముయొక్క యాత్రికుడై అగణ్య స్వర్గ లోకములనుండి స్వర్గలోకములకు ఉన్నతిచెందు చుండును. ఈశ్వరప్రసాదమువల్ల ఆత్మ ఉన్నతశీలమగును. పాపతాపముల నతిక్రమించి ఆ యున్నతశీలాత్మకు ఔన్నత్యములభించును. పృధివిలోకింకనతడు అధఃపతనము జెందడు. ఈశ్వరుని మంగళరాజ్యమునందు పాపమెప్పుడు జయము పొందదు. ఆత్మయొక్క ప్రథమజననము మానవశరీరమందు. మరణానంతరమున తనపాపపుణ్యముల ఫలభోగమునిమిత్తము ఉపయుక్తశరీరధారణ గావించి లోకలోకాంతరములందు సంచారము చేయుచుండును. ఇచ్చటకుమాత్రము తనకుపునరాగమనముండదు.

బ్రహ్మోపాసనయొక్క ఫలము నిర్వాణముక్తియని ఉపనిషత్తులలో నే గాంచినపుడు నాయాత్మ భయముచెందెను. "కర్మాణివిజ్ఞానమయశ్చ ఆత్మాపరేవ్యయే సర్వఏకీభవంతి ". సకలకర్మలు, విజ్ఞానమయాత్మ, అవ్యయబ్రహ్మ, సకలము ఏకమగును." విజ్ఞానమయాత్మకు ప్రత్యేకసంజ్ఞ ఉండదని దీనిఅర్థమైనచో అదిముక్తియొక్క లక్షణముగాదు. భయానకప్రళయముయొక్క లక్షణము. బ్రాహ్మధర్మమునందలి ఆత్మయొక్క అనంతౌన్నత్యమెక్కడ! ఈనిర్వాణముక్తియెక్కడ! ఉపనిషత్తులలోని యీనిర్వాణముక్తికి నాహృదయమునందు స్థానముదొరకలేదు. ఈవిజ్ఞానమయాత్మ ఉన్నతస్వర్గమునందుండునుగాక, లేక అధఃపృధివియందుండుగాక! ఎప్పుడు తనసమస్త విషయవాంఛల పరిసమాప్తినిచెంది అంతర్యామియైన పరమాత్మను పొందవలెనన్న కోరిక ఒక్కటే మాత్రము హృదయమునందు జ్వలించుచుండునో, ఎప్పుడు ఆశారహితమై ఈశ్వరసాంగత్యము మాత్రము కోరుచుండి నిరంతరము ఈశ్వరాజ్ఞలు శిరసావహించుచుండి, సహిష్ణుతకలిగి ఈశ్వరాధిష్ట ధర్మకార్యముల సాధనచేయుచుండునో, అప్పుడు ఆదేహబంధనలనుండి విముక్తిచెంది, సంసారపారావారమునుండి ఉత్తీ

ర్ణమై, అంతరతమామృతబ్రహ్మము యొక్క తిమిరాతీతజ్ఞానోజ్జ్వల ప్రేమసిక్తక్రోడమునందు నివాసముగాంచును. అక్కడ నూతనప్రాణమునొంది, పవిత్రమై, ఆయనకృపవల్లజ్ఞానమునందును, ప్రేమయందును, ఆనందమునందును, ఆఅనంతజ్ఞానప్రేమానందములతో ఛాయాతపములవలె నిత్యయుక్తమై యుండును. ఆదినమున కింక అవసానముండదు. "సకృద్విభాత్యేవైష బ్రహ్మలోకః" ఇదియేదానిపరమగతి. ఇదియేదాని పరమసంపద. ఇదియేదాని పరమలోకము. ఇదియే దాని పరమానందము. "ఏషాస్య పరమాగతి రేషాస్య పరమా సంపదే షాస్యపరమోలోక ఏషోస్యపరమానందః"

వేదముయొక్క ఈమహావాక్యముతో జ్ఞానము తృప్తిచెందును. ఆత్మ శాంతిలాభముచెందును. హృదయము ఆనందముతో పరిపూర్ణమై

"బ్రహ్మభయంవై బ్రహ్మభయం"—'బ్రహ్మను పొందుటవలన ఎంతటినిర్భయముగా ననగును'—అని నిరంతరము వచించుచుండును.

"పరిపూర్ణజ్ఞానమయ,
నిత్యనవసత్యతవశుభ్రఆలోకమయ
కబేహ బేవిభాసిత మమచిత్తఆకాశే।
రోయాఛి బొషి దీర్ఘనిశిచాయియాఉదయదిశి।
ఊర్ధ్వముఖేకరపుటే నవసుఖ, నవప్రాణ, నవదివాఆశే।
కిదేఖిబొ, కిజానిబొ, నాజానిషేకిఆనంద।
నూతనఆలోకఅపన్ మనమాయే।
షేఆలోకే మహాసుఖే ఆపన్ఆలయముఖే।
చొలేజాబొగాన్ గాయి, కే రొయిఛే ఆర్ దూరపరవాసే॥

"బ్రహ్మసంగీత్"

—హే! పరిపూర్ణజ్ఞానమయా! నిత్యనూతనమై, శుభ్రజ్యోతిర్మయమైన నీసత్యము నాచిత్తాకాశమందు ఎప్పుడు ప్రకాశితమగును?

ఊర్ధ్వముఖముతో, జోడితహస్తములతో, నవసౌఖ్యము, నవప్రాణము, నవారుణోదయములకొరకు దీర్ఘనిశియంతయు ఉదయదిశ వంక చూచుచు కూర్చుండియున్నాడను. ఏమిచూతునో? ఏమి తెలిసికొందునో? ఆ రానున్న యానందమేదియో తెలియదు.

నాహృదయాంతరాళమున నొకనూతనకాంతి. ఆకాంతి సహాయముతో, అత్యంతానందముతో గీతముల పాడుకొనుచు నింటికి పోవుదును.

దుర్భరమగు పరవాసజీవనము గడపుచునుండ నెవరిచ్ఛగింతురు!—

ఈసమయమునందీ యాశీర్వచనము నాహృదయములో ప్రవేశించెను. "స్వస్తివః పారాయతమసఃపరస్తాత్" ఈయజ్ఞానాంధకారసంసారముయొక్క పరకూలమున బ్రహ్మలోకమునకు పోవుమార్గము నీకు నిర్విఘ్నమగుగాక! ఈఆశీర్వచనము పొంది ఈపృధివిలోనుండి శాశ్వత బ్రహ్మలోకము ననుభవింపగలుగుదును.



## ఇరువదిమూడవ ప్రకరణము.



బ్రాహ్మసమాజికులకందరకు ఏకస్థానమేది? ఇదియే ఇప్పుడు నాఆలోచన. తంత్రము, పురాణము, వేదము, వేదాంతము, ఉపనిషత్తులు, ఇవేవియునుకూడ బ్రాహ్మలకు ఏకస్థానముకాని, బ్రాహ్మధర్మమునకు పునాదిగాని యొసగజాలకపోయెను. బ్రాహ్మధర్మమునకొక బీజమంత్రము (Creed) ఉండవలెననియు ఆబీజమంత్రము బ్రాహ్మలకందరకు ఏకస్థానమగుననియు నిశ్చయించికొంటిని.

ఇట్లు తలంచి ఈశ్వరునకు నాహృదయము వెల్లడిచేసి యిట్లంటిని, "నాహృదయమును నీవు వెలుగొందింపుము." ఆయనకృపచే నాహృదయము తక్షణమే దీప్తమయ్యెను. ఈకాంతిసహాయమున బ్రాహ్మధర్మమునకొక బీజము కాంచగలిగితిని. దానిని వెంటనే నాసమ్ముఖమున పడియున్న ఒక కాగితపుముక్కపై ఒక 'పెన్సిల్'తో లిఖయించి యీకాగితము నొకపెట్టెలో పెట్టి తాళమువేసితిని. అది1848వ సంవత్సరము. నాకప్పుడు 31 వ సంవత్సరము. ఆబ్రాహ్మధర్మబీజము ఈరీతిగా పెట్టెలో పడియుండెను.

పిమ్మట బ్రాహ్ములకొక ధర్మగ్రంధ ముండవలెననుకొంటిని. వెంటనే అక్షయకుమారదత్తుని పిలచి, "నీవు కాగితము కలము తెచ్చి కూర్చుండుము; నేను చెప్పినదంతయు వ్రాయుచుండుము" అని చెప్పితిని. అప్పుడు నేనేకాగ్రచిత్తుడనై నాహృదయమును పూర్తిగ విప్పి యీశ్వరునియెదుట పెట్టితిని. ఆయనప్రసాదమువల్ల నాహృదయమునందుద్భాసితమైన సకలాధ్యాత్మికసత్యముల నుపనిషత్తుల ముఖమునుండి నదీప్రవాహమువలె నేను సహజముగను, సతేజముగ నుచ్చరింపనారంభించితిని. అక్షయకుమారుడు వానిని వెంటనే వ్రాయనారంభించెను. నేను సతేజముగా "బ్రహ్మవాదినో వదంతి—" "బ్రహ్మవాదులు చెప్పుచున్నారు"—అంటిని. బ్రహ్మవాదులు ఏమిచెప్పుచున్నారు? "యతోవాఇమాని భూతానిజాయంతే, యేనజాతానిజీవన్తి యత్ప్రయంత్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ." ఎవ్వనివలన ఈశక్తివిశిష్ట వస్తుసమూహములో ప్రాణి జంగమ జీవజంతువులుత్పన్నమగుచున్నవో, ఉత్పన్నమై ఎవ్వనిద్వారా అవి జీవించుచున్నవో, ఎద్దానిప్రవేశించుచున్నవో ఆయనను విశేషరూపముగ తెలిసికొనుటకు నిచ్ఛగింపుడి. ఆయనయే బ్రహ్మము."

పిమ్మట ఈశ్వరుడు ఆనందస్వరూపుడను సత్యము నాహృద

యమునందావిర్భూతమయ్యెను. అటుపైనిట్లంటిని. "ఆనందాద్ధ్యేవఖ ల్విమానిభూతానిజాయన్తే, ఆనందేనజాతానిజీవన్తి ఆనందం ప్రయ న్త్యభిసంవిశన్తి"—నిశ్చయముగా ఆనందస్వరూపుడగు బ్రహ్మవలననే ఈభూతములన్నియు ఉత్పన్నమగుచున్నవి. ఉత్పన్నమయి ఆనందస్వ రూపబ్రహ్మమువల్లనే జీవించుచున్నవి. ప్రళయకాలమున ఆనందస్వ రూపునిగూర్చియే పోయి ఆయనలో ప్రవేశించుచున్నవి—.

ఆదియందు కేవలము జన్మవిహీనమగుఒక్కఆత్మ, ఆపరబ్రహ్మ మాత్రమే ఉండెననియు, వేరేదియు లేదనియు తెలిసికొంటిని. వెంటనే యిట్లంటిని. "ఇదంవా అగ్రేనైవకించిదాసీత్ । సదేవసౌమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్ । సవాఏషమహానజ ఆత్మాజరోఽమరోఽమృ తోఽభయః"—ఈజగత్తునకుపూర్వ మేదియునులేదు. ఓ ప్రియ శిష్యా! ఈజగదుత్పత్తికిపూర్వము అద్వితీయసత్స్వరూపపరబ్రహ్మ మాత్రముండెను. అతడు మహాత్ముడు, జన్మవిహీనుడు, పరమాత్ముడు, జరామరణములు లేనివాడు, నిత్యుడు, భయరహితుడు—. దేశము, కాలము, కార్యము, కారణము, పాపము, పుణ్యము, కర్మఫలము, మొదలగువానినిగూర్చి ఆలోచించి ఈజగత్తునుఆయనసృష్టించెననికను గొంటిని. "సతపోఽతప్యతసతపస్తప్త్వా ఇదగ్ సర్వమ్ సృజతాయదిదంకిం చ."—అతడు విశ్వసృజనవిషయమైఆలోచనచేసెను. ఆలోచించిఈఅన్ని టిని సృష్టిచేసెను—."ఏతస్మాజ్జాయతే ప్రాణోమనః సర్వేన్ద్రియాణిచ, ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీవిశ్వస్యధారిణీ"—వేనిఆధారమునుండి పృథివి ఉత్పన్నమయినదో అట్టిజలము, వాయువు, అగ్ని మొదలయిన వన్నియును; మరియును ప్రాణము, మనస్సు, ఇంద్రియసముదాయము, కేవలసర్వశక్తిమంతుడైన యాపూర్వపురుషుడు తన యిచ్ఛచే సృష్టి చేసెను. ఆయన అనుశాసనమువల్ల సకలములును శాసితములగు చున్నవని కనుగొంటిని.

"భయాదస్యాగ్నిస్తపతిభయాత్తపతిసూర్యః। భయాదింద్రశ్చవాయుశ్చమృత్యుర్ధావతి పంచమః."—ఈపరమేశ్వరుని భయమువలన అగ్నిప్రజ్వలితమగుచున్నది. ఇతని భయమువలన సూర్యుడుత్తాపము నిచ్చుచున్నాడు. మేఘము, వాయువు, మృత్యువు ఆయనభీతివలన సంచారణ గావించుచున్నవి—.

ఈరీతిగా నాహృదయమునందేయే ఉపనిషత్సత్యములు ఆవిర్భావమయ్యెనో వానినన్నిటి నొకదానిపిమ్మట నొకదాని నుచ్చరింపదొడగితిని. "యశ్చాయమస్మిన్నాకాశే తేజోమయోఽమృతమయః పురుషః సర్వానుభూః। యశ్చాయమస్మిన్నాత్మని తేజోమయోఽమృతమయఃపురుషః సర్వానుభూః। తమేవవిదిత్వాతి మృత్యుమేతినాన్యఃపన్థావిద్యతేఽయనాయ."—ఈఅసీమ ఆకాశమునందు ఏతేజోమయామృతమయపురుషుడున్నాడో అతడన్నిటిని తెలిసికొనుచున్నాడు. ఈ ఆత్మయందు ఏతేజోమయామృతమయ పురుషుడున్నాడో అతడు అన్నిటిని తెలిసికొనుచున్నాడు. సాధకులు అతనిని తెలిసికొని మృత్యువునతిక్రమించుచున్నారు. ముక్తిప్రాప్తికి తద్భిన్నము అన్యమార్గము లేదు—.

ఈప్రకారముగా నీశ్వరప్రసాదమువల్ల ఉపనిషత్తుల ముఖమునుండి బ్రాహ్మధర్మపు పునాదిని నాహృదయమునుండి వెలువడజేసితిని. బ్రాహ్మధర్మ గ్రంథము మూడుగంటలలో ముగిసిపోయెను. కాని దాని నర్థముచేసికొనుటకు నియుక్తుడనై తినేని సమస్తజీవితము గడచిపోయినను అది అంతముకాదు. ఈబ్రాహ్మధర్మముయొక్క సకల సత్యవాక్యములయందు నాకు చలింపని విశ్వాసముండుగాక యని ధర్మప్రవర్తకుడైన యీశ్వరునిచెంత వినీతభావముతో ప్రార్థింతును. ఈగ్రంథము నాహృదయముయొక్క ఉచ్ఛ్వాసము; పరిశ్రమవల్ల కలిగిన చెమటబిందువు కాదు. ఈసత్యములను నాహృదయమునందు

ప్రేరణచేసినదెవ్వరు? "ధియోయోనః ప్రచోదయాత్." ధర్మార్థకామమోక్షములయం దెవ్వఁడు మనబుద్ధివృత్తులను పునఃపునః ప్రేరణచేయుచుండునో ఆజాగ్రతజీవంతదేవతయే నాహృదయమునందీ సకలసత్యములను ప్రేరణచేసెను. అవినాదుర్బలబుద్ధి సిద్ధాంతములుకావు. అవి మోహవాక్యములుకావు. ప్రలాపవాక్యములునుకావు. అవినాహృదయమునుండి ఉచ్ఛ్వసితమైన ఈశ్వరప్రేరితసత్యములు. ఎవఁడు సత్యముయొక్క ప్రాణమును సత్యముయొక్క కాంతియునయి ఉన్నాఁడో ఆతనివద్దనుండి వచ్చి ఈసకలజీవంతసత్యములు నాహృదయము నందవతీర్ణములయ్యెను. అప్పుడు నేనాతని పరిచయముపొందితిని. ఎవరాతనిని కోరుదురో వారాతనిని పొందుదురని తెలిసికొంటిని. నేను కేవలమాతనికొరకు ఏకమనస్సుతో వేచియుండుటవల్ల నే ఆతనిపాద ధూళిని పొందగలిగితిని. ఆపాదధూళియే నానేత్రములకు అంజనమయ్యెను.

ఆగ్రంథము వ్రాసినపిమ్మట దానిని షోడశాధ్యాయములుగ విభాగముచేసితిని. ప్రథమాధ్యాయముయొక్క నామము ఆనందాధ్యాయము. ఈవిధముగ బ్రహ్మవిషయకోపనిషత్తు—బ్రాహ్మీ ఉపనిషత్తు—తయారయ్యెను. కాబట్టి బ్రాహ్మధర్మముయొక్క ప్రథమఖండాంతమునందీ విధముగ లిఖింపబడెను.—బ్రాహ్మీభావత ఉపనిషత్ మద్రమేత్యుపనిషత్ —"నీకు ఉపనిషత్తుబోధ చేయబడెను." ఇది బ్రహ్మవిషయిక ఉపనిషత్తు—వేదములను ఉపనిషత్తులను పరిత్యజించితిననియు, వానితో నాకేమియు సంబంధము లేదనియు ఎవ్వఁడును తలవకుండునుగాక. వేదములయందును ఉపనిషత్తులయందును ఉన్న సకలసత్యములతోను బ్రాహ్మధర్మము సంఘటితమయ్యెను. నాహృదయమా సత్యములకు సాక్షియయ్యెను. వేదరూపక కల్పతరువు యొక్క అగ్రశాఖాఫలము యీబ్రాహ్మధర్మము. వేదముయొక్క

శిరోభాగముపనిషత్తులు. ఉపనిషత్తుల శిరోభాగము బ్రాహ్మోపనిష త్తు—బ్రహ్మవిషయికోపనిషత్తు. ఇదియే బ్రాహ్మధర్మ ప్రథమఖండ ములో సన్నివేశితమైయున్నది.

ఈయుపనిషత్తులనుండియే ప్రథమమున నాహృదయములోని ఆధ్యాత్మికభావములకు ప్రతిధ్వనిపొంది, సమగ్రవేదమును, సమస్తో పనిషత్తులును, బ్రాహ్మధర్మమునకు ఆధారములుగాచేయుటకు యత్న ముచేసితినిగాని అట్లుచెయ్యలేక విచారించితిని. కాని నాదుఃఖమనవ సరము. ఎందువల్లననగా, ఏగనియుపూర్తిగ బంగారముతోనిండియుం డదు. గనిలోని అసారప్రస్తర ఖండములన్నిటిని చూర్ణముచేసి వాని లోనుండి స్వర్ణము నిర్గతము గావించి తీసికొనవలయును. ఈగనిలో నిహితమైయుండు సమస్తస్వర్ణమును బహిర్గతిమైనదని చెప్పుటకాదు. వేదోపనిషద్రూపముగ నున్నగనులలో నెన్నిసత్యములో యెన్నిస్థాన ములయందో గభీరరూపముగ నిహితమైయున్నవి. భగవద్భక్తి విశుద్ధ సత్వసత్యకామనీరులు ఎప్పుడు అనుసంధానము చేతురో అప్పుడు ఈశ్వరప్రసాదమువల్ల వారిహృదయముద్వారా నది ఉద్ఘాటితమగును. వారుఆగనులనుండి ఆసకలసత్యములను ఉద్ధరించి తీసికొనగలుగుదురు.

హృదయము ధర్మానుష్టానముచే పవిత్రము చేసికొనినవారు మాత్రమే బ్రహ్మోపాసనాధికారము పొందగలరు. ఆధర్మమెట్టిది ? దానినీతిపది ? ఇదిబ్రాహ్మలెటిగియుండుట నితాంతావశ్యకము. ఆధ ర్మనీతి అనుసారముగా వారిప్రవర్తనలు సవరించుకొనుటయే వారి ని త్యధర్మము కావున బ్రాహ్మలకొరకు ధర్మానుశాసన ముండవలె ను. బ్రహ్మవిషయికోపనిషత్తును చదివి యెట్లు బ్రహ్మను తెలిసికొం దురో అట్లే ధర్మానుశాసనముద్వారా అనుశాసితులై హృదయము ను విశుద్ధముచేసికొందురు. బ్రాహ్మధర్మమున కివిరెండు అంగములు. మొదటిది యుపనిషత్తులు, రెండవది ధర్మానుశాసనము. బ్రాహ్మధ

ర్మప్రథమఖండమునందు ఉపనిషత్తు సమాప్తమయ్యెను. ఇక ద్వితీయ ఖండమునకు అనుశాసనముల నన్వేషింపనారంభించితిని. మహాభారతము, గీత, మనుస్మృతి మొదలగునవి చదువనారంభించితిని. వానిలోనుండి శ్లోకములను సంగ్రహించి అనుశాసనాంగము పుష్టిగావింపనారంభించితిని. ఇందు మనుస్మృతి నాకు విశేషసహాయము గావించెను. ఇందులో వివిధస్మృతులలో శ్లోకములుండెను. ఈఅనుశాసనము లిపిబద్ధము గావించుటకు నేను విస్తారము శ్రమపడితిని. ప్రథమమున దీనిని సప్తదశాధ్యాయములుగ చేసి అందులో నొక అధ్యాయమును వదలివేసి దీనినిగూడ 16 అధ్యాయములుగా విభజించితిని. ప్రథమాధ్యాయములోని ప్రథమశ్లోకములో గృహస్థు ప్రతికార్యమునందును బ్రహ్మముతో సంయోగము కలిగియుండవలెనని ఉపదేశముండెను. "బ్రహ్మనిష్ఠో గృహస్థః స్యాంతత్వజ్ఞాన పరాయణః। యద్యత్కర్మప్రకుర్వీతతద్బ్రహ్మణిసమర్పయేత్." —గృహస్థు బ్రహ్మనిష్ఠుడుగను తత్వజ్ఞానపరాయణుడుగను ఉండవలెను. ఆతనిసర్వకార్యములు పరబ్రహ్మమున కర్పింపుచుండవలెను—. రెండవశ్లోకములో తల్లితండ్రులయెడల పుత్రుల కర్తవ్యము. "మాతరంపితరంచైవ సాక్షాత్ప్రత్యక్షదైవతాం। మత్వాగృహీనిషేవేత సదాసర్వప్రయత్నతః।"—కుమారుడు తల్లిని తండ్రిని సాక్షాత్ ప్రత్యక్షదైవతములుగా చూచి సర్వదా వారికి సేవ చేయుచుండవలెను—.

చిట్టచివరశ్లోకములో కుటుంబములో నుండువారొకరియెడల నొకరేప్రకారము వ్యవహరించవలెనో ఉపదేశింపబడియుండెను. "భ్రాతాజ్యేష్ఠః సమఃపితా్రభార్యాపుత్రః స్వకాతనుః। ఛాయాస్వదాసవర్గశ్చ దుహితాకృపణంపరం। తస్మాదేతైరధిక్షిప్తః సహేతాసంజ్వరఃసదా."—జ్యేష్ఠభ్రాతపితృతుల్యుడు. భార్యాపుత్రులు స్వీయశరీరమువంటివారు. దాసవర్గము తనఛాయాస్వరూపులు. ఇకపుత్రిక అతికృ

పాపాత్రిమైనది. కావున వీరిచే నత్యంత సంతప్తుడవు కాకుండి సర్వ దా సహిష్ణుత నవలంబించుము. ఎల్లప్పుడును క్షమాగుణము కలిగి యుండుము.——. "అతివాదాం స్తితిక్షేత నావమస్యేతకంచన। నచేమం దేహామాశ్రిత్యవైరం కుర్వీత కేనచిత్।"—ఇతరులదూషణవాక్యములను ఓపికతో సహింపుము. ఎవ్వరికిని కోపముకలుగ జేయకుము. ఈమానవ దేహముధరించి ఎవరితోడను శత్రుత్వము చేయకుము——.

ద్వితీయ తృతీయాధ్యాయములు పతీపత్నుల పరస్పరకర్తవ్య ములు, వ్యవహారవిషయములు నుపదేశించును. చతుర్థాధ్యాయమునం దు ధర్మనీతి, పంచమాధ్యాయమునందు సంతుష్టి, షష్టాధ్యాయ మునందు సత్యపాలనము, సత్యవ్యవహారము, సప్తమాధ్యాయమునం దు సాక్ష్యము, అష్టమాధ్యాయమునందు సాధుభావము, నవమాధ్యా యమునందు దానము, దశమాధ్యాయము రిపుదమనము, ఏకాదశా ధ్యాయము ధర్మోపదేశము, ద్వాదశాధ్యాయము పరనింద, త్రియో దశాధ్యాయము ఇంద్రియసంయమము, చతుర్దశాధ్యాయము పరి హారము, పంచాదశాధ్యాయము మనోవాక్కాయ సంయమము, షోడ శాధ్యాయము ధర్మమువెడల శ్రద్ధనుగూర్చియు నుడువును. చివరరెండు శ్లోకములు,"మృతంశరీరముత్సృజ్య కాష్ఠలోష్ఠసమం క్షితౌ। విముఖా బాన్ధవాయాన్తిధర్మస్తమనుగచ్ఛతి॥ తస్మాద్ధర్మంసహాయార్థంనిత్యంసం చినుయాచ్ఛనైః। ధర్మేణహిసహాయేన తమస్తరతి దుస్తరమ్॥"

"మృతశరీరము నొక కొయ్యదుంగవలె భూతలమున వదలి మిత్రులు విముఖులై పోదురు." ధర్మము మాత్రముదానియనుగామిగా నుండును. కావున క్రమ క్రమముగా నీసహాయార్థము ధర్మమును నిత్యము సంపాదించుచుండుము. జీవుడుధర్మముయొక్కసాహాయ్యమున దుస్తరసంసారాంధకారమునుండి ఉత్తీర్ణుడగును.—"ఏషఆదేశ, ఏష ఉపదేశ, ఏతదనుశాసనం। ఏవముపాసితవ్యమేవముపాసితవ్యమ్॥" "ఇ

వియే ఆదేశములు, ఇవియే ఉపదేశములు, ఇవి యేశాస్త్రములు, ఈప్రకారముగా నీవాతని నుపాసింపుము. ఈప్రకారముగా నీవాతని నుపాసింపుము!

సంయతులై, శుచులై, ఈపవిత్రబ్రాహ్మధర్మముచదువువారికిని, వినువారికిని, మరియు బ్రహ్మపరాయణులై తదనుసారముగ ధర్మానుష్టానముచేయువారికిని అనంతఫలము లభించును.



## ఇరువదినాల్గవ ప్రకరణము.



ఈరీతిగా 1848 వ సంవత్సరములో బ్రాహ్మధర్మము గ్రంథరూపమున వెలువడెను. దీనిలో నద్వైతవాదము, అవతారవాదము, మాయావాదము నిరసింపబడెను. పరమాత్మయు, జీవాత్మయు పరస్పరసఖులనియు, సర్వదా కలసియుందురనియు, బ్రాహ్మధర్మగ్రంథములో వ్రాయబడియున్నది. "ద్వాసుపర్ణాసయుజా సఖాయా." దీనిలో నద్వైతవాదము నిరసింపబడినది. బ్రాహ్మధర్మములో "నవభువక" అని ఉండెను.

అతడు మానవుడుకాడు, ఈజడజగత్తుకాదు, తరులతలుకాదు. దీనిలో అవతారవాదము నిరసింపబడెను. బ్రాహ్మధర్మమునందు "సతపోస్తప్యత సతపస్తప్త్వా ఇదంసర్వమసృజత యదిదంకించ"—ఆయన ఆలోచనచేసెను. ఆలోచనచేసి ఈఅన్నిటిని సృష్టిచేసెను—

పూర్ణసత్యమునుండి విశ్వసంసారము నిస్సృతమయ్యెను. ఈ విశ్వసంసారము అపేక్షకసత్యము. దీని స్రష్ట యెవ్వడో అతడు సత్యముయొక్క పూర్ణసత్యము. ఈవిశ్వసంసారము స్వప్నవ్యాపారము కాదు. ఇది మానసికభ్రమకాదు. ఇది వాస్తవికసత్యము. ఏసత్యము

నుండి ఇది వెలువడినదో అతడు పూర్ణసత్యము. ఇది (విశ్వసంసారము) అపేక్షికసత్యము. దీనితో మాయావాదము నిరస్తమయ్యెను.

ఇంతపర్యంతము బ్రాహ్మలకు ఏదియు ధర్మగ్రంథము లేకుండెను. వారిధర్మము, మతము, అభిప్రాయములు నానాగ్రంథములలో విక్షిప్తములై యుండెను. ఇప్పుడవన్నియు ఏకగ్రంథములో సంక్షిప్తమయ్యెను. ఇది అనేక బ్రాహ్మల హృదయము నాకర్షించి పుణ్యసలిలముతో ప్లావితము గావించెను. హృదయములు కలవారి నందరిని ఈబ్రాహ్మధర్మగ్రంథము ఆకర్షించియే తీరును. బ్రాహ్మసమాజఉపాసనా సమయమునందుపూర్వపు వేదపఠనమునకుబదులు ఈ బ్రాహ్మధర్మములో ప్రథమాధ్యాయముచదువుట ప్రారంభింపబడెను. అప్పటినుండి యుఉపాసనాసమయమునందు బ్రాహ్మలు "అసతోమాసద్గమయ" * అను మంత్రమును తీసికొని కొందరు మూలశబ్దములతోను కొందరు దాని భాషాంతరీకరణముతోను ప్రార్థనచేయ నారంభించిరి.

గతవత్సరమునుండియు సమాజగృహముయొక్క మూడవ అంతస్థు నిర్మింప ప్రారంభింపబడెను. ఈసంవత్సరము మాఘ ఏకాదశిలోగా దానిని సిద్ధముచేయుటకు తొందరపెట్టుచుంటిమి. ఇదిబ్రాహ్మసమాజముయొక్క 19 వ సాంవత్సరికోత్సవము. నూతనఅంతస్థునందు కూర్చుండి, ఉదాత్తఅనుదాత్తసర్వముతో నూతన స్వాధ్యాయము పఠింతుము, నూతనస్తోత్రములతో ఆస్తవనీయునకు ఉపాహారమొసంగుదుము; నూతనగీతములను గానముచేతుము. ఈప్రయత్నములందే ఆ

---

* అసతో మాసద్గమయ ।
తమసోమా జ్యోతిర్గమయ ।
మృత్యోర్మా అమృతంగమయ ।
ఆవిరావీర్మ ఏధిరుద్రయత్తే ।
దక్షిణంముఖం తేనమాం పాహినిత్యం ॥,,

సప్తాహము గడచిపోయెను. మాఘ ఏకాదశికి గృహముసిద్ధమయ్యెను. సమాజగృహము నూతన వేషధారణకావించెను—శ్వేతప్రస్తరవేది, సమ్ముఖమున సుసజ్జితగీతమంచె, పూర్వ పశ్చిమములందుకప్రోచ్చ కాష్టాసనములు (Wcoden Gallery)—సకలము నూతనము. సకలము సుందరము. శుభ్రము పలకలగాజుకుప్పె దీపములతో సమస్తము వెలుగొందింపబడెను. సాయంకాలము సమాజమువద్ద మాయింటిలో నుండు వారందరితో సిద్ధమైతిమి. అందరిముఖములయందు నూతనోత్సాహము, నూతనానురాగము; అందరును నానందముతో పూర్ణులు. విష్ణు సంగీతమంచెనుండి "పరిపూర్ణమానందం" అను గీతమునందు కొనెను. పిమ్మట బ్రహ్మోపాసన ప్రారంభమయ్యెను. మేమందరము మిళితమై సమస్వరముతో స్వాధ్యాయము పఠించితిమి. బ్రాహ్మ ధర్మగ్రంథమునుండి శ్లోకములు ఆవృత్తి గావింపబడెను. ఆఖరున "శాంతిశ్శాంతి శ్శాంతిః, హరిః ఓం." అను పదములతో ఉపాసన సమాప్తమయ్యెను.

అందరునుస్తబ్ధులైరి. అప్పుడు నేను వేదికముందు నిలబడి ప్రహృష్టాంతరంగుడనై, భక్తిభరితుడనై ఈస్తోత్రము పఠించితిని. "చతుర్దిశలయందు నీవు వ్యాపింపచేసియున్న సుశోభనదృశ్యమగు యీవిశ్వముద్వారా, అనేకులకు నీవు ఉపలబ్ధము కాకుండినచో దానికి కారణము నీవు మాకెవ్వరికిని దూరముగానుంటివని కాదు. మేము హస్తములతో స్పృశించుచున్న వస్తువులకంటెను కూడ మాసమీపమున నీవు జాజ్వల్యతరుడవై ప్రకాశించుచున్నావు. బాహ్యవస్తుప్రవృత్తమైన మాయింద్రియసముదాయము మమ్ము మహామోహములో ముగ్ధులను గావించి నీనుండి విముఖులను కావించుచున్నది. అంధకారముమధ్య నీజ్యోతి ప్రకాశించుచున్నది. కాని అంధకారము నిన్నెఱుంగగలదా? మసి తిష్టన్ తమసోః అంతరోయం తమో నవేద" నీవెట్లంధకార

మునందున్నావో అట్లే తేజమునందున్నావు. నీవు వాయువునందు న్నావు. శూన్యమునందున్నావు. నీవు మేఘములయందునున్నావు. నీవు పుష్పములయందునున్నావు. నీవు సౌరభమునందునున్నావు. హేజగదీశ్వరా! నీవు సమ్యగ్రూపముగా సర్వత్ర ప్రకాశించుచున్నావు. నీవు నీసకలకార్యములందును దీప్యమానుడవగుచున్నావు. కాని దోషియు నవివేకియునగు మనుజుడు నిన్నొక్కమారైనను స్మరణచేయడు. సకల విశ్వమును నిన్నే వ్యాఖ్యానించుచున్నది. నీపవిత్రనామమును ఉచ్చైస్స్వరముతో పునఃపునః ధ్వనితము చేయుచున్నది. కాని విశ్వనిస్సృత ఏతద్రూప మహానాదము యెడలకూడ మేము బధిరులమైయున్నాము. మా అచేతన స్వభావ మీాప్రకారముగ నున్నది. నీవు మాకుచతుర్దిశలయందునున్నావు. నీవు మాఅంతరమునందున్నావు. కాని మేము మాఅంతరమునుండి దూరముగ భ్రమణముచేయుచున్నాము. స్వీయాత్మలనే మేము దర్శించుటలేదు. మరియు వానిలో నీయనుష్టానము ననుభవించుటలేదు. హేపరమాత్మా! హేజ్యోతీ! అనంతసౌందర్యరాశీ! హేపురాణ, అనాది, అనంత! సర్వజీవులకు జీవనమా! ఎవ్వరు తమ అంతరమునందు నిన్ను అనుసంధానము గావింతురో వారు నిన్ను దర్శనముచేయునిమిత్తము గావించు ప్రయత్నములెన్నడును విఫలములు కావు. కాని అయ్యో! నిన్ను అనుసంధానము కావించువారేరి? ఏసకలవస్తువులు నీవు మాకు ప్రదానము గావించితివో అవి ప్రదాతయొక్కహస్తమును స్మరణకు రానివ్వనంతగా మామనస్సుల నాకృష్టము గావించియున్నవి. విషయభోగములనుండి విరక్తులమై క్షణకాలము నిన్ను ధ్యానించుటకైనను తగునవకాశము మామనస్సులు పొందుట లేదు. మాజీవితముకొరకు నీమీాద నాధారపడియు నిన్ను విస్మృతి చెంది జీవనయాపనము చేయుచున్నాము. హే! జగదీశా! నీజ్ఞానాభావముతో జీవితమెందుకు, జగత్తెందుకు? ఈసంసారములోనుందుసకలనిరర్ధ

కపదార్థములు-అస్థాయియగు పుష్పము, హ్రాసమానమగు స్రోతము, భంగురమగు ప్రాసాదము, క్షయశీలమగు వర్ణచిత్రము, దీప్తమానమగు లోహరాశి మామనస్సులలో ప్రీతితమై మాచిత్తముల నాకర్షించుచుండును. మేము వానిని శుభదాయకవస్తువులనుకొనుచుందుము. కాని అవి మాకు ప్రదానము చేయుచున్న సుఖము నీవే వాని ద్వారా మాకు ప్రదానము చేయుచున్నావను వివేచన మాకులేదు. ఏసౌందర్యమును నీవు సృష్టిపై వర్షింపచేయుచున్నావో ఆసౌందర్యము మాదృష్టినుండి నిన్ను మరుగుచేసినది. నీవు మాయింద్రియములకు గమ్యుడవు కానంతటి పరిశుద్ధుడవు, మహాత్ముడవు. నీవు "సత్యాజ్ఞానమనంతం బ్రహ్మ". నీవు "అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథా సన్నిరత్యమగంధవచ్ఛ" గావునఎవరుపశుతుల్యమైనకృత్యములనాచరించివారిస్వభావమును నికృష్టముచేసికొందురో, వారునిన్ను కాంచనేరరు. అయ్యో! కొందరు నీఅస్తిత్వముయెడలకూడ సందేహము చెందుచుందురు. ఏమి మాదౌర్భాగ్యము! సత్యమును ఛాయయనియు, ఛాయను సత్యమనియు అనుకొనుచుందుము. ఎందుకునుపనికిరానివి మాకుత్కృష్టములవలెతోచును. నిజముగా మాకు సర్వస్వముగ నుండవలసినది మాకెందుకును పనికిరానిదిగ తోచుచున్నది. ఈవృథాశూన్య పదార్థములే అధస్థాయులగు ఈఅథముల మనస్సుల కుపయుక్తములైనవి! హే! పరమాత్మా! నేనేమిచూచుచున్నాను? సకలవస్తువులలోను ప్రకాశమానుడవైన నిన్నేచూచుచున్నాను. ఎవరునిన్నుచూడజాలకున్నారో వారేమియుచూడజాలరు. ఎవరికినీయందు అభిరుచిలేదో వారేవస్తువునందును అభిరుచి గాంచనేరరు. వారిజీవితము స్వప్నప్రాయము, వారి అస్తిత్వమువృథా. ఆహా, నీ జ్ఞానాభావముతో నేయాత్మ సుహృదులులేనిదై, ఆశలేనిదై, విశ్రమస్థానములేనిదై యుండునో ఆయాత్మకెంత యసౌఖ్యము! ఏఆత్మనిన్ననుసంధానముచేసి, నిన్ను పొందునిమి

త్తము వ్యాకులపడుచుండునో నాయాత్మ కెంతసౌఖ్యము! కాని యెవ్వ రికి నీముఖజ్యోతిని నీవు సంపూర్ణరూపముగా ప్రదర్శించుచున్నావో, నీహ స్తమెవ్వని అశ్రుల మోచనచేయుచున్నదో; నీప్రేమచేతను, కరుణచేతను నిన్ను పొంది ఎవ్వడు పూర్ణ కాముడగుచున్నాడో, ఆతడే పూర్ణసుఖి! హా! ఎన్ని దినములు, ఇంకను ఎన్నిదినము లాదినముకొఱకపేక్షింతును! నీసమ్ముఖమున నేనేదినమున పరిపూర్ణానందమయుడనగుదునో గదా! మరియు నానిర్మలవాంఛలనన్నిటిని నీయిచ్ఛతో నెప్పుడైక్యము చేయగలుగుదునోగదా! ఈయాశతో నాయాత్మఆనందస్రోతములో ప్లావితమై, 'హేజగదీశ్వరా! నీకు సమానులిం కెవరున్నారు'అనియనుచున్నది. నిన్ను దర్శించు ఈసమయమున శరీర మవసన్నమగుచున్నది. నీవు నాజీవనమున కీశ్వరుడవు, నాశాశ్వతోపజీవ్యుడవు."

ఈప్రార్థన ఫ్రెంచి బ్రహ్మవాదియగు ఫెనిలన్ మహాత్మ (Fenelon) విరచితము. రాజనారాయణబోసుదీనిని చక్కగా భాషాంతరీకరించెను. దానిమధ్య నేనుపయోగమగు ఉపనిషద్వాక్యముల నమర్చితిని. ఈప్రార్థన చదివినపిమ్మట ననేకమంది బ్రాహ్మలీభావమునందు మగ్నులై అశ్రుపాత మొనర్చుచుండుట నేనుచూచితిని. పూర్వము కేవలము కఠోరజ్ఞానాగ్నిలో మాత్రము బ్రహ్మహోమము జరుగుచుండెను. ఇప్పుడు హృదయముయొక్క ప్రేమపుష్పములతో నతనిపూజ జరుగుచుండెను.



## ఇరువదియైదవ ప్రకరణము.



తత్వబోధినీసభ సంస్థాపించి యిప్పటికి పదిసంవత్సరములైనది. అయినను ఇంకను మాయింటదుర్గపూజ, జగద్ధాత్రిపూజ జరుగుచునే

యుండెను. చిరప్రచలితపూజలు, యుత్సవములు మా భద్రాసనగృహ మునుండి ఎత్తికట్టుట, అందరిమనస్సులకు కష్టము కలుగజేసి అందరిమ తములకు విరుద్ధముగ చేయుట నాకర్తవ్యమని తోచలేదు. నేనుమా త్రము దూరముగనుండి వానిలో నేవిధమైనజోక్యము కలుగజేసికొన కుండుటే మంచిదనుకొంటిని. నాపరివారములో వానిలో భక్తివిశ్వాస ములుండు వారిమనస్సు నొప్పించుట అకర్తవ్యము. మాసోదరుల యాలోచనతోడను అనుమతితోడను నెమ్మదిగాపూజలనాపివేయుటకు ప్రయత్నించితిని.

మాకనిష్ఠభ్రాత నాగేంద్రనాథుడీమధ్యనే ఐరోపా నుండి తిరిగివచ్చెను. అతని ఉదారమనస్సును ప్రశాంతభావమును చూచి, అతడు ప్రతిమాపూజకు విరోధియై నావాదమును సమర్థిం చునని ఆశపడుచుంటిని. కాని యీ ఆశనిరాశయయ్యెను. సమాజబం ధమునకును, బంధుసమ్మేళమునకును, అందరిలో సద్భావము స్థాపించు టకును దుర్గపూజ యొకఉత్కృష్టమైనట్టియు ప్రశస్తమైనట్టియు ఉపా యమనియు, దానిపై హస్తక్షేపముచేయుట ఉచితముకాదనియు, చేసిన చో నందరిమనస్సులు నొచ్చుననియు అతడునుడివెను. నాయుపదేశ మూలమునను అనురోధమూలమునను జగద్ధాత్రిపూజ మాత్రము మానిరి. అప్పటినుండియు జగద్ధాత్రిపూజనుమాయింటనుండి శాశ్వత ముగా తొలగించితిమి. దుర్గపూజమాత్రము జరుగుచునేయుండెను.

నేను బ్రాహ్మధర్మము గ్రహించినసమయము నుండియు ఆరం భించినపద్ధతి——అనగా దుర్గపూజాసమయములోనూరువిడిచి వెళ్లుచుం డుట ఇంకనుముగియలేదు. ఆశ్వయుజమాసము వచ్చినతోడనే ఏటేట నేనెక్కడికో ఒకచోటికి వెళ్లుచుంటిని. ఈసారి 1849 వ సంవత్సర ములో పూజలనుండి దూరమగుటకు అస్సామ్‌కు బహిర్గతుడనైతిని.

'ఢాకా'కు స్టీమరుమీద వెళ్లియుంటిని. అక్కడినుండి 'మేఘ్నా' దాటి బ్రహ్మపుత్రిద్వారా 'గౌహటి' చేరితిని.

స్టీమరు రేవుచేరగానే లంగరువేసెను. కమిషనర్ మొదలగు కొందరు గొప్పవారు దానిని చూచుటకు వచ్చినన్నుకూడ కలసికొనిరి. వారు నాపరిచయము చేసికొని నాతో సంతోషముతో ప్రసంగించిరి. నేను కామాఖ్యాలయమును చూడపోవుదునని వారందరువిని, వారి వారి ఏనుగులనిచ్చెదమని చెప్పసాగిరి. కామాఖ్యాలయమును చూడ వలె ననువ్యగ్రితతో నేను తెల్లవారుజామున నాలుగుగంటలకే లేచి వెళ్లుటకు సిద్ధముగా నుంటిని; కాని ఒడ్డున నాకొరకెవ్వరి యేనుగులు లేవు. కమిషనర్‌దొర యేనుగుమాత్రిము నాకొరకపేక్షించుచుండె ను. అతడొక్కడే అన్నమాట నిలబెట్టుకొనెను. ఇదిచూచి ఆహ్లాదితు డనై యొడ్డుచేరి మావటివానితో నేనుగును వెనుకనుండి తీసికొనిరమ్మ ని చెప్పి పదవ్రిజములో నడువనారంభించితిని. కొలదిదూరము నడచి నపిమ్మట ఏనుగు వెనుకబడుచుండుట కనుగొంటిని. మావటివాడు దాని నొక చిన్నఏరు దాటించుటకు ప్రియత్నించుచుండెను. ఇదిచూచి ఏ నుగుకొరకు కొంతసేపాగితిని. కాని ఆలశ్యము కాజొచ్చెను. మావటి వాడు దీనిని దాటింపలేకపోయెను. నేనిక ఓపికపట్టియుండలేకపోతిని.

పదవ్రిజమున మూడుకోసులు నడచి కామాఖ్యాపర్వతపాద ప్రాంతమునకు చేరితిని. విశ్రాంతి తీసికొనకయే కొండ నెక్కనారం భించితిని. పర్వతపథము ప్రిస్తరనిర్మితము. మార్గమున కిరుప్రిక్కల ను ఘోరారణ్యము. అయరణ్యములోనికి దృష్టిచొచ్చుట కవకాశము లేదు. దారితిన్నగా పైకిఉండెను. ఆనిర్జనారణ్య మార్గమునుబట్టి నే నొంటరిగా కొండ నెక్కసాగితిని. సూర్యోదయమునకింక కొంచము త డవుండెను. కొంచకొంచముగ వర్షము తొలకరించుచుండెను. కాని నేను దానిని లెక్కసేయక క్రిమముగా ఎక్కుచుంటిని. తృతీయభాగ

మెక్కితిని. పాదము లప్పుడు అవశములయ్యెను. ఇంక నాయిచ్ఛాను మతముగ అడుగులు పడకుండెను. విసిగి వేసారి నేనొక ఎత్తైనరాతి మీద కూర్చుంటిని. ఒంటరిగా నట్లాయరణ్యములో కూర్చుండి ఆయాసముచేకల్గిన చెమటచేతను, బాహ్యమున వర్షముచేతను తడిసి నాను చుంటిని. అరణ్యమునుండి వ్యాఘ్రములువచ్చునో భల్లూకములువచ్చునోయని భయము కలుగుచుండెను.

ఇటువంటిసమయములో మావటివాడువచ్చి కనబడెను. "ఏనుగును తీసికొనిరాలేకపోతిని, తమరు ఒంటరిగా వచ్చుచుండుట చూచి సాధ్యమైనంత త్వరలో మీవెనువెంటవచ్చితిని" అని అతడనెను. అప్పటికి నాశరీరమునకు కొంచము బలము వచ్చెను. నాఅంగములు తిరిగి వశమయ్యెను. అతనితో మరల పర్వతము నెక్కనారంభించితిని. పర్వతముమీద నొకవిస్తీర్ణమైన సమభూమియుండెను. దానిపై ననేకగుడిసెలుండెను. కాని అందొక్కమనుష్యుడైన కనబడలేదు. కామాఖ్యామందిరములో ప్రవేశించితిని. అది మందిరముకాదు, పర్వతగహ్వరము. అందులో నేమూర్తియులేదు. ఒక యోనిముద్రమాత్రముండెను. ఇది చూచినపిమ్మట పదపర్యటనముచే పరిశ్రాంతుడనై వెనుకకు వచ్చి బ్రహ్మపుత్రానదిలో స్నానముచేసి ఆయాసమునపనయించితిని. అందలి స్నిగ్ధజలముయొక్క గుణమువల్ల నాశరీరమునకు తిరిగి నూతనశక్తివచ్చెను. పిమ్మట నాలుగైదువందలమంది వరుసగా నదియొడ్డున నిలబడియుండి కోలాహలము చేయుచుకన్పించిరి. మీకేమి కావలెనని నేనడిగితిని. వారు "మేము కామాఖ్యాదేవియొక్క పండాలము. మీరు కామాఖ్యాను చూచివచ్చిరిగాని మాకేమియు దొరకలేదు, దేవీపూజ చాలరాత్రి పర్యంతము చేయవలసియుండెను; అందువల్ల ఉదయముననే లేవలేకపోతిమి" అనిరి. నేను "పొండు, నావద్ద మీకేమియు దొరకదు" అంటిని.

# ఇరువదియాఱవ ప్రకరణము.



మరుసటిసంవత్సరము ఆశ్వయుజమాసమునందు శరత్కాల శోభ ప్రకాశించుచుండెను. తిరిగి నామనస్సులో భ్రమణేచ్ఛ ప్రదీప్తమయ్యెను. ఈసారి సంచారమున కెచటికిపోవుటకును నేను నిశ్చయము చేసికొనలేకపోతిని. జలమార్గమున సంచరించెదనని మాత్రము నిశ్చయించుకొని నౌకనుచూచుటకుగంగాతీరమునకు పోతిని. అందొక పెద్దస్టీమరు కనబడెను. దానిలోని కళాసులు వారివారి కార్యములలో నిమగ్నులైయుండిరి. స్టీమరు త్వరలోనేబయలు దేరునట్లుకన్పట్టెను. ఈస్టీమరు అలహాబాదెప్పటికి చేరునని నేనుప్రశ్నించితిని. ఇక రెండుమూడురోజులలో స్టీమరు సముద్రములోనికి వెళ్ళునని నావికులు చెప్పిరి. ఇదివినినతోడనే సముద్రయానమునందలి యిచ్ఛ పూర్ణము గావించుకొనుట కిదియొక మంచితరుణమని భావించితిని. వెంటనే 'కెప్టను' వద్దకుపోయి నేనందులోనొక గదినద్దెకు తీసికొంటిని. యథాసమయమున ఓడమీద సముద్రయానమునకు బహిర్గతుడనైతిని. ఇంతకుపూర్వము సముద్రనీలజలము నెన్నడును చూచియుండలేదు. తరంగాయితానంత నీలోజ్వలసముద్రమునం దహోరాత్రము విచ్ఛిన్న విచిత్రశోభలను వీక్షించి యనంతపురుషుని మహిమలో నిమగ్నుడనైతిని.

సముద్రమును ప్రవేశించి ఒక్కరాత్రింతయు తరంగములలో నూగియూగి మధ్యాహ్నము మూడుగంటలకు 'స్టీమరు' లంగరువేసెను. మాముందొక తెల్లని యిసుకతిప్ప కనబడెను. దానిపైనొక వసతియున్నట్లు తోచెను. ఆస్థలమును చూచుటకొక పడవమీద పోయి యుంటిని. నేనచ్చట నిటునటు తిరుగుచుండగా మెడలో రక్షరేకులతో కొందరు 'చిటగాంగు' (Chittagong) నివాసులగు బంగాళీలు

నావైపునకు వచ్చిరి. "ఇక్కడకు మీరెట్లువచ్చిరి? ఇచటమీపనియేమి?" అని నేను వారినడిగితిని. "ఇచ్చటమావృత్తివాణిజ్యము. ఈఆశ్వయుజ మాసములో మేము దుర్గవిగ్రహము నొకదానిని తెచ్చితిమి" అని వారుచెప్పిరి. బ్రహ్మరాజ్యము ( Burma ) లోని ఈ ఖాక్ఫూ (Khack-Phu) నగరమున కూడ దుర్గోత్సవముమాట విని నేనాశ్చర్యపడితిని. ఏమి! ఇక్కడకూడ దుర్గోత్సవమేనా?

అచ్చటనుండి 'స్టీమరు'కు మరలివచ్చి 'మోల్మీన్' (Moulmein) వైపునకు పయనమైతిని. సముద్రమువదలి ఓడ 'మోల్మీన్' నదిలోనికి వెళ్ళెను. గంగాసాగరమునుండి గంగానదిలోనికి ప్రవేశించినట్లు తోచెను. కాని యీనదికేమియు శోభలేదు. జలము పంకిలము, నక్రమయము. ఆనదిలోనెవ్వరు స్నానముచెయ్యలేదు. 'మోల్మీన్' చేరగనే ఓడకు లంగరువేసిరి. చెన్నపురి నివాసియగు నొక మొదలియారు నన్నిచటసత్కరించెను. తానేనావద్దకువచ్చి తనవృత్తాంతము చెప్పెను. ఆతడు గవర్నమెంటులో నొకగొప్పయుద్యోగి. చాల పెద్దమనిషి. నన్నతడు తనయింటికి గొనపోయెను. నేను 'మోల్మీన్' లోనున్న కొలదికాలము నాతనియాతిథ్యము స్వీకరించితిని. ఉన్నంతకాలము నేనతిసంతోషముగా గడపితిని. 'మోల్మీన్' నగర వీధులన్నియు పరిశుభ్రములు. ప్రశస్తములు. ఇరుప్రక్కలనుగల యంగళ్ళలో స్త్రీలే నానావిధమైన పణ్యసామగ్రిని అమ్ముచుండిరి. నేను వారివద్ద కొన్ని పెట్టెలను, కొన్ని ప్రశస్తమైన పట్టువస్త్రములను కొంటిని. నేను బజారువెంట నిటునటు చూచుచు నడచుచుండగా నొకచేపల బజారు ప్రవేశించితిని. అచ్చట పెద్దపెద్ద మేజాబల్లలమీద పరవబడి పెద్దచేపలమ్మకమున కుండెను. ఈపెద్దచేపలపేరేమనియడిగితిని. మొసళ్ళని వారుచెప్పిరి. బర్మాదేశస్థులు మొసళ్ళు తిందురు. వారినాలుక చివళ్ళ నహింస (బౌద్ధధర్మము), పొట్టలలో మొసళ్ళు.

ఈ 'మోర్లీస్' యొక్క ప్రశస్తమైన రస్తామీద నొకదినము సంధ్యాసమయమున తిరుగుచుంటిని. అప్పుడు నావద్దకొకడు వచ్చుచుండెను. దగ్గరకువచ్చినకొలదియు ఆతడు బంగాళీయని తెలిసికొంటిని. అప్పుడక్కడ బంగాళీయొకడుండుటచూచి విస్మయపడితిని. ఈ సముద్రముదాటి బంగాళీయెట్లువచ్చెను? బంగాళీలకు అగమ్యస్థానమేదియు లేదు. నీవిక్కడికెందుకు వచ్చితివనియతనినడిగితిని. నేనొకవిపత్తులోపడి యిచటికివచ్చితినని యతడు ప్రత్యుత్తరమిచ్చెను. ఆవిపత్తేమియో నేను వెంటనే గ్రహించితిని. ఎన్నిసంవత్సరముల విపత్తని అడిగితిని. ఏడుసంవత్సరములని యతడు చెప్పెను. నీవేమిచేసియుంటివని అడిగితిని. "మరేమియులేదు. ఒకకంపెనీ కాగితముమీద తప్పు సంతకముచేసితిని. ఉండవలసిన గడువుగడచినది, కాని సొమ్ము లేకపోవుటచే ఇంటికి పోవుటకు వీలుపడలేదు." అనెను. అతని ప్రయాణపు ఖర్చులు నేనివ్వవలెననుకొంటినిగాని అతడెక్కడ యింటికివచ్చును? అక్కడవాణిజ్య వృత్తిలో ప్రవేశించి వివాహమాడి సుఖముగా స్వచ్ఛందముగా నుండెను. ఆనల్లబడిన ముఖముచూపుట కింటికి పోవనేల!

అచ్చట దర్శనీయమైన గుహయొక టున్నదనియు అభిప్రాయమున్నచో తనతో తీసికొనివెళ్ళి చూపించెదననియు మొదలియారు నాతో చెప్పెను. నేనందుకు సమ్మతించితిని. అతడా యమవసనిశి నొక పెద్దడింగీ తీసికొనివచ్చెను. దానిమధ్య నొక బల్లలగదియుండెను. ఆరాత్రి రెండవజాము వేళ నేను, మొదలియారు, 'స్టీమరుకెప్టన్' మరి ఏడెనమండుగురు కలసి ఆనౌకమీద బయలుదేరితిమి. రాత్రియంతయు పడవలో కూర్చుండియుంటిమి. దొరలింగ్లీషుపాటలు పాడనారంభించిరి. నన్నును బంగాళీపాటలు పాడమనిరి. నేనప్పుడు కొన్నిబ్రహ్మగీతములు పాడితినిగాని వారికవేమియు తెలియలేదు. నవ్వనారంభించిరి. వారి

కవి ఎంతమాత్రము ఇష్టముగా లేవు. ఆరాత్రి పండ్రెండుక్రోసులు ప్రయాణమై పోయినపిమ్మట తెల్లవారుజామున నాలుగుగంటలకు మాగమ్యస్థానము చేరితిమి. మాపడవ యొడ్డుచేరెను.

అప్పటికింకను అంతయు నంధకారముగనే యుండెను. తీరము న కనతిదూరముననే తరులతావేష్టితమైన యొకగృహామునుండి కొన్ని దీపములనుండి కాంతివెలువడుచుండెను. నేను కౌతూహలవిశిష్టుడనై ఆయజ్ఞాతస్థానమున, ఆయంధకారమధ్యమున నొంటరిగా నాప్రదేశ మునకు బోతిని. వెళ్ళిచూడగా నదియొక క్షుద్రకుటీరము. దానిలో ముండితమస్తకములతో కొందరుసన్యాసులు పీతాంబరముల ధరించి క్రొవ్వువత్తిదీపముల పట్టుకొని ఒకమారిక్కడ ఒకమారక్కడ నుంచు చుండిరి. ఇక్కడకూడ కాశీలోనుండు 'దండీ' సన్యాసులబోలిన వీరి నిచూచి యాశ్చర్యపడితిని. ఇక్కడకు 'దండీ' లెట్లువచ్చిరి? పిమ్మట వారు బౌద్ధగురువులును పురోహితులునైన 'ఫంగీ'లని తెలసెను. నేను వారికి కనబడకుండ బయటనుండి వారియాటను చూచుచుంటిని. ఇం తలో వారిలో నొకరు నన్ను చూచి లోనికితీసికొనివెళ్ళెను. నేను కూ ర్చుండుట కొక ఆసనమును కాళ్ళుకడుగుకొనుటకు జలమును యిచ్చిరి. నేను వారింటికి వెళ్ళుటచే వారు నాకతిథి సత్కారము గావించిరి. బౌద్ధులకు అతిథిసేవ పరమధర్మము.

ప్రాతఃకాలమైనది. నేను నౌకకు మరలివచ్చితిని. సూర్యోద యమాయెను. అప్పుడు మొదలియార్ చే నిమంత్రితులైన తక్కిన వారు మమ్మునుకలసికొనిరి. మొత్తము ఏబదిమందిడుంటిమి. మొదలి యారు మాకందరకు విందొనర్చెను. అతడు అనేకమైన ఏనుగులను సంపాదించి తెప్పించెను. అందొక్కొక్కదానిమీద ముగ్గురు నలుగు రు కూర్చుండి ఆమహారణ్యముగుండ పోతిమి. అచ్చట మధ్యమధ్య చిన్నచిన్న కొండలు, దట్టమైన అరణ్యము. ఏనుగులమీదతప్ప అ

క్కడకుపోవుటకు అన్యోపాయము లేదు. మధ్యాహ్నము మూడుగం టలకు ఆపర్వతగుహాసమ్ముఖమున చేరితిమి. ఇచ్చట ఏనుగులుదిగి న డుమువరకు పెరిగియున్న తుప్పలలో నడచితిమి. గుహాముఖము చిన్న ది. మేమందరము వంగి చేతులు భూమిమీద నానుకొని నడవవలసివ చ్చెను. రెండడుగులు పోకినపిమ్మట మేము నిలువబడుటకు వీలయ్యె ను. లోపల చాలా జారుగానుండెను. కాళ్లు జారజొచ్చెను. జాగ్రి తగా నడచుచు కొంతదూరము సాగితిమి. ఘోరాంధకారము. మ ధ్యాహ్నము మూడుగంటలవేళ రాత్రిమాడుగంటలవలె నుండెను. దారితప్పినయెడల బయటకువచ్చుటెట్లో యని భయపడుచుంటిమి. అందుచే నేనెచటికిపోయినను సందునుండివచ్చు వెలుతురుమీద మా త్రము లక్ష్యముంచితిని. ఆయంధకారగుహామధ్యమున 50 మంది విడివిడిగా దూరదూరముగా నిలబడితిమి. ప్రతివానిచేతిలోను గంధ కచూర్ణముండెను. ఎక్కడనిలబడిన వారక్కడనే ఆచూర్ణము రాళ్ళ సందులలో నుంచితిమి. మేమందరము సిద్ధముగా నిలబడినపిమ్మట 'కె ప్టను' తనగంధకపుగుండ నంటించెను. అటుపై మేమందరము నగ్గిపు ల్లలతో మామా గంధకచూర్ణముల నంటించితిమి. కావున ఆగుహా లో ఒక్కసారిగా నేబదిస్థానములలో నేబది రంగుకాంతులు ప్రకాశిం చెను. మేము గుహాలోపల నంతయు బాగుగా చూడగల్గితిమి. ఏమి ప్రకాండమైనగుహ! పైకిచూచితిమిగాని మాదృష్టి చానియుచ్ఛతర సీమ నందుకొనలేకపోయెను. గుహాలో వర్ష ధారలవల్ల నేర్పడిన స్వా భావిక విచిత్రకారుకర్మ చూచి మేమాశ్చర్యమొందితిమి.

పిమ్మట మేము బయటకువచ్చి పర్వతవనమునందు వనభోజన ముచేసి 'మోల్మీన్'కు తిరిగిపోతిమి. తిరిగిపోవుచుండగా మార్గమున నానాయంత్రమిశ్రితమైన యొకవాద్యమువిని ఆధ్వనినిపట్టి చెంతకుపోతి మి. అచ్చట కొందరు బర్మీలు అనేకరీతుల త్రిప్పుకొనుచు నృత్యము

చేయుచుండిరి. వారియుత్సాహమున పాల్గొని 'కెప్టన్' మొదలగు వారుకూడ మిక్కిలి సంతోషముతో వారివలె నాట్యమాడనారంభించిరి. వారినట్లు నేళాకోళముచేయుటచూచి గుమ్మమువద్ద నిలబడిన యొక బర్మాస్త్రీ మదోన్మత్తులైన పురుషులచెవులలో నేదోయూదెను. వెంటనే వారు నృత్యము వాద్యము మానివేసి యెక్కడికో పలాయితులై పోయిరి. దొరలు వారినెంతయో అనునయవినయములతో తిరిగి నృత్యముచేయుడనిరి. కాని వారువినిపించుకొనక నెక్కడికో పారిపోయిరి. బర్మారాజ్యములో పురుషులపై స్త్రీలకంత యధికారముండెను.

'మోల్మీన్'కు తిరిగివచ్చితిమి. నేనొక ఉన్నతోద్యోగియు గౌరవనీయుడునగు బర్మాపురుషుని చూచుటకు వానియింటికి పోతిని. నాకతడు వినయముతో స్వాగతమిచ్చెను. తివాసిమీదనుండిన యొకకుర్చీలో నతడు కూర్చుండెను. నేనుమరియొకదానిపై కూర్చుంటిని. గది బహువిశాలమైనది. అతని నలుగురు పుత్రికలు నాలుగు మూలలకూర్చుండి యేదో కుట్టుచుండిరి. నేనుకూర్చున్నపిమ్మట అతడు "ఆదా"యనెను. అంతట నాపిల్లలలో నొకతె నాచేతిలో నొక గుండ్రని పాన్దానును పెట్టెను. దానిని తెరచిచూచితిని. అందులో తాంబూలపు మసాలాద్రవ్యములుండెను. బౌద్ధగృహములలో నతిథుల సత్కరించుపద్ధతి యిది. ఆయన నాకు వారిదేశములోని యొకసుందరమగు పుష్పవృక్షపు అంట్లనిచ్చి నన్ను బహూకరించెను. అశోకమును బోలియుండెనవి. వానినింటికి తీసికొనివచ్చి తోటలోపాతితిని గాని ఎంతసంరక్షణచేసినను వానినీదేశములో బ్రతికింపలేకపోతిని. ఈచెట్టు పండ్లు బర్మీలకు మిక్కిలి యిష్టము. వారివద్ద నొక బంగారు కాసున్నచో, దానిని ఒక్కపండుఖరీదుగా నిచ్చికూడ దానినికొందురు. అధివారికంతరుచి; కాని మనకు దానివాసనమైనను గిట్టదు.

## ఇరువదియేడవ ప్రకరణము.



బర్మానుండి తిరిగి వచ్చినపిమ్మట ఆసంవత్సరము ఫాల్గుణమాసాంతమున కటకమునకు వెళ్ళియుంటిని. జగన్నాథక్షేత్రమునకు తీర్థయాత్రికులు పోవు మార్గములబట్టి అంచీపాలకీలపై కటకము చేరితిని. అక్కడ నొకగుడిసెలో బసచేసితిని. చైత్రమాసములో కటకమునందు ప్రచండరౌద్రము. వేడిచే నాయాసము చెందితిమి. అక్కడనుండి 'పాండువా' అను ప్రదేశములోనున్న నాజమీందారీ కచ్చేరికిపోయి జమీందారీ పరిదర్శనముచేయుటకు కొంతకాలముంటిని. అచటనుండి రాత్రులందు అంచీపాలకీలపై సవారిచేయుచు జగన్నాథ దర్శనార్థమై 'పూరీ' కి పోయియుంటిని. ప్రభాతసమయమునకు 'పూరి' కనతిదూరములోనున్న యొకసుందర సరోవరము చెంత చేరితిని. దాని పేరు చందనయాత్ర పుష్కరిణి అని వింటిని. అక్కడ పల్లకీదిగి ఆపుష్కరిణియొక్క స్నిగ్ధజలములో స్నానమాడి మార్గాయాసము తీర్చుకొంటిని.

స్నానముచేసి బయటకు రాగానే జగన్నాథుని పండాయొకడు వచ్చి నన్ను పట్టుకొనెను. వెంటనే కాలినడకనే యాతనివెంబడిపోతిని. నాకు కాలికిజోడులేదు. ఇది చూచి పండా మిక్కిలి సంతసించెను. దేవాలయమునకు వచ్చుసరికి ద్వారము తాళము వేయబడియుండెను. ద్వారమువద్ద జనారణ్యము. అందరును జగన్నాథునిచూడ నుత్సుకులైయుండిరి. పండా చేతిలో తాళముచెవులుండెను. అతడు తలుపు తెరవసాగెను. ఒకతలుపు తెరవగనే దేవాలయములో నొకపొడవైన సావడి కనబడెను. పండా అందులో ప్రవేశించి మరియొకద్వారము తెరచెను. ఇంకొకసావడి కనబడెను. నావెనుక నొకవెయ్యిమంది యాత్రికులు లోనికి జొరబడి చివరతలుపు తెరవగనే "జయ్ జగన్నాథ్!" అని

కేకలు వేసిరి. నేనుకొంచము పరధ్యానముగానుండుటచే నాజనతరంగములో పడిపోతిని. నామిత్రులెట్లో నన్నుపట్టుకొని సురక్షితముగా మాత్రముంచిరి. కాని నాసులోచనములుమాత్రము క్రింద పడిపోయి బ్రద్దలయ్యెను. జగన్నాథ విగ్రహము స్పష్టముగా చూచుటకు నాకు తరుణము దొరకలేదు. కాని 'నిరాకారజగన్నాథునిమాత్రము చూచితిని. ఈదేవాలయములో నెవరేది చూడవలెనని కోరుకొన్న నది చూడగలరని యొకవాడుక కలదు. నావిషయములో మాత్రమది నిజమయ్యెను.

ఈసంకీర్ణాంధకారనిర్వాతమందిరమధ్యమున అసంఖ్యాకులగు స్త్రీపురుషయాత్రికులుండిరి. స్త్రీలు వారి మానమును కాపాడుకొనుట కసాధ్యముగనుండెను. ఆసమూహతరంగములోబడి ఒకసారి యిక్కడకు ఒకసారి అక్కడకు విసరివేయబడుచుంటిని. ఒకక్షణమైనను స్థిరముగా నొకస్థలములోనుండుట కసాధ్యముగా నుండెను. నావద్దనున్న జమాదారును పండాలును చేతులులంకెవేసికొని మూడువైపుల నావెనుక నడ్డునిలబడిరి. సమ్ముఖమున జగన్నాథుని రత్నవేదియేనాకు కాపుదలగా నుండెను. అప్పుడు నేను స్వేచ్ఛగా నంతయు చూడగలిగితిని. జగన్నాథునిముందు నీటితో ముంపబడిన యొకరాగిబిందెయుండెను. అందులో జగన్నాథుని ఛాయపడియుండెను. ఈఛాయావిగ్రహముయొక్క పండ్లుతోమి దానిపై తిరిగి నీరుపోసిరి. దానితో జగన్నాథుని దంతధావనము, స్నానము అయిపోయెను. పండా లప్పుడు ఆజగన్నాథుని పైకెక్కి నూతనవస్త్రములతోను నూతనాభరణములతోను విగ్రహము నలంకరించిరి. అప్పటికి పదునొకండుగంటలు దాటెను. అప్పుడు మహానైవేద్యమునకు సమయమైనది. నేనక్కడనుండి మరలివచ్చితిని.

అక్కడనుండి విమలాదేవి మందిరమునకు పోతిని. ఇక్కడప్రి

జలు బహుకొలదిమందిమాత్రముండిరి. నేనువిమలాదేవికి ప్రణామము చేయకుండుట ప్రతివారును చూచిరి. ఓఢ్రులకు మిక్కిలి కోపము వచ్చెను. "ఎవరది? ప్రణామముచేయకున్నాడు!" అనుచు నన్ను భయ పెట్టుచు నన్నుచుట్టుకొన నారంభించిరి. సంగతి గనిపెట్టి నాపండా నన్ను నానిర్దిష్టవాసస్థానమునకు కొనివచ్చెను. అతడక్కడ నాతో "విమలాదేవికి ప్రణామము చేయకుండుట బాగుండలేదు. యాత్రి కులు మిక్కిలి అసంతుష్టిచెందిరి. ఒకసారి సాష్టాంగపడుటయేకదా! మీరది చేసిన తీరిపోను." అనెను.

నేనతనితో విమలాదేవికి ప్రణామము చేతునా ఏమి? మాయాదేవికే నేను నమస్కరించలేదు! నీవెఱుగుదువా? నేను మాయపురికి పోయియుంటిని. మాయామందిరమునకు వెళ్ళి యా మెను చూచితిని. * ఆమెమణిమండిత పర్యంకముపై అర్ధశయ నయై యుండెను. నేను వచ్చిన దామె లెక్కచేసినట్లు కనబడలేదు. ఆమె సహచారిణి యొకతె ప్రణామము చేయమని నాకు సంజ్ఞచేసెను. సృజింపబడిన యేదేవతకుగాని దేవికిగాని నేను ప్రణమిల్లనంటిని. అం దుకు వారు కోపముతో నాలుకలుకరచికొనిరి. మాయాదేవి వారితో "అతడు నమస్కరింపక పోయినచో నొకపుష్పమైన యివ్వనిందు" అనెను. నేను దీనికేమియు ప్రత్యుత్తరమియ్యక ఆమెగదినుండి బయ టికి వచ్చితిని. క్రింది అంతస్థుకుదిగి బయటకు పోవుటకు ముందు వసా రాకు వచ్చితిని. కాని నేను ముందడుగిడుసరి కింకొకవసారాకనబడెను. దానిముందుకు వచ్చుసరికి మరియొకటికనబడెను. ఈవిధముగా నేనెన్ని వసారాలు దాటినను ముందు ఇంకను అన్నివసారాలుండెను. ఎన్నె న్నోవసారాలు దాటితిని. కాని వానికంతము లేకపోయెను. అప్పుడు

* "తన్వీశ్యామా శిఖరదశనా" — అను కోమల గాత్రి, సుకుమారి; తెల్లని స్వ చ్ఛములౌ దంతములుకలది.—

మాయావ్యూహములో చిక్కుకొంటినిగదా యని తెలిసికొంటిని. చిట్టచివరకు మిక్కిలియలసి సొలసి నేలపై పడిపోతిని. స్వప్నరాజ్యము నాశనమయ్యెను. చైతన్యము నొందిన పిమ్మట ఈజగన్నాథపురమే మాయాదేవిపురి యని తెలిసికొంటిని." అని నేను చెప్పితిని.

ఆపండాకు నేను చెప్పినదేమియు అర్థముగాక అతడు వెళ్ళిపోయెను. ఇంతలో మహాప్రసాదముయొక్క గోల. దానితో నపరిమితానందము. జమాదార్లు, బ్రాహ్మణులు, అనేకులు అందరు మహాప్రసాదమునందుకొని ఒకరినోటిలో నొకరు వేయ నారంభించిరి. అప్పుడు బ్రాహ్మణ శూద్ర వివక్షత లేదు. అందరునేకమై ఆనందించిరి. ఓఢ్రులు ధన్యులు. ఈవిషయములో వారునెగ్గిరి. వారన్నికులములు నేకము చేసికొనిరి.

'పూరీ'నుండి తిరిగి కటకమునకు వచ్చితిని. అచ్చట దిగగానే మాజమీందారీ దివాను రామచంద్రగంగులీ చనిపోయెనన్న వార్త వింటిని. అతడు రామమోహనరాయ్‌కి దగ్గర బంధువు. అతని కుమారుడగు రాధాప్రసాదరాయ్‌కి పరమమిత్రుడు. బ్రాహ్మసమాజమునకతడే ప్రథమసంపాదకుడు. అతని కర్మదక్షత కనిపెట్టి మాతండ్రిగారతనిని మాసమస్తజమీందారీలకు దివానుగా నియమించెను. అతడిప్పటివరకు మాయధీనములోనే యుండి అతినిపుణముగా జమీందారీ వ్యవహారములన్నియుచక్కబెట్టుచుండెను. అతని మరణవార్తవిని1851వ సం॥రం జ్యేష్ఠమాసములో కటకమునుండి ఇంటికి తొందరగావెళ్ళి మాజమీందారీనిగూర్చి క్రొత్తయేర్పాటుల జేయదొడగితిని.



## ఇరువదయెనిమిదవ ప్రకరణము.

1854 వ సంవత్సరములో గిరీంద్రుడు మృతినొందెను. మాకంపెనీ వ్యవహారముల తను బహునిపుణతతో నెరవేర్చుచుండెను. కావున ఆతని మరణమువల్ల నాకార్యములకు గొప్పలోటుకలిగెను. ఇప్పటి కనేకఋణములు తీర్పబడెను. ఇంకననేకములు మిగిలియుండెను. కొందరప్పులవాండ్రు ఆలస్యము సహించలేక మామీద వ్యాజ్యములను వేసి 'డిక్రీ' లనుపొందిరి.

ఈరోజులలో నేను మధ్యాహ్నభోజనానంతరము తత్వబోధినీ సభాకార్యముల చూచుటకొరకు బ్రాహ్మసమాజగృహము రెండవ యంతస్థులో నేను కూర్చుండెడివాడను. ఒకనాడు భోజనానంతరమున సభకుపోవుచుంటిని. "నేడు పోవలదు. 'వారంటు' (Warrant) వచ్చునట్లున్నది." అని మాయింటిలోని వారు నాతోనసిరి. ఇదిఅనవసరభయమని తలంచి, ఇది వినికూడా సభకుపోయి పని చూచుకొన నారంభించితిని. కొంతసేపటి కొకబంగాళీ గుమాస్తా ముఖము నెఱ్ఱచేసుకొనివచ్చి నాతో మెల్లగా నిట్లనెను, "ఇక్కడకు రావలదని నేను కబురుపంపితినే. మీరేలవచ్చితిరి?" అని అడిగెను. అటుపిమ్మట 'బైలిఫ్' కినన్ను వేలుపెట్టి చూపి " ఈయనయే దేవేంద్రనాథ ఠాకూర్ " అని చెప్పెను. అప్పుడు 'వారంటు'చూపి, వెంటనే 14,000 రూపాయలు చెల్లింపవలెనని చెప్పెను. నావద్ద యిప్పుడు 14,000 రూపాయలు లేవంటిని. అట్లయినచో వెంటనే నాతో 'షెరిఫ్' వద్దకు రమ్మనెను. అతనిని కొంచము తాళుమనిచెప్పి బండికి కబురుపంపితిని. అది వచ్చినపిమ్మట ఆబైలిఫ్దొర నన్నందులో నెక్కించి 'షెరిఫ్'వద్దకు కొనిపోయెను.

నన్ను వారంటుచేసి పట్టుకొనిరని అవతల మాయింట పెద్దగోల. నేడందరు నన్నిల్లు కదలవలదనిచెప్పిరి. కాని నేను"వారంటు'పైన

పట్టుబడుట కంగీకరించితిని. మావకీల్ జార్జియే ఘటనాక్రమమున ఆ సంవత్సరము 'షెరిఫ్'గానుండెను. నన్నతడు తనఆఫీసులో కూర్చుండ నియమించి, "నేడిల్లెందుకు వదలితివి" అని ప్రశ్నించెను. ఈలోగా నాకనిష్టసోదరుఁడు, జడ్జి కాల్విన్‌వద్దకు వెళ్ళగా నతడు నన్ను జామీనుమీాద విడిపింపుమని సలహానిచ్చెను. అప్పుడు చంద్రబాబు మొదలగు మావారు కొందరు జామీానుండి నాకు కారాగృహప్రాప్తి తప్పించిరి.

ఈసంగతి వినగానే మాపినతండ్రి ప్రసన్నకుమార్ ఠాకూర్ విచారించి, "దేవేంద్రుడెప్పుడు నన్నేమియునడుగడు. ఏమియుచెప్పడు. నాకు తెలియజేసినచో నీతని ఋణముల కన్నిటికి సులభముగ నేర్పాటుచేయ గలుగుదున"నెను. ఇది విని మరునాడతని వద్దకు వెళ్ళితిని. అతడు "నీవింకేమియు చేయనక్కరలేదు. నీజమీాందారీ రాబడియంతయు నాచేతిలో నుంచుము. ఉన్న అప్పులన్నియు నేనుతీర్చి నిన్నెవ్వరు నీవిషయములో ఇబ్బంది జేయకుండ చూచెదను. ఈసలహా నేనుకృతజ్ఞతాపూర్వకముగా నంగీకరించి యప్పటినుండియు మాజమీాందారీ రాబడి యావత్తును, నతనిచేతిలో నుంచుచుంటిని. అతడు నాయప్పుల తీర్పు భారము వహించెను.

అప్పటినుండియు ప్రతియుదయమును ప్రసన్నకుమార ఠాకూర్‌వద్దకుపోయి పద్దులుచూపి ఋణవ్యవహారములగూర్చి ముచ్చటింప నారంభించితిని. నేను వెళ్ళినప్పుడెల్ల నవబెనర్జీ అతనిప్రక్కతెల్లపాగాతో కూర్చుండి యుండును. కోర్టుకు 'షెరిఫ్' యెట్లో ఆతని దర్బారుకు నవబెనర్జీ అట్టివాడు. ప్రతి విషయములో నాతడు నవబెనర్జీ సలహా తీసికొనుచుండును. నవబెనర్జీ యొకడుమాత్రము అతని విశ్వాసమునకు పాత్రుడయ్యెను. ప్రసన్నకుమారఠాకూర్ యెదుట ఒకనాడు యీనవబెనర్జీ నాతో ఇట్లనెను. " తత్వబోధినీ

పత్రిక బహుమంచిది. బాబు లైబ్రిరీలో నేను చదువుచుందును. అది చదివినచో జ్ఞానము, చైతన్యము వచ్చును. దానినుండి జ్ఞానము పొందనగును." నేను, "నీవు తత్వబోధినీపత్రికచదువుదువా ? చదువకు, చదువకు" అంటిని. ప్రసన్నకుమారఠాకూర్, "ఏమి, చదివిననేమి?" అని యడిగెను. "తత్వబోధినీ పత్రిక చదివినయెడల నాకు పట్టిన దశయేపట్టును." అంటిని. అతడు "ఆ! దేవేంద్రుడు నిజముఒప్పుకొనెను. ఒప్పుకొంటివిగదా?" అని పెద్దనవ్వు నవ్వనారంభించెను. సరే, దేవుడున్నాడని నాకురుజువు చెయ్యగలవా?" అనెను. "ఆగోడ అక్కడనున్నదని రుజువు చెయ్యగలవా?" అని ప్రత్యుత్తరమిచ్చితిని. అతడు నవ్వి "అరే, ఆగోడ అచటనేయున్నది. నేను చూచుచున్నాను. ఇందులో ఇంక రుజువు చేయుటకేమున్నది," అనెను. నేను, "ఈశ్వరుడు సర్వత్ర ఉన్నాడు. నేను చూచుచునే యున్నాను. ఇందులో ఇంక రుజువు చేయుటకేమున్నది?" అంటిని. "ఓహో! దేవుడు, గోడ సమానమైనట్లు! ఏమి చెప్పుచున్నాడు దేవేంద్రుడు?" అని అతడనెను. నేను, "ఈశ్వరుడు నాకు గోడకన్న సమీపముననున్నాడు. అతడు నాఅంతరమునందున్నాడు. నాఆత్మలో నున్నాడు. ఈశ్వరుని ఎవరు మన్నింపరో వారిని శాస్త్రములు నిందించును. "అసత్యమప్రతిష్ఠన్తేజగదాహురనీశ్వరం."అసురులు అసత్యమునవలంబించి ఈజగత్తులోఈశ్వరుడులేడని చెప్పుచుందురు అనిచెప్పితిని. అతడు"కాని శాస్త్రములలోనేనన్నిటికంటె నీమాట నెక్కువ మన్నింతును. "అహందేవోనచాన్యోస్మి నిత్యముక్త స్వభావవాన్."—"నేను నిత్యముక్త స్వభావవంతుడగుపరమేశ్వరుడను.నేనింతకన్న నేమియు కాను."—

నేను ధనవంతుడను. బహులోకులకు ప్రభువును. నాకు సమానులింకెవరున్నారు, *అన్న అభిమానముండినచో కొంతసమంజసముగా

* "ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోస్తి సదృశో మయా."

నుండెడిది. కాని నేనే స్వయంపరమేశ్వడను అనుకొనుట బహుఅనర్థ దాయకవిషయము. అట్టి అభిమానముగల జిహ్వను కోసివేయదగును. సహస్రములగు ప్రాపంచికపాశములతో కట్టబడి, జరాశోకపాపతాప ములందు మునిగియుండి తాను నిత్యముక్తస్వభావవంతుడననియూహిం చుటకన్న ఆశ్చర్యమింకేమి యుండగలదు! అద్వైతమును బోధించిశంక రాచార్యులు భారతవర్షముయొక్క మస్తకములు విఘూర్ణితము గావిం చెను. అతడుపదేశించిన మతము ననుసరించి సన్యాసులు, గృహస్థులు కూడ "సోహం"—నేనే ఆపరమేశ్వడను"—అనుప్రలాపవాక్యము నుచ్చరించుచుందురు.



ఇరువదితొమ్మిదవ ప్రకరణము.



1856 వ సంవత్సర పుష్య బహుళచతుర్దశినాడు బ్రాహ్మస మాజ సాధారణసభ యొకటి జరిగెను. ఈసభకు శ్రీయుత రామనా ధఠాకూర్ అగ్రాసనాధిపత్యము వహించెను. ఆసమయమున బ్రాహ్మసమాజమున రెండు 'ట్రస్టీ' పదవులు కాళీగానుండెను. ఈప దవులలో ట్రస్టీలను నియమించుటయే యీసభోద్దేశము 'ట్రస్టు' పత్రములోని నియమానుసారముగా ప్రసన్నకుమారఠాకూర్‌కు మా త్రము ట్రస్టీలను నియమించు హక్కు కలదు. అతని యిచ్ఛానుసార ముగ సభాప్రారంభమున సర్వసమ్మతముగా సభాపతిమహాశయుడు నన్ను, రామప్రసాదరాయ్‌ని ఆపదవులందు నియమించెను.

1848 సంవత్సరములో బ్రాహ్మధర్మబీజము వ్రాసి ఒకపెట్టె లోపెట్టి తాళము వేసితిని. ఒకసంవత్సరానంతరము దానిని పెట్టెలో నుండిబయటకు తీసితిని. ఆబీజము సారగర్భితముగా నుండుటచూచి

ఆశ్చర్యపడితిని. ద్వితీయమంత్రములో "అనంతం", "విచిత్రశక్తిమత్" అను పదములకు మారుగ "అనంతం", "సర్వశక్తిమత్" అను పదములుకూర్చితిని. తృతీయమంత్రములో "సుఖం" అనుమాటకు బదులు "శుభం" అనుమాట వ్రాసితిని. ద్వితీయ మంత్రము చివర "ధృవం, పరిపూర్ణం, అప్రతిమం" అను శబ్దములచేర్చితిని. 1851 వ సంవత్సర మార్గశిరమాసపు 'తత్వబోధినీ' పత్రికలో శిరోభాగమున ఈబీజముయొక్క చతుర్థమంత్రము—"తస్మిన్ ప్రీతిస్తస్య ప్రియకార్య సాధనంచ తదుపాసనమేవ"—అతని ప్రేమించుట అతని ప్రియకార్య సాధనచేయుటయు ఆయన ఉపాసన—అనునది ప్రచురింపబడెను. 1857 సం॥ రం వైశాఖమునుండియు 'తత్వబోధినీ' పత్రికశిరోభాగమున సంపూర్ణబీజమంతయు ప్రచురింపనారంభించితిమి.

"బ్రహ్మవా ఏకమిదమగ్రమాసీత్ నాన్యత్కించనాసీత్ తదిదంసర్వమసృజత్ । తదేవనిత్యం జ్ఞానమనంతం శివంస్వతంత్రం నిరవయవమేకమేవాద్వితీయం సర్వవ్యాపి సర్వనియంతృ సర్వాశ్రయసర్వవిత్ సర్వశక్తిమత్ ధృవంపూర్ణమప్రతిమం । ఏకాస్యతస్యైవోపాసనాయా పారత్రికమైహికంచశుభంభవతి । తస్మిన్‌ప్రీతిస్తస్యప్రియకార్యసాధనంచ తదుపాసనమేవ."—పూర్వము కేవలము ఒక్కపరబ్రహ్మమాత్రముండెను. అన్యమేమియులేదు. అతడీసముదయసృష్టిగావించియుండెను. అతడు జ్ఞానస్వరూపుడు, అనంతస్వరూపుడు, మంగళస్వరూపుడు, ఆనందస్వరూపుడు. నిత్యనియంత, సర్వజ్ఞుడు సర్వవ్యాపి, సర్వాశ్రయుడు, నిరవయవుడు, నిర్వికారుడు, ఏకమాత్రుడు, అద్వితీయుడు, సర్వశక్తిమంతుడు, పవిత్రుడు, పరిపూర్ణుడు. ఎవ్వరితో నుపమానము లేనివాడు. కేవలము అతని ఉపాసనద్వారా ఐహిక పారమార్థిక మంగళము సంభవించును—.

ఈబీజము ప్రకటింపబడిన పిమ్మట దానికి బ్రాహ్మలందరు

సంపూర్ణముగ సమ్మతించిరనియు, దీనితో నందరు సంతుష్టి చెందిర నియు తెలిసికొంటిని. ఇంతవరకును ఎవ్వరు దానికభ్యంతరపెట్టలేదు. బ్రాహ్మసమాజము బహుభంగుల భిన్నమైపోయినప్పటికిని ఈబీజమం త్రమే యీశ్వర ప్రసాదమువల్ల బ్రాహ్మలందరకును ఐక్యస్థలముగా నున్నది. కావుననే బ్రాహ్మసమాజపు 28 వ వార్షికోత్సవమునందొక నిష్ఠావంతుడును, ఆలోచనాశీలుడును అగు ఒకబ్రాహ్ముడు తనఉపన్యా సమునందు ఈబీజమును గూర్చి యిట్లు ప్రశంసించెను. "సత్యము సమాదరింపబడునంత పర్యంతము, మానవహృదయ సింహాసనములో వివేకము రాజ్యముచేయునంత పర్యంతము, ఈసిద్ధాంతము మానవ ప్రకృతిని తప్పక విభూషితము కావించును."



## ముప్పదవ ప్రకరణము.



తుట్టతుదకు ఈ పదిసంవత్సరములలోను మాఋణములు చాల వరకు తీరిపోయెను. పితృఋణముయొక్క మహాభారము, చాలవరకు తగ్గిపోయినది. కాని మరియొక విధమగు నూతన విపద్భారము ఋణ భారము నన్ను దుఃఖములో ముంపసాగెను. గిరీంద్రుడు జీవించియుండు నపుడు తన స్వంతఖర్చుకొరకు విశేషఋణములు గావించి యుండెను. మాపితృఋణములతోపాటు ఇదికూడ కొంతవరకు తీర్చివేసితిని. ప్రస్తు తము మరల నాగేంద్రనాథుడు తన స్వంతముకొరకు అధికముగా ఋణముచేయ నారంభించెను. కేవలము తనకొరకే కాదు, ఇతరులకు సహాయము చేయుటకు కూడ 10,000 రూపాయలైన నతడు ఋణము చేయును. అతడు పరుల దుఃఖములందంత దుఃఖిగను, దయాళుడుగ నుండెను.

ఇతని వదాన్యత, ప్రియవ్యవహారము లోకుల మనస్సులను విశేషముగ నాకర్షించుచుండెను. ఒకనాడొక ఋణప్రదాత సొమ్ముకొరకు కొంచము తీవ్రోక్తులాడ జొచ్చెను. దీనితో నతడు నాచెంత కన్నీరు కార్చుచువచ్చి "నాఋణదాత యొకడు నేనతనికి వ్రాసియిచ్చిన 'నోటు'పై నీసాక్ష్యము లేకున్నచో నన్ను విడిచిపెట్టకున్నాడ" నియెను. "నాకున్నదంతయు నీకిచ్చివేయగలను కాని నేనే 'నోటు'ను, పత్రము ను మాత్రము సంతకము చేయజాలను. ఇదివరకు మనకున్న అప్పులే తీర్పజాల కున్నాను. అట్టిస్థితిలో ఈ నూతనఋణమువల్ల బద్ధుడను కాజాలను. ఇకెన్నడును నేను బుద్ధిపూర్వకముగా ఋణమను పాపానలములో దిగబడను." అని నేను చెప్పితిని. నేనిట్లు చెప్పుటవిని, ఒక గోడకుజేరబడి అతడు మూడు గంటలేడ్చెను. అతనిఏడుపుచూచిన నా గుండెలు బ్రద్దలగుచుండెను గానినే నాతని 'నోటు'మాత్రము సంతకముచేయ జాలనైతిని. "మన గాలింపూర్ పట్టుయంత్రశాలలవల్ల వచ్చుసొమ్మును, మనకున్న పుస్తకములన్నియు నమ్ముటవల్లవచ్చు సొమ్మంతయు నీవు తీసికొనుము నేనిచ్చెదను. కాని ఋణముతీర్చు ఉపాయమేదియు తెలియకుండ నేను ధర్మమునకు విరుద్ధముగ అప్పుపత్రము సంతకము చేయజాలను" అని నేనతనితోనంటిని. అతడు విశేషదుఃఖమును అసంతుష్టియు చెందెను. తన అన్నగారు తనకు సహాయము చెయ్యలేదను అభిమానముతో యిల్లు వదలి మాపినతండ్రి రామనాధ ఠాకూరుగారింట్లో వాసముచేయ నారంభించెను. అటు పిమ్మట నేనతనికొక 8,000 రూపాయల 'నోటు' సంతకముచేయవలసి వచ్చెను. మాకున్న పుస్తకములన్నియు అమ్మి ఈ ఋణమును వెంటనే తీర్చెదననియు దాని విషయమై నాకేమియు శ్రమకలుగ జేయననియు నతడు నాతో వాగ్దానము చేసెను.

అప్పటికిని నాగేంద్రనాధుడింటికి రాలేదు. ఇంకను మాపిన

తండ్రి యింటివద్దనే యుండెను. ఈఘటనలన్నిటితో నామనస్సు నితాంతము భగ్నమగుచుండెను. నేనింటి వద్దనున్న యెడల సీరూప ముగా నానాయుపద్రవములు నన్ను చుట్టుకొనుచుండును. మరియొక సారి ఋణజాలములో బద్ధుడనగుదును. కావున నేనును గృహము పరి త్యంజిచి వెళ్ళిపోదును, ఇంక తిరిగి రాను అనుకొంటిని. అవతల అక్ష యకుమారదత్తు ఒకసభ బయలుదేర తీసెను. అందులో ఈశ్వరస్వ రూపము చేతులు లెక్కించి నిర్ణయించుచుండిరి. ఎట్లన: ఈశ్వరుడు ఆనంద స్వరూపుడుగదా అనిరి. ఎవరెవరికి ఆనంద స్వరూపమందు విశ్వాసముండెనో వారందరు చేతులెత్తుదురు. ఈ రీతిగా అధికాం శల అభిప్రాయమును బట్టి ఈశ్వరుని స్వరూపముయొక్క సత్యాస త్యములు నిర్ధారితమగు చుండెను. ఎవరు నాఅంగ స్వరూపులుగ నుండి నన్ను చుట్టుకొనియుండిరో వారిలో అనేకులయందు ఇప్పు డింకే ధర్మాభావమును, నిష్ఠాభావమును కనబడకుండెను. ఒకరిబుద్ధితో ఇంకొకరి బుద్ధి, ఒకరి క్షమతో ఇంకొకరి క్షమ విరుద్ధము. ఎక్కడను మనస్సులోని మతమునకు సహాయము దొరకుటలేదు. నాకువిరక్తి యు ఔదాస్యమును విశేషము వృద్ధిచెందుచుండెను. దీనివల్ల నాకీఉ పకారము మాత్రము జరిగెను. ఇప్పుడు నేను ఆత్మయొక్క గభీరతర ప్రదేశము ప్రవేశించి పరమాత్మను ఉపలబ్ధిగాంచుటకు వ్యగ్రుడనైతిని. ఆత్మయొక్కమూలతత్వమేమి, అను దీనిఅనుసంధానమునందు ప్ర వృత్తుడనైతిని. హృదయము యొక్క ఉచ్ఛ్వాసస్రోతమున ఏసకల సత్యములు ఈశ్వరప్రసాదమువల్ల నాచెంతకు కొట్టుకొనివచ్చెనో వానినన్నింటిని జ్ఞానాలోకనమున పరీక్షచేయుటయందును, వాని గూ ఢార్థములన్నిటిని ఆవిష్కరణముచేసి వానినిజీవితములో పరిణతము గావించుట యందును దృఢప్రియత్నములు చేయుచుంటిని.

"నేనెక్కడనుండి వచ్చితినో, ఎందులకు వచ్చితినో నాకింకయు

స్పష్టపడలేదు. నాయథోచిత కృత్యములు నాకు తెలియుటలేదు. ఇదియే నాదుఃఖమంతయును.*"

నేనిదివరకెక్కడనుంటినో, ఎచటికిపోవలెనో ఇవన్నియు నాకింకను తెలియలేదు. ఈశ్వరజ్ఞానము నేనిక్కడనెంత పొందగలనో అంతయు పొందలేదు, ఇకనేను లోకులతో హాహాయనుచు తిరుగను. వృథా జల్పనముతో ఇంక కాలయాపనముచేయను. ఏకాగ్రచిత్తుడనై ఏకాంతమున ఆయనకొరకు కఠోరతపస్సును కావింతును. నాగృహము విడిచిపోయెదను. ఇంక తిరిగిరాను. శ్రీమత్ శంకరాచార్యులవారు ఇట్లుపదేశించియున్నారు. "కస్త్వత్వంవాకుతఆయతః । తత్వతదిదం చింతయభ్రాతః." 'నీవెవరివాడవు' ఎందుండి వచ్చితివి. హేభ్రాతా యీ తత్వమును చింతచేయుము.

ఈసమయములో 1853 సం॥ రం. శ్రావణమున నేను వరాహనగరములో (Baranagore) గోపాల్‌లాల్‌ఠాకూర్ ఉద్యానగృహములోనుంటిని. ఇక్కడ శ్రీమద్భాగవతము చదువుచుంటిని. చదువుచు చదువుచు ఈశ్లోకములో నిమగ్నుడనైతిని: "ఆమయోయశ్చభూతానాం జాయతేయేనసువ్రత । తదేవహ్యామయం ద్రవ్యం నపునాతిచికిత్సితం."—హేసువ్రతా, ఏద్రవ్యముద్వారాజీవులకు రోగము కలుగుచున్నదో, ఆద్రవ్యము ఎన్నటికిని రోగికి ఆరామముచేయజాలదు—.

నేనీ సంసారములో నుండుటవల్ల నే యీవిపత్తులలో పడుచుంటిని. కాబట్టి యీసంసారమునన్నీ విపత్తునుండి రక్షింపనేరదు. కావున నేనిందుండి పలాయనమవుదునుగాక. సంధ్యాసమయమున యీతోటలో గంగాతీరమున స్నేహితులతో కూర్చుండువాడను. వర్షాకాలనీల నీరదములు నాపైనుండి ఆకాశమున పరుగుపరుగునపోవుచుండెను. అవి

* "అయాఁనషుద్ కిచరా ఆమదం కుజాబూదం ।
దర్ద్‌దరేగ్ కిగాఫిల్ జకార్ గీష్తనం॥"

నాకప్పుడు విశేషసుఖము నిచ్చెను. అమితశాంతి నొసంగెను. సంచారము చేయుటకు వీనికెంత స్వేచ్ఛ! వారియిచ్ఛానుసారముగ యిటునటు ఎంత యథేచ్ఛగా పోవుచున్నవి! వీనివలె నాయిచ్ఛాను సారముగా యిటునటుపోవుటకు నాకుస్వేచ్ఛయుండిన నాకెంతయానం దముగానుండును! ఛాందోగ్యోపనిషత్తులో "యఇహాత్మానమనువిద్య వ్రజంత్యేతాంశ్చసత్యాన్ కామాంస్తేషాం సర్వేషులోకేషు కామచారో భవతి" అని యుండెను. ఎవరు ఆత్మయు దానియిష్టము నెఱిగియిచట పరివ్రిజనముచేయుచుందురో వారు పరకాలమున సకలలోకములం దును సంచరింతురు. సకలలోకములందును యిచ్ఛానుసారముగా సుల భముగా తిరుగగలరు—.

ఇదినాకు వాంఛనీయముగా కనబడెను. ఇచ్చటనుండిపోయి స్వేచ్ఛగా సకలస్థానములందు తిరుగుదము అని నాలో నేననుకొంటిని. శ్వేతాశ్వతరోపనిషద్భాష్యములో, "నధనేన నప్రిజయానకర్మణా త్యాగేనైకేనామృతత్వమాలశుః" అనియుండెను.— ధనముద్వారా కాదు, పుత్రులద్వారాకాదు, కర్మద్వారాకాదు, కేవలము ఒక్క త్యాగమువల్లనే అమృతత్వముపొందనగును.

అప్పుడింక యీపృథివి నామనస్సును పట్టుకొనలేకపోయెను. సంసారముయొక్క మోహబంధనము లన్నియు అప్పుడు నాకుతెగి పోయెను. అశ్వినిమాసము ఎప్పుడు వచ్చును! ఎప్పుడు ఇక్కడినుండి పారిపోదును! సర్వత్రి స్వేచ్ఛగా సంచరింతును! మరల తిరిగి రాకుం దును! అనిఅప్పుడు ప్రతీక్షచేయ నారంభించితిని. కావున ఆమాసము కొఱకెదురు చూచుచుంటిని.

"సప్తమ స్వర్గము నుండి ఆహ్వానము వచ్చినది, ఈపృథివి యొక్క మోహపాశములనే తగుల్కొనుటచే నీపనికేమి ఆటంకము వచ్చినదో తెలియదు. *"

---

* "తురాజె కంగూరై అర్ష్మిజనంద్ సఫీర్ ।
నదానమత్ కిదరీ దామగః చె ఉఫ్తాదస్త్॥"

## ముప్పదియొకటవ ప్రకరణము.



నేను వేచియుండిన ఆశ్వయుజమాస మిప్పటికి వచ్చెను. కాశీ పర్యంతము పోవుటకు నూరురూపాయల కొకపడవ నద్దెకుతీసికొంటిని. 1856 వ సంవత్సర ఆశ్వయుజబహుళచతుర్థి, 11 గంటల సమయమున గంగానది పోటు పొడవనారంభించెను. నామనసులోకూడ నూతనోత్సాహ తరంగము లెగయజొచ్చెను. నేను వెళ్ళి ఆనౌకలో ప్రవేశించితిని. లంగరు తీసిరి. పడవ బయలుదేరినది. నే నీశ్వరునివంక చూచి యిట్లంటిని; "మేమిప్పుడు నౌకలో కూర్చున్నారము. హే! అనుకూల మారుతమా! వీవనారంభించుము. బహుశః మరల మేమాదర్శనీయ మూర్తిని, మాపరమమిత్రుని చూడగల్గుదుమేమో !" *

ఆశ్వయుజప్రతికూల గంగాప్రవాహమునందు పోవుచు నవద్వీపము చేరుటకు వారముదినములు పట్టెను. గంగలో నొక యిసుక తిప్పకు పడవను కట్టి యారాత్రి కాలక్షేపము చేసితిమి. నలువంకల గంగ, మధ్య నీద్వీపము. తీవ్రవాయువులచేతను, మహావృష్టిపాతము చేతను అచటనుండి రెండుమూడు దినములవరకు కదలలేకపోతిమి. కార్తీక బహుళపాడ్యమినాడు మాంగీర్ (Monghyr) చేరితిమి. తెల్లవారుజామున నాలుగుగంటలకు లేచి అక్కడనుండి సీతకుండమును చూచుటకు వెళ్లితిని. నౌకవద్దనుండి మూడుక్రోసులు నడచినపిమ్మట సూర్యోదయమున కచటచేరితిమి. ఆకుండములోని జలము చేయి పట్టజాలనంత వేడిగా నుండెను. దానికి నాలుగుప్రక్కలను అడ్డు కట్టబడియుండెను. దీనికి అడ్డెందుకు కట్టిరని జిజ్ఞాసచేయగా నక్కడివారు, "యాత్రికు లప్పుడప్పుడు దీనిలో పైనుండి దూకుచుందురు, కావున

* కష్తీనిశస్త్గానెంఐబాద్ షర్త్ బర్ఖీజ్।
బాషద్కిబాజ్ మబీనేందీదార్ ఆష్నారా॥"

మేజిస్ట్రేటుయొక్క యాజ్ఞననుసరించి దీనికీ యడ్డు కట్టబడెను", అని చెప్పిరి. దానినిచూచినపిమ్మట తిరిగి యీమూడుకోసులు నడచి క్షుధితుడనై పిపాసితుడనై, పరిశ్రాంతుడనై, పడవకు తిరిగివచ్చితిని.

తర్వాత ఫతూయా (Fatua) దగ్గరి విస్తీర్ణగంగామధ్యస్థానము గుండ ప్రయాణముచేయుచున్న సమయమున నొక గొప్ప తుపాను బయలుదేరెను. తొందరగా పడవ నొడ్డుకు పట్టిరి, కాని ఒడ్డుచేరినను తుపానుధూకుడుచే పడవ గట్టుకు కొట్టుకొనుచుండెను. పడవ పగిలి పోవుటకు సిద్ధముగా నున్నదనియు రక్షించుట కసాధ్యమనియు తెలిసి కొని దోళాయమానమగు ఆనౌకను వీడి యొడ్డున నిలబడితిని. కాని నేను గట్టినేలమీదనే నిలబడియున్నప్పటికి తుపానుమాత్రము నామ నస్సు నాందోళపెట్టుచునేయుండెను. ఇసుక వచ్చి నా శరీరమును బాణ ములవలె గుచ్చుచుండెను. ఒకమోటదుప్పటి చుట్టుకొని ఒడ్డున నిల బడి గంగానదియొక్క ఆ ప్రమత్తభీషణాకృతియందు ఆ "మహద్భ యంవజ్రమద్యతం" అని వర్ణింపబడు ఆ "పరమేశ్వరుని మహిమ నను భవింపనారంభించితిని. మా వెనుక ఆహారసామగ్రిలను తీసికొనివచ్చు చున్న చిన్నపడవ గంగాగర్భమున మునిగిపోయెను. పిమ్మట మేము పాట్నా చేరి నూతన ఆహారసామగ్రిలు కొంటిమి. అక్కడ గంగా స్రోత మత్యంతప్రబలము. పడవ ఇంక కదలలేకపోయెను. ఈ దుర్జ యస్రోతముయొక్క ప్రతికూలముతో మార్గశిర శుద్ధ షష్టినాడు కాశీ చేరితిమి.

మొత్తము కలకత్తానుండి కాశీచేరుట కొకటిన్నర మాసములు పట్టెను. ప్రాతఃకాలముననే ఆపడవలోని సమస్త సామగ్రిని తీసి కొని యెక్కడకు పోదునా, ఎక్కడబసదొరుకునా యని వెదకుకొను చు 'సికోలు' * వైపునకు పోతిని. కొంత దూరము పోయి ఒక తోట

* పాశ్చాత్యులు వసించు ప్రాంతము.

లో పాడుకొంప యొకటి ఉండుట చూచితిని. అచ్చట నొక నూతివద్ద కొందరు సన్న్యాసులు కూర్చుండి జల్పన చేయుచుండిరి. ఈ యింటిలో వీరువారు అనక ఎవరైన నివసింపవచ్చునని తోచినది. ఇట్లుభావించి నాసామానుతో అందులో ప్రవేశించితిని. మరునాడు కాశీలో సుప్రసిద్ధుడగు రాజేంద్రమిత్రకుమారుడు గురుదాసమిత్ర నన్ను చూచుటకు వచ్చెను. నేనిచటకువచ్చిన సంగతి ఎట్లతనికి తెలిసెనా యని ఆశ్చర్యపడితిని. నేను త్వరగాలేచి ఆతని నాదరించి చెంత కూర్చుండబెట్టితిని. "ఈ మాయింటికివచ్చి మమ్ములను మిక్కిలి గౌర వించితిరి. ఈయింటికి తలుపులు లేవు, పర్దాలులేవు, ఆవరణలేదు. రాత్రులందు శీతల మమితముగానుండును. రాత్రి మీరెంతకష్టముతో గడపియుండిరో తెలియదు. మీరిచ్చటకు వచ్చుట మాకు ముందు తెలిసియుండినచో సర్వము సిద్ధము చేసియుందుము," అని అతడనెను. ఆతడెంతయో మర్యాదచూపి, నన్నుసత్కరించి ఆస్థానమును నివాస యోగ్యముగా చేసెదనని పట్టు పట్టెను. నేను కాశీలో పది దినము లుంటిని. బహుసౌఖ్యముగా నుంటిని.

మార్గశిర బహుళ విదియనాడు గుఱ్ఱపుబండిలో కాశీనుండి బయలువెడలితిని. నాసేవకుల నందరిని ఇంటికి పంపివేసి వారిలో నిద్దరిని మాత్రము బండిలో నెక్కించుకొంటిని—కిశోర్నాధ ఛటర్జియొక డు, కృష్ణనగరమునకు చెందినయొక గొల్లయొకడు. మరునాటిసాయం కాలము అలహాబాదువద్ద దక్షిణతీరము చేరగనే తెల్లవారుజామున నాకు నౌకదొరకదేమోయను భయముచే నీ బండి నప్పుడే రేవుపడవ మీద వేయించితిని. నేనా పడవమీద బండిలోనే పరుండి ఆరాత్రి నిద్రించితిని. మరునాటి ప్రాతఃకాలమున సావకాశముగా ఆరేవుపడవ బయలుదేరి రెండుజాములవేళకు ఆవలియొడ్డు చేరెను. కోటప్రాంత మున యిసుకబయలులో చిన్నపతాకము లనేకము లెగురుచుండెను.

ఈధ్వజములు యాత్రికుల పితృదేవతలుండు లోకమున సమున్నతములై యున్నవని చెప్పి పండాలు అర్థసంగ్రహము కావించుచుందురు.

ఇదే పవిత్రప్రయాగతీర్థము. ఇది సుప్రసిద్ధవేణీఘట్టము. ఈఘట్టమున ప్రజలు తలలు గొరిగించుకొని, పితృదేవతలకు శ్రాద్ధములుంచి తర్పణములు, దానములు సమర్పించుచుందురు. మాపడవ ఒడ్డుచేరగానే అనేకమంది పండాలు పడవనెక్కి ఆక్రమించుకొనిరి. ఒకపండా వచ్చి "ఇక్కడస్నానముచేసి క్షౌరముచేయించుకొనుమ"ని చెప్పి నన్ను లాగుట కారంభించెను. నేను యాత్రికుడరాలేదనియు క్షౌరము చేయించుకొనననియు చెప్పితిని. మరియొకడు "యాత్రికుడవైననేమి, కాకపోయిననేమి, నాకుమాత్రము కొంత డబ్బియ్యుమ"ని అడిగెను. "నేనేమియు నివ్వను. నీకు శరీరకష్టముచే జీవనముచేయుటకు తగిన శక్తి యున్నది. పరిశ్రమచేసి తిండితినుము," అని నేను ప్రత్యుత్తరమిచ్చితిని. ఆతడు హిందీలో, "నీవు నాకేమైన యిచ్చితీరవలయును, ఇవ్వనిదే దిగనివ్వను" అనెను. నేనాభాషలోనే "నేను నీకు దమ్మిడీ ఇవ్వను. నావద్దనుండి ఎట్లుతీసుకొనగలవో చూతము," అంటిని. ఇదివిని ఆతడు పడవమీదినుండి భూమిమీదికి దిగి, పడవతాడు పట్టుకొని తక్కినవారితో తానును కష్టపడి పడవను ఒడ్డుకు లాగజొచ్చెను. కొంతసేపు లాగినపిమ్మట నావద్దకు పరుగెత్తికొని వచ్చి "ఇప్పుడు కొంతపని చేసితినిగదా; నాకేమైన నిమ్ము" అనెను. నేను "ఈ మాటబాగున్నద"ని నవ్వి కొంతడబ్బిచ్చితిని.

కష్టముమీద గంగయొక్క పశ్చిమపారమున రేవు చేరునప్పటికి రెండుజాములు దాటెను. తరువాత రెండుకోసులు వెళ్ళినపిమ్మట ఒక బంగాళాను చూచి అచటవిశ్రమించితిమి. పిమ్మట అలహాబాదు విడిచి మార్గశిరబహుళ సప్తమినాడు ఆగ్రాచేరితిని. నాగుఱ్ఱపుబండి రాత్రింబగళ్లు పయనముచేయుచుండెను. మధ్యాహ్నసమయమున

మార్గమధ్యమున నేదో యొకవృక్షచ్ఛాయను వంటచేసికొని భుజించు చుంటిమి. ఆగ్రాలో "టాజ్ మహాల్" చూచితిని. ఈ టాజ్ పృథివి కంతకును టాజ్ (కిరీటము). 'టాజ్ మహాల్' లో ఒక గోపురమెక్కి సూర్యుడు పశ్చిమదిక్కునంతను ఎర్రబరచి అస్తమించుట చూచితిని. క్రింద నీలవర్ణపు యమునా. మధ్య నాశుభ్రమో స్వచ్ఛమో, టాజ్ సౌందర్యశోభతో చంద్రమండలమునుండి పృథివిమీద ఉట్టిపడెనా అన్నట్లు తోచుచుండెను.

మార్గశిరబహుళ ఏకాదశినాడు ఈ యమునా మీదుగా ఢిల్లీకి పయనమైపోతిని. పుష్యమాసపు శీతలములో నేను కొన్నిసార్లు యమునా నదిలో స్నానమాడితిని. చలిచే రక్తము పేరుకొనిపోవుచుండెను. పడవదారిని పడవపోవుచుండెను; కాని నేనుమాత్రము యమునాతీరమున సస్యక్షేత్రముల మధ్యనుండియు, గ్రామముల మధ్యనుండియు, ఉద్యానవనములలోనుండియు నడచుచు ప్రకృతిసౌందర్యమును చూచుచు పోవుచుంటిని. అందుమూలమున నామనసున కమితశాంతి కలిగెను. 11 దినములలో యమునాతీరముననున్న మధురాపురము చేరితిని. మధురనుచూచుటకు బయలువెడలితిని.

యమునాతీరమున సన్న్యాసుల కొరక సత్రముండెను. ఆసత్రము నుండి ఒకడు నన్ను హిందీలో "ఇదర్ ఆయ్‌యే కూచ్ శాస్త్రచర్చ కరేంగే"—(రమ్ము యిచట మనము కొంచము శాస్త్రచర్చ చేతము) అని పిలచెను. నేనప్పుడు మధురాపురము చూడవలెనని యుత్సాహముతో నుంటిని. కావున అతనికేనియు ప్రత్యుత్తరమీయకయే నడచిపోతిని. కాని తిరిగివచ్చునప్పుడు అతనివద్దకు పోతిని. అతడు తన పుస్తకములకట్ట విప్పి కొన్నిలిఖితగ్రంథములను బయటకు తీసెను. అవన్నియు రామమోహనరాయల గ్రంథములయొక్క హిందీభాషాంతరీకరణములు. మహానిర్వాణతంత్రోక్త బ్రహ్మస్తోత్రమును ("నమస్తే

స్త్రోతే" పఠింపనారంభించెను. వారితో మామతసిద్ధాంతములు చాల వరకు కలసెను. మార్గమధ్యమున ఇటువంటి మనుజుడుండుట చూచి ఆశ్చర్యపోతిని. నేనతనిని పడవకు రమ్మని పిలచికొనివచ్చితిని. అతడు వచ్చి నాతోనే భుజించెను. అతనికికొంచము 'కారణ్' * మాత్ర మిచ్చితిని. అదిత్రాగుచు నతడు, "అలినాబిందుమాత్రేణ త్రికోటి కులముద్ధరేత్"—"ఒక్కసారాయి చుక్క త్రాగినవాడు మూడు కోట్లమంది పూర్వుల నుద్ధరించున"ని చెప్పసాగెను. "నేను శివసాధన చేసితిని" అని అతడుచెప్పెను. అతడు ఘోరతాంత్రికుడు. అతడు రాత్రి పడవలో నావద్దనే పరుండి, తెల్లవారుజామునలేచి ఏమేమో వల్లింపనారంభించెను. ఉదయముననే యమునానదిలో స్నానముచేసి వెడలిపోయెను.

నేను తర్వాత బృందావనమును చేరితిని. లాలాబాబు ఔదార్యమువల్ల కట్టబడిన సుప్రసిద్ధ గోవిందజీ మందిరమును చూడబోతిని. నాట్యమందిరమున నలుగురైదుగురు కూర్చుండి శితార్ వాద్యమును వినుచుండిరి. నేను గోవిందుజీకి ప్రణామముచేయకుండుటచూచి వారు నిర్ఘాంతపోయిరి.

ఆగ్రా విడచిన మాసమునకు, పుష్యబహుళ ద్వాదశినాడు, పడవఢిల్లీ చేరెను. ముందొక పెద్ద గుంపును చూచితిని. ఢిల్లీ బాదుషా యచట గాలిపటము లెగరవేయుచుండెను. అతనికిప్పుడు చేతిలో వేరే పనిలేదు. ఇంకేమిచేయును? ఢిల్లీనగరము ప్రవేశించి బజారులో నొక యిల్లు అద్దెకు తీసికొంటిని. నన్నింటికి తిరిగి తీసికొనిపోవుటకు నాగేంద్రనాథు డచ్చోటికి వచ్చియుండెను. ఢిల్లీనగరరాజవీధినున్న బజారు వద్ద నేనుంటిని. కాని నన్నతడు వెదకివెదకి కనుగొనజాలక నిరాశచెంది ఇంటికి మరలిపోయెను. ఈసంగతి నాకు తర్వాత తెలిసెను.

---

* పోమరసముయొక్క తాంత్రికనామము.

ఇక్కడ సుఖానందస్వామిని చూచితిని. ఆయన తాంత్రిక బ్రహ్మోపాసకుడు, హరిహరానందతీర్థస్వామిశిష్యుడు. ఈహరిహరానందునితో రామమోహనరాయలకు చాలస్నేహముండెను. అతడు రామమోహనరాయ్ తోటలోనే యుండువాడు. ఇతనికనిష్టభ్రాతయే రామచంద్రవిద్యావాగీశుడు. నేను ఢిల్లీప్రవేశింపగానే సుఖానందస్వామి నాకు అంజూరా మొదలగు ఫలములను పంపెను. నేనాతనికి బహుమతులు పంపి ఆతనిని చూచుటకుపోతిని. అతడును నన్ను తిరిగి దర్శింపవచ్చెను. ఈరీతిగా నాకాతనితో పరిచయమయ్యెను. సుఖానందస్వామి "నేను రామమోహనరాయలు కూడ హరిహరానందతీర్థస్వామి శిష్యులము. నావలెనే రామమోహనుడు తాంత్రికబ్రహ్మావధూత" అనెను. సకలధర్మసాంప్రదాయకులును రామమోహనుని తమవంకకే లాగుకొందురు.

సుప్రసిద్ధమగు 'కుటుబ్ మినార్' ఇచటికి 16 మైళ్లుండెను. నేను దానిని చూచుటకు పోతిని. ఈయుత్కృష్ట గోపురము పూర్వము హిందువులచే కట్టబడినది. కాని ముసల్మానులిప్పుడు దీనిని కుటుబుద్దీన్ పాదుషా జయస్తంభమందురు. కావుననే యది కుటుబ్ మినారని పిలువబడుచున్నది. ముసల్మానులు హిందువులను పరాజితుల నెట్లుచేసిరో అట్లే వారికీర్తికూడ నాశనముచేసిరి. "మినార్" అనిన నొకయున్నత స్తంభాకార ప్రాసాదమని యర్థము. కుటుబ్ మినార్ 161 మూరలు ఎత్తుండును. నేనాగోపురముయొక్క కట్టకడపటి శిఖరము నెక్కి క్రిందకు జూచితిని. నభోమండలముక్రింద సుదూరముగ వ్యాపించియున్న ఆ విశాలమగు బయళ్ళను జూడగ నాశ్చర్యానందములతో నాయొడలు పులకరించెను. ఇది యా 'మహతో మహీయాన్' యొక్క మహామహిమను చాటుచుండెను.

ఇక్కడనుండి గుఱ్ఱపుబండిమీద నింకను పశ్చిమముననున్న అంబాలా (Umballa) కు పోతిని. ఇచ్చటనుండి ఒక్క కిశోర్నాథుని మాత్రము వెంటబెట్టుకొని ఒకడోలీ కుదుర్చుకొని లాహోరునకు పోతిని. లాహోరునుండి తిరిగివచ్చి ఫాల్గుణ చతుర్థినాడు అమృతసరోవరము చేరితిని. అప్పుడక్కడ శీతలము మిక్కుటముగ నుండెను.



## ముప్పదిరెండవ ప్రకరణము.



నేనమృతసరోవరముచేరితిని. కాని నా లక్ష్యమింకను శీఖులు అలఖ్ నిరంజనుని ఉపాసించు ఆ అమృతసరస్సు మీదనే ఉండెను. అతిప్రత్యూషముననే అమృత్సర్ పట్టణముగుండా ఆ యమృత్సరపుణ్యతీర్థము జూడ బయలువెడలితిని. అనేక వీధులు తిరిగి తిరిగి కడకొక పథికుని, "అమృత్సర మెచ్చటనున్నద"ని యడిగితిని. అతడాశ్చర్యముతో నాముఖమువంక తేరిచూచి, "ఏమిది? ఇదే అమృత్సరమ" నెను. "ఇదికాదు, పరమేశ్వరునకు భజనజరుగుచుండు ఆయమృత్సరమెక్కడ?" నంటిని. "ఓహో! గురుద్వారమా? చెంతనేయున్నది, ఈదారిని పొమ్మ"ని అతడు చెప్పెను.

నేనా నిర్దిష్టపథమునచని ఎర్రశాలువుల యొక్కయు, రంగు రుమాళ్ళ యొక్కయు బజారు దాటి, మందిరము యొక్క స్వర్ణరచిత గోపురము సూర్యకిరణములతో దీప్తివహించియుండుట గాంచితిని. దీనిని లక్ష్యమునందుంచుకొని మందిరమునకుపోయి ఒక్క మహత్తర పుష్కరిణిని గాంచితిని. ఇది కలకత్తాలోనున్న 'లాల్దిగీ' కన్న నాలు గైదురెట్లు పెద్దది. ఇదియే సరోవరము. మాధవపురమునందలి కాలువద్వారా ఐరావతీనది యొక్క జలమువచ్చి ఈసరోవరమును నింపు

చుండును. గురురామ్‌దాస్ ఈయుత్కృష్టసరోవరము నిక్కడ త్రవ్వించి దీనికమృత్సరోవరమని పేరుపెట్టెను. పూర్వమిది " చాక్ " అని పిలువబడుచుండెను.

ఆసరోవరముమధ్య ఉపద్వీపమువలె నొక శ్వేతప్రస్తరమందిరముకలదు. ఆమందిరమును ఒక వంతెనమీదపోయి ప్రవేశించితిని. దానిసమ్ముఖమున చిత్రవర్ణపు పట్టువస్త్రములచే నావృతమైన దీర్ఘ స్థూపాకృతిని గ్రంథములుండెను. మందిరములోని శీఖ్ ప్రధానుడొకడు దానిపై వింజామర వీచుచుండెను. ఒకప్రక్క గాయకులు పవిత్రగ్రంథములనుండి గీతములు పాడుచుండిరి. పంజాబీ స్త్రీపురుషులు వచ్చి మందిరమునకు ప్రదక్షిణములుచేసి పుష్పములను సమర్పించి ప్రణామములు కావించి పోవుచుండిరి. కొందరు భక్తిభావముతో గీతములు పాడుచుండిరి. ఇక్కడి కందరును ఇష్టమువచ్చినపుడెల్ల వచ్చుచు పోవుచు నుండవచ్చును. ఒకరు రమ్మనువారు లేరు. ఒకరు వలదనువారు లేరు. ఇక్కడకు క్రీస్తువులు, ముసల్మానులు అందరును రావచ్చును. ఒక్కటే నియమము. కాలిజోడుతో మాత్రమెవ్వరును ద్వారము ప్రవేశింపరాదు. గవర్నరు జనరల్ లార్డు లిట్టన్ ఈనియమము పాటింపకుండినప్పుడు శీఖులందరును మిక్కిలి అవమానితులును, పరితాపితులునై యుండిరి.

తిరిగి నేను సంధ్యాసమయమున మందిరమునకు పోతిని. అప్పుడు హారతి జరుగుచుండెను. ఒకశీఖు పంచదీపముచేతబూని గ్రంథములమెదుట నిలచి హారతినిచ్చుచుండెను. తక్కిన శీఖులందరు నిలబడి చేతులు జోడించి అతనితో కలసి గంభీర స్వరములతో నిట్లు పాడుచుండిరి.

" గగన్‌మే థాల్ రవిచంద్ర దీపక్ వనే,
తారకామండలీ జెాంకామోతీ।

ధూప్ మలయానిలోప వన్ చమరోకరే,
సకల్ వనరాజి ఫులంతజ్యోతి।
కైసీ ఆరతి హెూవే భవ్ ఖండనా, తేరి ఆరతి,
అనాహతా శబ్ద బాజన్త భేరి।
హరిచరణ కమలమకరందలోభిత,
మనోఅను దినోమే ఆయీ పిపాసా।
కృపాజల్ దే నానక్ సారంగ్ కో యాతేహెూవే
తేరీనామే వాసా. ”

“ గగనము పళ్ళెరము. రవిచంద్రులు దీపములు. తారకా మండలము ముత్యాలహారము. మలయానిలము ధూపము. పవనములు చామరములు. వనరాజములెల్లను పుష్పములతో ప్రకాశవంతములు. భవఖండనా! ఏమిహారతి నీహారతి! నీభేరిమ్రోగుచునే యున్నది, కాని ఏహస్తము దానిని వాయించుట లేదు. హరిచరణ కమల మకరంద లోభితమనన్సుతో అనుదినమును వచ్చుచున్నాను. నీనామమునందే నివసించుటకుగాను నానక్ అను చాతకమునకు కృపాజలము నను గ్రహింపుము. ”

హారతిముగిసిన పిమ్మట ‘ కడా ’ (ఒకవిధమైన మిఠాయి) భోగమందరకును పంచిపెట్టబడెను. మందిరములో ఈప్రకారముగా రాత్రింబగళ్ళు ఇరువదియొక్క గంటలు ఈశ్వరోపాసన జరుగుచుండును. మిగిలిన మూడుగంటలు మాత్రము మందిరము పరిశుభ్రపరచుటకు ఉపాసన ఆపివేయబడును బ్రాహ్మసమాజములో వారమునకు రెండుగంటలు మాత్రమే ఉపాసన జరుగును. శీఖుల హరి మందిరములో రాత్రింబగళ్ళు ఉపాసన. ఎవరైనను వ్యాకులపాటు చెందియున్నచో నిశీథసమయమునందు సహితమచటికిపోయి ఉపాసన చేసి చరితార్థులు కాగలరు. ఈసదృష్టాంతము బ్రాహ్మలకు అనుచరణీయము.

శీఖుల కప్పుడు గురువెవ్వరునులేరు. వారి గ్రంథములే వారి గురుస్థానమున ప్రతిష్ఠింపబడి యున్నవి. వారి మొదవగురువు గురుగోవిందు. ఆతడే ఆఖరి గురువు. అతడే శీఖులలో జాతిభేదము నివారణచేసి " పాహోల్ " అను పేరుతో ఇప్పటికిని ప్రచలితమైయున్న ఒకదీక్షాస్వీకారాచారము ప్రవేశపెట్టెను. శీఖు కాదలచినవాడు ముందు "పాహోల్" చేయవలయును. ఆపద్ధతి ఈరూపముగ నుండెను. ఒకపాత్రలో జలమునుంచి దానిలో చక్కెర వెయ్యావలెను. ఇదియొక కత్తితో కలుపబడును. ఈనీరు శీఖులు కాదలచినవారి గాత్రములపై చల్లబడును. వారందరును అప్పుడేకపాత్రమునుండి పానముచేయుదురు. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులందరు జాతి వివక్షతలేక శీఖులు కావచ్చును. మహమ్మదీయులు కూడ శీఖులు కావచ్చును. శీఖులైన పిమ్మట వారందరు " సింగు " లగుదురు. శీఖుల మందిరములో నేదియు ప్రతిమయుండదు. " థాపియానాజాయ్, కీతానాహోయ్, అపిఅప్‌నిరంజన్‌సాయ్ " అని నానక్ చెప్పియున్నాడు. ' ఆయన నెక్కడ స్థాపించుటకువీలు ? ఆయన నెవరును నిర్మాణముచేయజాలరు. అతడు కేవలము ఆ స్వయంభవ నిరంజనుడు." కాని నానక్ యొక్క యీమహోపదేశములనుపొందియు శీఖులు నిరాకార బ్రహ్మోపాసకులయ్యును, గురుద్వార ప్రాకారమునందే ఒకచోట శివాలయమును స్థాపించియుండుట అతి విచిత్రముగానున్నది. వారికి కాళీదేవియందుకూడ నమ్మకముకలదు. " సృష్టింపబడిన ఏవస్తువును పరబ్రహ్మమని తలచి పూజింపను. " అను బ్రాహ్మప్రతిజ్ఞను పాలించుట ఎవ్వరికిని సులభముకాదు. వైష్ణవవసంతోత్సవసమయమున (హోలీ) ఈదేవాలయములో నొకగొప్ప ఉత్సవము జరుగును. ఆసమయములో శీఖులు మద్యపాన మత్తులగుదురు. శీఖులు మద్యపానము కావింతురు, కాని చుట్టకాల్చరు. హుక్కాగాని చిలుముగాని తాకనైన తాకరు.

అనేకులు శీఖులు నాబసకు వచ్చుచుండిరి. వారివద్దనుండి వారిధర్మశిక్షయు, వారిగురుముఖిభాషయు నేర్చికొంటిని. వారిలో అంతగా ధర్మోత్సాహమునాకు కనబడలేదు. ఉత్సాహపూరితుడగు ఒక శీఖు నాతో, "అమృతరసమును రుచిచూడక అయ్యో! అయ్యో! యని దుఃఖించుచు మృతించిన లాభమేమి ?" అనెను. ఏప్పుటవల్ల లాభముండకపోదని నేనతనికి ప్రత్యుత్తరము చెప్పితిని.

అమృత్సరములో " రామ్ బాగాన్ " సమీపమున నాకు దొరకినబస అంతగా సౌఖ్యముగాలేదు. ఇల్లుపాడుపడి యుండెను. తోట అంతయు వినాశదశలో నుండెను. చెట్లల్లిబిల్లిగా పెరిగి అరణ్యమువలెనుండెను. కాని నానవీనోత్సాహమునకును, నూతన దృష్టికిని అన్నియును నూతనముగను, అన్నియును సుందరముగను కాన్పించెను. అరుణోదయమున, ప్రభాతసమయమున నేనుద్యానవనములో విహరించునపుడు, గసగసా చెట్లయొక్క శ్వేత, పీత, లోహితపుష్పములన్నియు శిశిరజలాశ్రుపాతము గావించుచుండి నప్పుడు, రజిత కాంచనచ్ఛాయలతో వెలుంగు తృణపుష్పరాశి ఉద్యానభూములందు జరి " మచ్ నద్ " పరచినపుడు, స్వర్గ సౌఖ్యము గొల్పు మలయమారుతములు ఉద్యానవనమున మకరందరసముల వెదజల్లునపుడు, దూర దూరమునుండి ఆపంజాబీల సుమధురసంగీత స్వరములుద్యానవనమున అల్లనల్లన ప్రతిధ్వనించి నపుడు, నాకా యుద్యానవనమంతయు నొక గంధర్వపురమువలె తోచుచుండెను. అప్పుడప్పుడు మయూరీమయూరములు వనాంతరమునుండి వచ్చి నా గృహోపరిభాగమున వరుసగా కూర్చుండెడివి. వాని చిత్రవిచిత్రవర్ణపు దీర్ఘపుచ్ఛములు సూర్యకిరణములవల్ల ప్రకాశితములై నేలకు వ్రేలాడుచుండును. అప్పుడప్పుడు పైనుండిదిగి ఉద్యానవనములో మేయుచుండును. నేను వానియందు ప్రేమతో చేతిలో కొంచెము

బియ్యముంచుకొని వానికి పెట్టుటకు పోవువాడను. కాని అవి భయముతో 'కే, కా,' యని అర్చుచు ఎక్కడికో ఎగిరిపోవుచుండెడివి. ఒకనాడెవరోనాతో, "అట్లుచేయకుము. అవిచాల చెడ్డవి. పొడిచినచో అవి కండ్లే పొడుచును" అనివారించెను. ఒకనాడు మేఘములు కమ్ముకొనెను. అప్పుడా మయూరములు పింఛములను తలపైకివిప్పి నృత్యముచేయసాగెను. ఎంతటి ఆశ్చర్య దృశ్యము ! నాకు వీణవాయించుటచేతనైనచో వానియాటకు తగినపాటవాయించి యుందును. మేఘములు కనబడగనే మయూరములు ఆనందనృత్యము చేయుచుండునని వ్రాసిన కవీశ్వరుల మాట వాస్తవము. "నృత్యంతి శిఖినోముదా." ఇదిఎంతమాత్రము వారి భావకల్పనకాదు.

ఫాల్గుణ మాసము గడచి పోయెను. మధుమధుర చైత్రమాస సమాగమముతో వసంతద్వారము లోకసారిగ నుద్ఘాటితము లయ్యెను. మలయానిల మీాతరుణము కనిపెట్టి ఆమ్రముకుళ సౌరభమును, సద్యప్రస్ఫుటిత నారింజ సౌరభములతో మిశ్రమముగావించి, యొక్క కోమలసుగంధతరంగముచే నలుదిక్కుల నామోదితముగావించుచుండెను. ఇదియంతయు నాకరుణామయుని నిశ్వాసము. చైత్రమాస సంక్రాంతినాడు నాగృహము ముందున్న జలాశయమునందు ఎచటినుండియో అప్సరసలువచ్చి రాజహంసలవలె ఉల్లాసకోలాహలముతో జలక్రీడలాడు చుండిరి. ఈవిధముగా కాలస్రోత మతిసుఖముగా, నతివేగముగా ప్రవహించి పోవుచుండెను. వైశాఖమాస మారంభమయ్యెను. ఇంక సూర్యతాపము ననుభవింప సాగితిని. మేడమీాదినుండి ఒకఅంతస్థుక్రిందికిదిగితిని. కాని రెండుదినములలో తాపమచటికికూడ ప్రవేశించెను. ఇంటియజమానితో "నేనింకనిచటనుండజాలను. క్రమముగ నుత్తాపమధికమగుచున్నది. ఇక్కడనుండి నేనువెళ్ళెదను." అంటిని. అతడు, "భూమిక్రింద నొకగదియున్నది. గ్రీష్మకాల

ములో నందుండుటకు మిక్కిలి చక్కగనుండున,”ని నాతో చెప్పెను. నాకింతవరకు భూమి అడుగున ఇంకొకగదియున్నట్లు తెలియదు. నన్న క్కడ కతడు తీసికొని పోయెను. అక్కడ సరిగా భూమిపైనున్న గది వలెనే యొక గదియుండెను. ఒకవైపునుండి వాయువు వెలుతురువచ్చు చుండెను. ఆగది మిక్కిలి చల్లగనే యుండెను. కాని నేనక్కడ నుం డుటకిష్టపడలేదు. భూమిక్రింద నొకగదిలో ఖయిదీవలె నేనుండజాలను. స్వేచ్ఛయగు గాలి, విశాలమగు గృహము నాకు కావలెను. ఒకశిఖు నాతో, “అట్లైన సిమ్లాకొండలకు పొందు. అది మిగుల చల్లని ప్రదే శము” అనెను. అది అనుకూలముగా నుండునని భావించి 1857 సం॥రం వైశాఖ శుద్ధ నవమినాడు సిమ్లా అభిముఖుడనై ప్రయాణమైతిని.

మూడురోజులు ప్రయాణము చేసిన పిమ్మట పాంజౌర్ (Panjaur) వదలి వైశాఖ శుద్ధ ద్వాదశినాడు (ఏప్రిల్ ఆఖరురోజులు) కాల్కాకనుమ (Kalka) వద్ద దిగితిని. ముందువైపున పర్వతములు దారి కడ్డుగనుండెను. నాముందు వాని చిత్రమనోహర దృశ్యము వ్యా పించియుండెను. ‘రేపటిదినము వీనిపై కెక్కెదను, పృథివిని వదలి స్వర్గ మునొక్క ప్రథమసోపాన మారోహణ చేసెదను’ అని ఆనందము తో భావింప నారంభించితిని. ఈసంతోషభావముతో నారాత్రియం తయు గడపిహాయిగ నిదురించి, ప్రయాణఖేదము నపనయించితిని.



## ముప్పదిమూడవ ప్రకరణము.

వైశాఖమాసము సగము దాటిపోయెను. బహుళ పాడ్యమి ప్రాతఃకాలమున నొక సవారీ తీసికొని దారులు చుట్టుకొనుచు పర్వత మునెక్క నారంభించితిని. ఎంత ఉచ్ఛపర్వతము నెక్కుచుంటినో మనస్సంత ఔన్నత్యము పొందసాగెను. కొంతమేర ఎక్కిన పిమ్మట

నన్ను మరల క్రిందికి దింపుచుండిరి. క్రమముగా నింకను ఎత్తున కెక్కవలెనని యున్నదే నన్ను క్రింది కెందుకు దింపుచున్నారనుకొంటిని. జోయివాండ్రు పూర్తిగా క్రిందికి దింపివేసిరి. నన్నొక నదివద్ద నాపిరి. ముందింకను ఒకఉచ్ఛతరపర్వతముండెను. దాని పాదప్రాంతముననే యాక్షుద్రనది. అప్పటికి రెండుజాములయ్యెను. రౌద్రముచే నిమ్న పర్వతముత్తప్తమై నన్ను మిక్కిలి పీడించెను. సమభూమియొక్క ఉత్తాపము భరింపవచ్చును కాని నాకీయుత్తాపము దుర్భరమయ్యెను. ఇచ్చట నొకచిల్లరదుకాణముండెను. దానిలో అటుకులమ్మబడుచుండెను. ఆయటుకులీయెండ వేడిమికి వేగినట్లు నాకు తోచెను. ఈనదీతీరముననే మేము వంటచేసికొని భుజించితిమి. మేము నదిదాటి సమ్ముఖమునందున్న పర్వతమునెక్క నారంభించి యొకశీతల స్థానము చేరితిమి.

హరిపురమను నొకయూరిలో నారాత్రి గడపితిమి. మరునాడు ప్రయాణము నారంభించి మధ్యాహ్న మొకవృక్షతలమున నాహారము గొని సంధ్యాసమయమునకు సిమ్లా చేరితిమి. నాపాలకీ బజారులో నుండెను. దుకాణదార్లు నావంక తేరిపారి చూచుచుండిరి. నేను పాలకీ దిగి దుకాణములు, వానిలోనున్న సరకులు చూచుచుంటిని. నా స్నేహితుడు కిశోరీ నాథభటర్జి గృహానుసంధానమునకు వెళ్ళి ఆబజారు లోనే యొకబస స్థిరపరచి శీఘ్రముగా నన్నక్కడికి కొనిపోయెను. అక్కడ నింకొక సంవత్సరము గడపితిమి.

అనేకులు బంగాళీ లచట నుద్యోగములలో నుండిరి. వానిలో చాలమంది నన్నుచూచుటకు వచ్చుచుండిరి. ప్యారీ మోహన్ బెనర్జి ప్రత్యహము నాయోగక్షేమములు తెలిసికొనుటకు వచ్చుచుండెను. అతడచట నొకఇంగ్లీషుషాపులో నుద్యోగిగా నుండెను. ఒకనాడతడు నాతో, "ఇక్కడ సుందరమైన ఒకగొప్ప జలప్రపాతమున్నది. మీరు చూడ నిచ్ఛగింతురేని మిమ్ములను తోడ్కొని పోయి చూపగలను"

అనెను. నేనతనితో మెట్టదిగి దానినిచూచుటకుపోతిని. దిగుచుదిగుచు నచ్చటచ్చట మనుష్యావాసములు, సస్యక్షేత్రములు సంకీర్ణములై యుండుట గాంచితిని అచ్చటచ్చట పశువులు మేయుచుండెను. అచ్చటచ్చట నాకొండలయందలి స్త్రీలు ధాన్యము దంపుచుండిరి. ఇదంతయుచూచి మిగుల ఆశ్చర్యము నొందితిని. ఇక్కడకూడ మైదానములందువలెనే గ్రామములు క్షేత్రములు నున్నవని నేనిప్పుడే తెలిసికొంటిని. ఇట్లు చూచుచు చూచుచు మెట్టయొక్క నిమ్నతమస్థానము చేరితిమి. సవారీలు ఇకముందుకు వెళ్ళుటకు దారిలేకుండుటచే అచ్చటనే యుంచితిమి. మేము కొండలాటీలు చేతపట్టుకొని మెల్లమెల్లగ నాజలప్రపాతముచెంత శిలాతలము చేరితిమి. 300 మూరల ఎత్తునుండి జలధార పడుచుండెను. శిలల ప్రతిఘాతముచే జలము ఫేనరాసుల వెదజల్లుచుండెను. ప్రవాహము మహావేగముతో క్రిందికి పరుగులిడుచుండెను. నేనొకశిలాతలమున కూర్చుండి ఈజలక్రీడను చూడ నారంభించితిని. పర్వతావరోహణమువల్ల కలిగిన పరిశ్రమచే ఘర్మాక్తమై యున్న నాశరీరమును ఈజలప్రపాతశీతలకణములు స్పృశింపగనే నా చక్షువులను అంధకారము క్రమ్ముకొనెను. నేను అచేతనుడనై శిలాతలమున పడితిని. ఒకక్షణమైన పిమ్మట నాకు చైతన్యము వచ్చినది. చక్షువులను తెరచితిని. నామిత్రుడు ప్యారీ మోహనుని ముఖము శుష్కమైయుండెను. అతడెంతయు విషణ్ణుడై కర్తవ్యమెరుంగక నా ముఖమువంక తేరిపారి చూచుచుండెను. వెంటనే ఆయవస్థను తెలిసికొనియాతనికి ధైర్యము కలుగచేయుటకై నవ్వితిని. ఈవిధముగా జలప్రపాతము చూచిన పిమ్మట నాబసకు తిరిగి వచ్చితిమి.

ఆమరుసటి ఆదివారమునాడు తిరిగి కొందరము కలసి వనభోజనము చేయుటకై ఆజలప్రపాతముదరికి బయలువెడలితిమి. నేనుపోయి అజలప్రపాతము మధ్య ప్రవేశించితిని. నామస్తకముపై 300 మూరల

ఎత్తునుండి ఆ జలధార పడ నారంభించెను. ఐదునిమిషము లక్కడనిలచి యుంటిని. ఆ హిమజలకణములు ప్రతిరోమరంధ్రము భేదించికొని నాశరీరములోనికి ప్రవేశింప నారంభించెను. నేను బయటకు వచ్చితిని. కాని నాకది మిక్కిలి ఆమోదముగా నుండుటచే మరల దానిమధ్య ప్రవేశించితిని. ఈరూపముగా ప్రపాతముయొక్క ధారలో స్నాన మాచరించితిని. మేమాపర్వతవనమునం దెంతయో ఆనందముతో వనభోజనము చేసికొని సంధ్యాసమయమునకు బసకు తిరిగివచ్చితిమి. అదివరకు నావామచక్షు వేదో బాధగా నుండెను. మరునాటి ప్రాతః కాలమున కది యెఱ్ఱపడి వాచియుండెను. ఉపవాసముచే చక్షురోగ ము నివారణచేసితిని. జ్యేష్ఠ తదియనాడు రోగశాంతి అయినపిమ్మట ఆరోగ్యముచే శరీరము మనస్సు ప్రసన్నమయ్యెను. ద్వారములు తెరచి యున్న గదులలో నిటునటు నడచుచు ఈసిమ్లా గృహములో నాజీవ నమంతయు సుఖముగా గడపవచ్చునుగదా యని ఆలోచించుచుంటిని. ఇట్టి సమయములో నాగదిక్రింది వీధిలో కొందరు జనులు పరుగెత్తు చుండిరి. నేనది చూచి, "ఏమిసంగతి, ఎందుకట్లు పరుగెత్తుచున్నారు?" అనిజిజ్ఞాసచేసితిని. కాని వారేమియు ప్రత్యుత్తరమీయక చెయ్యి ఊపి నన్నుకూడ పరుగిడమనిరి. ఎందుకు పరుగిడుటయని యడిగితిని. కాని నాకుప్రత్యుత్తరమిచ్చుట కెవ్వరును లేకపోయిరి. ఎవరిప్రాణము వారు దక్కించుకొనవలెనని తొందరపడుచుండిరి.

వీరి భావము కొంచమైనను తెలిసికొనజాలక వర్తమానము తెలిసికొనుటకు ప్యారీబాబువద్దకు పోతిని. అతడు గోడమీద నున్న కపాలమున పెద్దబొట్టు పెట్టుకొని మెడలోనుండి యజ్ఞోపవీతముతో ము పైకి తనకోటుమీద ధరించుచుండెను. అతని నేత్రములు రక్త వర్ణముగ నుండెను. ముఖము మలినముగ నుండెను. నన్ను చూచిన వెంటనే, "ఘూర్ఖాలకు బ్రాహ్మణులన్న గౌరవము," అనెను. "ఏమి

సంగతి?" అని నేనడిగితిని. "ఘూర్ఖా సైన్యము సిమ్లాను కొల్లగొనుటకు వచ్చుచున్నారు. కొండదిగి పోవ నిశ్చయించుకొంటిని." అని యతడు చెప్పెను. అయినచో నేనును నీతో వచ్చెదనంటిని. ఈమాట విని అతడు ముఖము మరింత చిట్లించుకొనెను. ఒంటరిగా పర్వతములలో దాగుకొనవలెనని అతని కోరిక. మేమిద్దరము కలసి పోయినచో కొండవారికి కండ్లుకుట్టి మాప్రాణములకు హాని సంభవింపవచ్చును. అతని భావము గ్రహించి, " లేదు, లేదు, నేను కొండదిగనులే " అంటిని.

నాబసకు తిరిగివచ్చి చూడగా తలుపు తాళము వేసియుండెను. నేను గృహములోనికి ప్రవేశించుటకు వీలులేక వీధిలో సంచరింప నారంభించితిని. కొంచెముసేపునకు కిశోరీనాథుడు వచ్చి, "రూపాయలసంచి పొయ్యివద్ద భూమిలో పాతిపెట్టి దానిపై కట్టెలమోపు పెట్టితిని. నౌఖరును యింటిలోనుంచి తాళము వేసితిని. ఘూర్ఖాలు ఘూర్ఖానుచూచి ఏమియు హాని చెయ్యరు" అని చెప్పెను. " అది సరే కాని నీప్రాణము కాపాడుకొనుట కేమిచేయదలంచితివి?" అని నేనడిగితిని. "ఘూర్ఖాలు వచ్చినచో రోడ్డుప్రక్కనున్న యీగోతిలో ప్రవేశించి దాగికొనెదను. నన్నెవరు చూడగలరు? " అని అతడు బదులు చెప్పెను.

ఘూర్ఖాలు వాస్తవముగా వచ్చుచున్నారేమో చూచితిని. కాని నాకేమియు కనబడలేదు. కాని ఘూర్ఖాలు సిమ్లామీదికి దాడి వెడలివచ్చినచో అందరకు తెలియుటకు ఫిరంగులు పేల్చబడునని ప్రకటన చేయబడెను. క్షణమైనపిమ్మటనే యొకభయానకమైన ఫిరంగి మ్రోత వినబడెను. నేనిక నీశ్వరునిపై భారమువైచి వీధిలో పచారు చేయ నారంభించితిని. రాత్రి యయ్యెను; కాని ఏమి యుపద్రవమును సంభవింపలేదు. నేను గృహములోనికిపోయి నిర్భయముగా శయనిం

చితిని. ప్రభాతమున నిద్రనుండి లేచితిని. ఇంకను జీవించియేయుంటిని. ఘూర్కాలు మామీదికింకయు రాలేదు. బయటకుపోయి చూడగా, సర్కార్ ఖజానవద్దను, కచ్చేరులన్నిటివద్దను, వీధులలోను, ఆయుధ పాణులగు ఘూర్కాలు పహరాయుంచబడిరి.



## ముప్పదినాల్గవ ప్రకరణము.



జ్యేష్ఠపాడ్యమీ దివసమున సిపాయీల విద్రోహమువలన ఢిల్లీలోను, మీరట్‌లోను ఘోరతరహత్యలు సంభవించెనని సిమ్లాకు వర్తమానముచేరెను. జ్యేష్ఠశుద్ధ విదియనాడు ప్రధాన సేనానాయకుడగు జనరల్ ఆర్సన్ (General Arson) శుభ్రముగ క్షౌరము చేసికొని, ఒక పొట్టిగుర్రము నెక్కి సిమ్లాకు వచ్చెను. సిమ్లాకు అనతిదూరమున నే యొకఘూర్కాసైన్యదళముండెను. మార్గమధ్యమున దానినిచూచి యాదళముయొక్క కెప్టనుకు, "ఘూర్కాసైనికులను నిరస్త్రులను గావింపుము" అని హుకుం యిచ్చెను. ఘూర్కాలు నిర్దోషులు. సిపాయీలతో వీరికి స్నేహము లేదు. ఏసంబంధము లేదు. కాని, నల్ల సిపాయీలందరు నొకటే యని దొరలు పొరబడి అనాలోచితముగ ఘూర్కాలను నిరస్త్రులజేయ నాజ్ఞాపించిరి. కెప్టన్, "ఆయుధములిచ్చివేయుడని" వారినాజ్ఞాపింపగానే, వారు అవమానింప బడినట్లును, అగౌరవము చూపబడినట్లును భావించిరి. ప్రథమమున వారిని నిరస్త్రులను గావించి పిమ్మట ఫిరంగులతో కాల్చెదరని వారు భావించిరి. ఈయుద్దేశముతో ప్రాణభయముచే వారందరు ఆలోచనయందును క్రియయందును ఏకమైరి. వారు సేనాధిపతి ఆజ్ఞ మన్నింపలేదు. ఆయుధము లివ్వలేదు. ఇంతేగాక ఆంగ్లేయ ఉద్యోగస్థుల నందరిని బంధించి జ్యేష్ఠ తదియనాడు సిమ్లాను ఆక్రమించుటకు దాడివెడలిరి.

ఈవర్తమానము తెలియగానే సిమ్లాలో కాపురమున్న బంగాళీలు మహాభీతచేతస్కులై సపరివారముగా పలాయితులు కాదొడగిరి. అక్కడి ముసల్మానులు తమ రాజ్యమును తాము తిరిగి పొందవచ్చునని భావింపసాగిరి. ఎక్కడినుండియో యొక ఆజానుబాహుడును, స్ఫురద్రూపియు పొడుగగు గడ్డముగలిగినట్టియు యొకఇరాన్‌దేశస్థుడు నావద్దకు వచ్చి నన్ను సంతోషపెట్టుట కిట్లనెను: "ఈఫరంగీలింతవరకును, ముసల్మానులచే పందిమాంసము తినిపించిరి; హిందువులచే గోమాంసమును తినిపించిరి. ఇపుడు వారి పని యేమగునో చూతము" అనెను. ఒక బంగాళీ వచ్చి, "తమరు ఇంటివద్ద హాయిగ నుండిరే! ఈయుపద్రవములో నిక్కడికేలవచ్చిరి? మేమింతవరకు నిట్టి యుపద్రవ మెన్నడు చూచియుండలేదు," అనెను. "నేను ఒంటరిని, నామాటకేమికాని యిక్కడ సపరివారముగా నున్నవారిని గూర్చి భయపడుచున్నాను. వారిదే మహావిపత్తు" అంటిని.

అచటి:ఆంగ్లేయులు సిమ్లాను కాపాడుటకొరకు ఏకమై వారి స్త్రీలతో నొకయెత్తైన కొండపైనెక్కి దానిని నాలుగువైపుల కాసిరి. వారు సిమ్లాను రక్షించునదేమి? వారచ్చట మద్యపానముతో మత్తులై, ఆమోదముతో కోలాహలము చేయుచు ప్రగల్భము లాడనారంభించిరి. కాని సుధీరుడును, కార్యకుశలుడును అగు సిమ్లాకమిషనర్ హేప్రభువు (Lord Hay) సిమ్లాను రక్షించెను. సిమ్లాకు ఘూర్కాసైన్యాగమనసూచకమగు ఫిరంగిశబ్దము వినబడినప్పుడు అతడు తన ప్రాణములకై భయము నుత్యజించి, మావటివాండ్లులేని ప్రమత్తహస్తియూధమువలెనున్న ఆసైన్యదళసమ్ముఖమున నిలచి తలమీది టోపీనెత్తి సలామ్‌చేయుచు నిలబడెను. నిలబడి, సౌమ్యతిని ఆశ్వాసవాక్యములతో వారిని శాంతపరచి, సిమ్లాకువచ్చి, విశ్వస్తచిత్తముతో ఖజానా మొదలగువాని రక్షణభారము వారిపైనుంచెను. ఇందువ

అచ్చటి దొరలు హేపిభుపై విశేష కోపము చూపనారంభించిరి. "హేపిభు వెంత మాత్రమును తెలివిగ పనిచేయలేదు. మన ధనమును, ప్రాణమును, మానమును, సర్వమును. విద్రోహులగు శత్రువుల హస్తములలో నుంచినాడు. వారివద్ద నట్టి నమ్రతచూపి ఆంగ్లేయ జాతికి కళంకము తెచ్చెను. ఆభారము మన చేతిలో నుంచినచో మనము వారిని తరిమివేసి యుందుము" అనిరి.

ఒకబంగాళీవచ్చినాతో, "మహాశయా, ఘూర్కాలు వారిఅధికారముల నన్నిటిని వారు పొందినను వారికోపమును తగ్గించుటలేదు. వారు ఆంగ్లేయులను విస్తారముగ దూషణచేయుచున్నారు" అని చెప్పెను. "వారికి నాయకుడు లేడు. వారు అధికారిలేని యుద్ధభటులు. వారి యిష్టమువచ్చినట్లు పేలనిమ్ము. త్వరలో సర్వమును చల్లారును." అని నేనంటిని. కాని దొరలు భయకంపితులైరి. ఘూర్కాలు సిమ్లా నాక్రమించుకొనిరి కావున, పలాయనముతప్ప ప్రాణరక్షణ మార్గ మన్యము లేదని నిరాశచెంది ప్రాణముల దక్కించుకొనుటకు సిమ్లానుండి పలాయితులగుటకు నిశ్చయించుకొనిరి. మట్టమధ్యాహ్న సమయమున అనేకమంది దొరలు, సవారి, గుఱ్ఱము, పరివారము ఏమియులేకయే పర్వతముక్రిందికి భయకంపితులై పరుగిడ నారంభించిరి. ఒకరినిగూర్చి యోచించుటకుగాని ఒకరికి సహాయము చేయుటకుగాని ఎవరికిని అవకాశములేదు. అందరును ఎవరి క్షేమమును గూర్చివారే ఆతురము చెంది యుండిరి. సంధ్యాసమయము లోపల సిమ్లా అంతయు జనశూన్యమై యుండెను. ఇంతవరకును మనుష్యసంకీర్ణమై కలకలలాడుచుండిన సిమ్లా ఇప్పుడు నిశ్శబ్దమై యుండెను. సిమ్లాయొక్క విశాలాకాశమంతయు కేవలము కాకులమూకలయొక్క "కావు, కావు"లతో నిండి యుండెను.

సిమ్లా మనుష్యశూన్యమై యుండుటచే నేనును ఈదినము వెడలి

పోక తప్పదు. ఘూర్ఖాలు మాకేయత్యాచారము చేయకపోయి నను కొండవాండ్రువచ్చి సమస్తమును దోచుకొని పోదురు. కాని ఆనాడు నాకు బోయవాండ్రెట్లు దొరుకుదురు? సవారివాండ్రు దొరకకుం డినచో సిమ్లానుండి కాలినడకనైనను పారిపోవలెనన్న భయము మాత్రము చెందలేదు. ఈయవస్థలో నావద్దకు చింతనిప్పులవలె నెఱ్ఱగనున్న కండ్లుగలిగి, పొడగరియైన ఒకనల్లని పురుషుడు నావద్దకువచ్చి, "కూలి వాండ్రు కావలెనా"? అని అడిగెను. "ఔను, కావలెనం"టిని. "ఎంద రు" అని అతడడిగెను. ఇరువదిమంది కావలెనంటిని. "సరే, తీసికొని వచ్చెదను, నాకుమాత్రము బహుమతి యివ్వవలెను," అనుచు అతడు వెడలిపోయెను. ఈలోగా నేనొకడోలీ కుదిర్చికొంటిని. రాత్రిభోజనా నంతరమున ఉద్విగ్నచిత్తముతో శయనించితిని. రాత్రి రెండు జాము లయ్యెను. "తలుపు! తలుపు! అని కేకలిడుచు నెవరో తలుపు తట్టిరి విశేష కోలాహలము కాజొచ్చెను. నాహృదయము కంపించెను. విశేష భయమయ్యెను. ఇప్పుడింక ఘూర్ఖాల హస్తములో మరణము తప్ప దనుకొంటిని. భయముచే వణకుచు తలుపు తెరచితిని. చూడగా నాపొడవైన మనుష్యుడు 20 మంది కూలీలతోవచ్చి గోలచేయుచుం డెను. ఇకనాప్రాణములగూర్చి భయము పోయెను. వారు నాకురక్షకు లుగా రాత్రియంతయు నాగదిలోనిద్రించిరి. ఈశ్వరునకునాయందున్న అపారకరుణ ఇందులో పూర్తిగా విశదమయ్యెను.

ప్రభాతమయ్యెను. సిమ్లాను వదలుటకు సంసిద్ధుడనైతిని. కూలి ముందుగా యిచ్చినగాని కూలీలు బయలుదేరమనిరి. వారికి సొమ్ము నిచ్చుటకు 'కిశోరీ, కిశోరీ' యని పిలచితిని. కాని కిశోరీ యెక్కడ? చిల్లరఖర్చుకై సొమ్ము అతని వద్దనుండెను. ఖజానాపెట్టె నావద్దనుం డెను. కాని అంతసొమ్ము కూలివాండ్రకు కనబడనీయకూడదని భావిం చితిని. కిశోరి లేడు. సొమ్మివ్వనిదే కూలీలు కదలరు. నేనప్పుడువారి

సమ్ముఖముననే పెట్టె తెరచి ఒక్కొక్కనికి 3 రూపాయిలిచ్చితిని. ఆసర్దారుకు 5 రూపాయిలు పురస్కారమిచ్చితిని. ఈసమయములో కిశోరి వచ్చెను. "ఈసంకటసమయములో నీవిందుండి ఏల పోతివి?" అని అడిగితిని. "ఒకదర్జీవాడు నాబట్టలు కుట్టినందుకు నాలుగణాలు ఎక్కువడిగెను. బేరము కుదుర్చుసరికి ఆలస్యమయ్యెనని ఆతడు చెప్పెను.

డోలీనెక్కి 'డాగ్సాహీ' (Dagshahi) యను నొకకొండపైకి బయలువెడలితిని. దినమంతయు పయనముచేసిన వెనుక సూర్యాస్తమయ సమయమున నన్నొక ప్రస్రవణమువద్ద దింపి కూలీలు నీరు త్రాగి, కూర్చుండి, పరస్పర సంభాషణము, హాస్యపరిహాసములు చేసికొననారంభించిరి. వారుమాట్లాడుదానిలో ఒక్కముక్కయైనను నాకర్థము కాకుండుటచే వారునన్ను చంపి నాసొమ్మంతయు తీసికొనుటకు ప్రయత్నించుచున్నారని భావించితిని. వీరు ఈనిర్జనారణ్యములో ఈకొండపైనుండి నన్ను క్రిందికి పారవేసినచో ఎవ్వరును కనుగొనజాలరు కదా! కాని యిదంతయు కేవలము నామనస్సు యొక్క వృథాసంకోచము. వారు నీరుద్రావి, కొంచెము బలము తెచ్చుకొని తిరిగి బయలుదేరి, అర్థరాత్రికి నన్నొక బజారులో దింపిరి. ఆరాత్రి అచట గడపిన పిమ్మట నేను మరల బయలుదేరితిని. నా జేబులోని రూపాయీలు,కొన్ని విడిడబ్బులు పక్కమీద పడిపోయెను. కూలివాండ్రవన్నియు నేరి నాకు దెచ్చియిచ్చిరి. ఇందువల్ల వారిపై నాకు విశేషవిశ్వాసము జనించెను.

మధ్యాహ్నమునకు డాగ్సాహిచేరితిమి. అక్కడ నన్నొక పెంకుటింటివద్ద దింపి కూలీలు పోయిరి. సంధ్యాసమయమునకు కిశోరి వచ్చెను. నివసించుటకొక పాడుపడిన గదియు, పరుండుటకొక నులకమంచము నాకు దొరకెను. దీనితో రాత్రి కాలక్షేపము చేసితిని. ఉదయముననే లేచి పర్వత శిఖరమునకు పోతిని. ఖాళీ సారాయపు పెట్టెలు(Wine Boxes) చుట్టును గోడవలె పేర్చి ఆంగ్లేయసైనికులు

అచ్చటనొక చక్రాకృతిగల కోట నిర్మాణము చేసిరి. దానిమధ్య నొక పతాక మెగురుచుండెను. క్రిందనొక సోల్జరు ఖడ్గము చేతబూని నిలబడి యుండెను. నేను నెమ్మదిగా ఆపెట్టెల గోడనెక్కి లోపల ప్రవేశించి అతిభయముతో ఆసోల్జరువద్దకు పోతిని. ఆకత్తి నాపై దూయునే మోయని భావించితిని; కానియతడు అతివివర్ణముఖముతో ఘూర్కాలిట్లు వచ్చుచున్నారా ఏమి?" అని అడిగెను. "లేదు, వారింకను ఇచటకురాలేదు, "అని ప్రత్యుత్తరమిచ్చి అందుండి వెడలివచ్చి ఒకచిన్న గుహను కాంచి తన్మధ్యమున, ఛాయలో కూర్చుంటిని. సంధ్యాకాలమున పర్వతముదిగి నాగదిలో నిద్రించితిని. ఆరాత్రి కొంచము వర్షముకురిసెను. ఆగది వాననుండి నన్ను కాపాడలేకపోయెను. శిథిలమైయున్న ఆగది కప్పునుండి నీరు కారుచుండెను.

ఈప్రకారముగా, అరణ్యావాసములో రాత్రింబగళ్లు గడచిపోవుచుండెను. కాబూలు యుద్ధమునుండి తిరిగి వచ్చిన ఇద్దరు బంగాళీలు, బోసు, ఘోషు అనువారు ఇచట తపాలాకచేరిలో నుద్యోగము చేయుచుండిరి. వారునన్ను చూచుటకువచ్చిరి. బోసు, "కాబూలు యుద్ధమునుండి కష్టముతో ప్రాణములు దక్కించికొని వచ్చితిని. అపుడు నేను పలాయనమై వచ్చుచుండగా మార్గమున నొక శూన్యగృహము గాంచితిని; దానిలో ప్రవేశించి అటకపై దాగికొనియుంటిని. కాబూలీలు నన్నచటగాంచి, కొంచ మించుమించుగా నాప్రాణములను తీసిరి. బహుకష్టముతో నెట్లో ప్రాణములతో బయటపడితిని. ఇక్కడ మరల ఈవిపత్తు సంభవించినది" అనెను. నేనిక్కడ నున్నంతకాలము ఘోషు అనుదినమును వచ్చి నాయోగక్షేమము లారసి పోవుచుండువాడు. ఒకనాడతనితో "ఘోష్, ఈదినమున వార్తలేమి?" అని అడిగితిని. నేడు విశేషములేమియు మంచివి కావు. విద్రోహులు తపాల్సంచులను పట్టుకొని కాల్చివేసిరి" అనెను. మరుసటిదినము తిరిగి వార్త

లడిగితిని. "నేమను మంచివార్తలేమియు లేవు. జలందరునుండి విద్రోహులు నేడురావచ్చును" అనెను. ఘోషువద్దనుండి ఎన్నడును సద్వార్తమానము రాలేదు. అతడు ప్రతిదినమును ముఖము వ్రేలవేసికొని వచ్చుచుండువాడు. ఈరీతిగ అతికష్టముతో నేనచట పదునొకండు దినములు గడపితిని. అటుపిమ్మట, సిమ్లా నిర్విఘ్నమై యున్నదనియు, ఇంకేమియు భయములేదనియు సమాచారములు తెలిసెను. తిరిగి సిమ్లాకు పోవుటకు ఏర్పాటులు కావింప నారంభించితిని. కూలీలకొరకు కబురుపంపగా ఎవ్వరును లేరనివింటిని. కలరాభయముతో వీరు పలాయితులైరి. నేనొక గుఱ్ఱమును సంపాదించి దానిపైనెక్కి మధ్యాహ్నము బయలుదేరితిని. కొంతదూరము వచ్చినపిమ్మట రాత్రి ఒకచో మకాముచేసి మరునాడు తిరిగి గుఱ్ఱమెక్కి బయలుదేరితిని. కిశోరి నావద్ద లేడు. ఒకచెట్టైనను తుప్పయైనను లేని ఆపర్వతములపై జ్యేష్ఠమాస రాదోత్తాప మతితీక్ష్ణముగానుండెను. కొంచెము నీడకొరకె నుదురు చూచితిని, గాని నీడనిచ్చుటకు వృక్షమెక్కడ? పిపాసతో కంఠ మెండిపోవుచుండెను; కాని నాగుఱ్ఱము నొక క్షణము పట్టుకొనుట కొక మనిషియైనను దగ్గిర లేడు. ఈయవస్థతో మధ్యాహ్నపర్యంతము పయనము చేసిన పిమ్మట నేనొక బంగాళావద్దకు చేరితిని. చెంతనే గుఱ్ఱమును కట్టివేసి దానిలో విశ్రమించుటకు పోతిని. నేను మంచితీర్థము కుగుచుంటిని. దైవకృమమున నావలెనే పలాయితయైనఒకస్త్రీ అక్కడనుండెను. ఆమెయు సుఃఖమునందుండుటచేనాయందు సానుభూతి చూపి నాకు కొంచెము వెన్నయు ఉడకబెట్టిన బంగాళాదుంపలను, కొంచెము జలమును పంపెను. వీని నారగించినాక్షుత్పిపాసలను నివారణ చేసికొని తెప్పిరిల్లితిని. సంధ్యాసమయమునకు సిమ్లా చేరితిని. గుమ్మము ముందు నిలబడి, కిశోరీ ఇక్కడనున్నాడా అని కేక లిడితిని. కిశోరి వచ్చి తలుపుతెరచెను. డాక్సాహీనుండి సిమ్లాకు జ్యేష్ఠబహుళ తదియనాడు తిరిగి వచ్చితిని.



## ముప్పదియైదవ ప్రకరణము.

—∞∞—

నేను సిమ్లాకు తిరిగివచ్చిన పిమ్మట నొకనాడు కిశోరితో, "నేనొకవారము దినములలో ఇంకను ఉచ్చతరపర్వతభ్రమణమున కుత్తర దిక్కునకు పయనము చేసెదను. నీవు నాతో రావలయును. నాకొరకొక సవారియు, నీకొరకొక గుఱ్ఱమును సిద్ధముచేసి యుంచుము" అంటిని. "చిత్తము" అని కావలసిన ఏర్పాటుల గావించుటకు అతడు పోయెను. సిమ్లాను వదలుటకు జ్యేష్ట బహుళ దశమి దినమును స్థిరపరచి కొంటిని. ఆనాడు పెందలకడనే లేచి బయలుదేరుటకు సిద్ధపడితిని. గుమ్మమువద్ద నాసవారి సిద్ధముగ నుండెను. బోయివాండ్రందరు సిద్ధముగ నుండిరి. "నీగుఱ్ఱమేది?" అని కిశోరి నడిగితిని. "ఇదిగో ఇప్పుడే వచ్చునిదుగో ఇప్పుడే వచ్చున" ని మార్గమువంక ఆతురతతో చూడ నారంభించెను. ఒక గంట గడచెను. కాని అప్పటికిని గుఱ్ఱము జాడ కనబలేదు. నా ప్రయాణమునకు ఆలస్యము, ఆటంకము నేనింక సహింపలేక పోతిని. అధిక శీతలమునకు భయపడి కిశోరికి ఉత్తరమునకు వచ్చుట కిష్టము లేదని కనిపెట్టితిని. "నీవు నాతో రాకుండినచో నేనొంటరిగా పర్వత భ్రమణమునకు పోలేనని నీవూహించుచున్నావు కాబోలు. నీవు నాతో రానక్కరలేదు. నీ విక్కడనే యుండుము. నాతాళము చెవ్వులను నాకిమ్ము" అని తాళము చెవ్వుల నాతని వద్దనుండి తీసికొని, సవారిలో కూర్చుండి, 'సవారి నెత్తుడ' ని బోయవాండ్రతో చెప్పితిని, సవారి యెత్తబడెను. నా సామానులు కూలీలు తెచ్చుచుండిరి. విభ్రాంతుడై, స్తబ్ధుడై కిశోరి నిలబడి యుండెను. నేను ఆనందముతోను, ఉత్సాహముతోను బజారుగుండా పోవుచు, నిటు నటు చూచుచు సిమ్లాను వదలితిని.

రెండుగంటలు ప్రయాణముచేసి మరియొక పర్వతమువద్దకు రాగా దాని పార్శ్వమున నున్న పర్వతమునకు బోవు వంతెన తెగి పోయియుండెను. ఇకముందు మార్గములేదు. బోయవాండ్రు సవారి దింపిరి. యిచ్చట నుండి వెనుకకు పోవలెనా యేమి? కాని బోయవాండ్రు "విరిగిపోయిన వంతెనను పట్టుకొని మీరుమెల్లగా దాటి పోగలరేని మేము కొండదిగి ఖాళీసవారీతో ఆవల ప్రక్కను మిమ్ము కలసి కొందుము," అని చెప్పిరి. నేనట్లు చేయుటకు సాహసించి ఆయుపాయము నవలంబించితిని. నాకప్పుడంత యుత్సాహము గానుండెను. కమ్మీపై నొకపాదముంచుటకు మాత్రము స్థాన ముండెను. చేతులానుకొనుట కిరుప్రక్కలను ఆధారము లేక పోయెను. క్రింద భయానకమైన లోవ యుండెను. ఈశ్వర ప్రసాదము వల్ల నేను దానిని నిర్విఘ్నముగా దాటితిని. ఈశ్వర ప్రసాదమున్నచో "కుంటివాడు సహితము గిరులులంఘింపగలుగున" న్న మాట ముమ్మాటికి వాస్తవము. గావుననే నాపర్వతభ్రమణసంకల్పము వ్యర్థము కాలేదు. అక్కడ నుండి క్రమముగా పర్వతమునెక్క నారంభించితిని. ఆపర్వతము గోడవలె ఏటవాలుగా ఉన్నతముగా నుండెను. దాని శిఖరమునుండి చూడ క్రిందనున్న కేలు వృక్షములు కూడ చిన్న పొదలవలె కాన్పింప జొచ్చెను. చెంతనున్న యొక గ్రామమునుండి వ్యాఘ్రరూపములుగల కుక్కలు కొన్ని మొరుగుచు పరుగులిడెను. ఎదుట భయంకరమైన యీ యున్నత పర్వతము! క్రింద నగాధమగు లోవ! పైన నీభీకర శునకములు! మిక్కిలి భయముతో నీసంకటపథ మును దాటితిని.

అపరాహ్ణమున నొక ఖాళీగానుండిన డాక్‌బంగ్లావద్దచేరి అచట నొకదినము మకాముచేసితిమి. నాతో నెవడు వంటవాడు లేడు. బోయవాండ్రు, "మారొట్టె చాల తియ్యగానున్నద" నిరి. బియ్యపు

పిండి యవలు కలిపి చేసిన ఆరొట్టె నొకటి నేను వారివద్దనుండి తీసి కొంటిని. అందులో నొకభాగము నాడు నాకాహారమయ్యెను. నాక దియే సరిపోయెను. "ఏదో కొంచము కొయ్యరొట్టె ముక్క; అందున్నను నేమి, లేకున్న నేమి? తలయొగ్గిన తర్వాత ఇంక యీ విచారములేల?" కొంతిసేపైన పిమ్మట కొందరు కొండవాండ్రు చెంతనున్న గ్రామమునుండి అంగములు నానాప్రకారములుగా త్రిప్పుచు ఆమోదముతో నృత్యముచేయ సాగిరి. అందులో నొక నికి ముక్కు లేదు. ముఖమంతయు చదునుగానుండెను. నీముక్కట్లున్న దేమి అని నేనతనినడిగితిని. "ఒక భల్లూకము నన్ను ముఖమువీాద కొట్టెను. అదిగో ఆమార్గముననే భల్లూకములు వచ్చుచుండగా నేను దాని కొరకు వెళ్ళితిని. తన పంజాతోనది నాముక్కు ఎదురుగా కొట్టెను." అని ఆతడు చెప్పెను. కాని ఆ వికారపు ముఖముతోనే అతి డెంతయో ఆనందముతో నృత్యముచేసి ఆమోదించుచుండెను. ఆకొండవాళ్ల సరళప్రకృతిచూడ నాకధికప్రీతి కలిగెను.

మరుసటి ప్రాతఃకాలమున ఆస్థలము వదలి మధ్యాహ్నమున నొక పర్వతశిఖరము చేరి అచట నాగితిని. అక్కడి గ్రామస్థులనే కులు వచ్చి నాచుట్టును మూగి కూర్చుండిరి. "మాజీవిత మిచ్చట బహుకష్టపమన్వితము. మంచుకురియు దినములలో సర్వదా మోకాలి లోతు మంచులో నడచిపోవుచుందుము. పంటలకాలములో ఎలుగు గొడ్లు, అడవిపందులు వచ్చి మా పైర్లన్నిటిని నాశముచేయుచుండును. రాత్రులందు మంచెలపై కూర్చుండి పొలములు కాయుచుందుము," అని వారు చెప్పిరి. వారి గ్రామమా కొండలోయలో నుండెను. వారు నాతో "మాగ్రామమునకు రండు. అచ్చట మాయింట సుఖముగా నుండగలుగుదురు. ఇచ్చటనున్నచో మీాకుచాల కష్టముగానుండును" అనిరి. కాని నేనా సంధ్యాసమయమున వారిగ్రామమునకు పోలేదు.

బహుకష్టముతో ఆకొండ నెక్కగలిగితిని. కావున నేను వెళ్ళుట కెంత ఉత్సాహపడినను మార్గము దుర్గమముకదా యని వెళ్ళలేదు. వారిదేశములో స్త్రీలసంఖ్య అతిస్వల్పముగానుండెను. పాండవులవలె వారు అన్నదమ్ములందరు కలసి ఒక్కభార్యనే వివాహము చేసికొందురు. ఆస్త్రీకి పుట్టినసంతానము ఆయన్నదమ్ములందరిని "నాయన" అనియే పిలచుచుందురు.

ఆరాత్రి పర్వతశిఖరముననే ఉండి ప్రభాతమున నేనచటనుండి వెడలితిని. ఆనాడు బోయవాండ్రు మట్టమధ్యాహ్నమువరకు నడచి అచట సవారిదింపి, "ఇంకముందుకు సాగలేము, బాట బాగుగలేదు," అనిరి. ఇంకచేయునదేమి? కొండమిగుల నేటవాలుగానుండెను. కాలిబాటయైన లేదు. మార్గమెంతమాత్రము సరిగా లేదు. పైనచూడ రాళ్ళు గుట్టలు గుట్టలుగా పడియుండెను. కాని మార్గమింత కష్టముగా నున్నను వెనుకకుమాత్రము మరలలేకుంటిని. ఆరాళ్ళమీదినుండియే ఆచెడిపోయిన మార్గముగుండనే మెల్లమెల్లగా నెక్కనారంభించితిని. ఒకడునన్ను నడ్డిదగ్గిర పట్టుకొని వెనుకనుండి సహాయముచేసెను. ఈ విధముగా మూడుగంటలు నడచిన పిమ్మట ఆచెడిపోయిన మార్గము నతిక్రమించితిమి. శిఖరముపైకెక్కగా నొకగృహము కనబడెను. లోపల నొక సోఫా యుండెను. అచటికి వెళ్ళగానే దానిపై పరుంటిని. బోయవాండ్రు గ్రామములోనికి పోయి నాకు గిన్నెడు పాలుతెచ్చి యిచ్చిరి. కాని అధికపరిశ్రమమువల్ల నాయాకలి తప్పిపోయి ఆపాలు త్రాగలేకపోతిని. ఆసోఫామీదనే రాత్రిఅంతయు గడచిపోయెను. ఒకసారియైనను లేవలేదు. ప్రాతఃకాలమునను కొంచము బలము వచ్చెను. బోయవాండ్రు మరియొక గిన్నెడు పాలు తెచ్చియిచ్చిరి. ఆపాలుత్రాగి ఆస్థానమునుండి బయలుదేరితిని. ఇంకను పైకెక్కి ఆదినము "నార్ఖాండా" చేరితిని. ఇది అత్యున్నతమైన శిఖరము. అచ్చట శీతల మధికముగ నుండెను.

మరుచటి ప్రాతఃకాలమున దుగ్ధపానము గావించి పదవ్రిజుడనై బయలు దేరితిని. అనతిదూరముననే యొకనిబిడారణ్యమున ప్రవిష్ఠుడనైతిని. ఏలనన ఆమార్గము అరణ్యామధ్యమునుండి పోవుచుండెను. మధ్యమధ్య ఆవనమును భేదించుకొని రౌద్రకిరణములు చెదరి మార్గమున పడుచుండెను. అందువల్ల వనముయొక్క శోభ మరింతదీప్తి వహించుచుండెను. పోవుచుండగా వనమునందచ్చటచ్చట కొన్ని మహాపురాతన వృక్షములు సమూలముగ నుత్పాటితములై భూమిపై పడియుండుటఁజూచితిని. అనేక తరుణవృక్షములు సహితము దావానలముచే దగ్ధములై అకాలమరణమునొంది పడియుంటగూడ జూచితిని. చాలదూరము నడచినపిమ్మట సవారిలో కూర్చుండి క్రమముగా మరియొకనిబిడారణ్యము ప్రవేశించితిని. పర్వతారోహణము చేయుచు నాయరణ్యములోనికి దృష్టినిగిడ్చగా నందు కేవలము హరితవర్ణమై, ఘనపల్లవావృతమై, యొక్క పుష్పముగాని ఫలముగాని లేక యుండిన మహావృక్షముల జూచితిని. ఒక్క "కేలు" అను వృక్షము మీాద మాత్రము హరితవర్ణమగు ఒకవిధమైన వికారములగు ఫలములుండెను. వీనిని పక్షులుసహితము భక్షింపవు. కాని పర్వతమున కిరుప్రక్కల మొలచియుండిన వివిధతృణలతాదుల శోభమాత్రము అతిచమత్కారముగ నుండెను. వానినుండి ఎన్నిజాతులపుష్పములు ప్రస్ఫుటితములగుచున్నవో గణించుటకు సాధ్యముకాదు. శ్వేత, నీల, కాంచన వర్ణములతో వెలుంగుచు ననేక పుష్పజాతులు ఇటునుండియు అటునుండియు నయనముల నాకర్షించుచుండెను. ఈపుష్పసముదాయము యొక్క సౌందర్యలావణ్యమును వానియొక్క నిష్కళంకపవిత్రతయు జూడగా నాపరమపవిత్రపురుషుని హస్తముయొక్క చిహ్నము వానియందు స్పష్టముగా కనబడెను. వీనిరూపమునకు పోలిన సౌరభము లేదు; గాని ఇంకొకవిధమైన తెల్లగులాబి గుత్తులుగుత్తులుగా వన

నుంతటను పూచి, ఆసమస్తప్రదేశమును సుగంధముతో నింపివేసెను. ఈ తెల్లగులాబులకు నాలుగుపత్రములు మాత్రమే యుండెను. కొన్ని చోట్ల మల్లిపువ్వులు సహితము సుగంధదానము గావించుచుండెను. మధ్యమధ్య కొన్ని ఫలములు* కెంపులవలె నెర్రని దీప్తి వహించి యుండెను. నాతోనున్న భృత్యుడొకడు ఒకవనలతనుండి పుష్పిత మైన శాఖ నొకదానిని కోసి నాహస్తమునం దుంచెను. నే నిదివర కెన్నడును అట్టిసుందరమైన పుష్పలతను చూచియుండలేను. నా నేత్రములు తెరవబడెను. నాహృదయము వికసితమయ్యెను. నేనా చిన్న చిన్న శ్వేతపుష్పగుచ్ఛములపై నావిశ్వజననియొక్క మృదుహస్తమును గాంచగల్గితిని. ఈ వనముమధ్య ఎవ్వరీసమస్తపుష్ప సుగంధము ననుభవించువారు? ఎవ్వరు వానిసౌందర్యము తిలకించువారు? ఐనను ఆమె యెంతప్రేమతో నెంతజాగరూకతతో వాటికి సుగంధమునిచ్చి, లావణ్యమునిచ్చి, శిశిరకణములతో వాటిని సిక్తముగావించి, ఆలతపై నమర్చియుండెను! ఆమెకరుణను, కోమలత్వమును నాహృదయమున ననుభవించితిని. ప్రభో! ఈచిన్నిపుష్పములపై నే నీకింత కరుణయున్నచో మాపైనీకెంత కరుణ యుండవలెను? "నీరుణ నాహృదయము నందును ఆత్మయందును ఎప్పటికిని శాశ్వతమై, స్థిరమై నిలచి యుండును. నా మస్తకము ఛేదింపబడినను, నాహృదయమునుండి మాత్రము నీకరుణ ఎన్నటికిని పోనేరదు; అంతసుస్థిరముగ, నంతగాఢముగ నీప్రేమ నా యాత్మయందు ప్రవేశించినది." †

హాఫీజ్ విరచితమైన యీపద్యమును దినమంతయు దారిపొడుగునను ఉచ్చైస్స్వనమున పఠించుచు సూర్యాస్తమయమువరకును ఆయన

* Strawberries.

† హర్గిజం మెహరతో అజ్ లోహెదిలో జా నరవత్ ।
అమనా మెహరతు అందర్గిలో జా జాయగిరస్ ।
కెగర్ మ్సర్ బెరవద్ మెహరత్ అస్థానరవద్ ॥

కరుణారసమున నిమగ్నుడనైయుండి సాయంకాలమునకు శుంగ్రీయను నొక పర్వతశిఖరము చేరితిని. దినము ఎట్లుగడచిపోయెనో, ఎప్పుడు గడచిపోయెనో, నేనేమియు నెరుగను. ఈయున్నతశిఖరమునుండి పరస్పరాభిముఖములైయున్న రెండుపర్వతశ్రేణులశోభను తిలకించి పులకాంకితుడనైతిని. ఈశ్రేణీద్వయమున నొక పర్వతముపై భల్లూకాది క్రూరజంతువుల కాలవాలమగు యొక నిబిడారణ్యముండెను. మరియొక పర్వతము ఆపాదమస్తకము పక్వగోధుమ క్షేత్రములవల్ల కాంచనవర్ణముదాల్చి విరాజిల్లుచుండెను. అచ్చటచ్చట దూరదూరమున పదిపండ్రెసి గృహములు మాత్రముగల కొన్నిగ్రామములు సూర్యకిరణములవల్ల దీప్తివహించి కాన్పించుచుండెను. కొన్నిపర్వతములు చిన్నచిన్న తృణములతో నాపాదమస్తకము భూషితములైయుండెను. మఱికొన్ని పర్వతములు పూర్తిగ తృణశూన్యములైయుండి సమీపముననున్న వనాకీర్ణపర్వతముల శోభను మరింత యభివృద్ధిగావించుచుండెను. ప్రతిపర్వతమును నిజౌన్నత్యగరిమచే నిశ్శంకగ గంభీరముగ నిలబడియుండెను. కాని యాపర్వతగర్భములందు దిరుగాడు పథికులుమాత్రము సర్వదా రాజభృత్యులకైనడి భయవినయములతో మెలగుచుండిరి. ఒక్కయడుగుదప్పినచో ఆశలేదు. సూర్యుడస్తమించెను. అంధకారము క్రమముగ భువనము నాచ్ఛన్నముగావింపనారంభించెను. ఇంకను నేనాపర్వతశృంగమున నేకాకినై కూర్చుండియుంటిని. దూరమునుండి పర్వతముపై నందందు మినుకు మినుకు మనుచు ప్రకాశించుచున్న దీపములుమాత్రము మనుష్యవాసమచట నున్నట్లు సూచించుచుండెను.

మరునాటి ప్రాతఃకాలమున నావనాకీర్ణపర్వతమును కాలినడకనే నవరోహింపనారంభించితిని. పర్వతారోహణమెంతకష్టమో, తదవరోహణమంత సులభము. ఈపర్వతముపై కేవలము ‘కేలు’ అరణ్యా

ములుమాత్రి ముండెను. కాని వాటినరణ్యములనరాదు. ఉద్యాన వనములను మించియుండెనవి. 'కేలు' వృక్షము దేవదారువలె దీర్ఘము గను, అవక్రముగ నుండును. దానిశాఖలన్నియు నగ్రిభాగమువర కును వ్యాపించియుండును. సరుగుడు చెట్లయాకులవలె యుండు సన్నని సూదులవంటి యాకులచే దట్టముగ నలంకృతములై యుండును. ఒక పెద్దపక్షియొక్క పక్షములవలె ప్రసారితములై, ఘనపత్రావృతములై యున్న యాశాఖలు శీతకాలమందు విశేష హిమభారమును వహించి యుండును. కాని యాపత్రములీహిమముచే జీర్ణించి వడలక మరింత పచ్చబడి పుష్టినొందును. ఎంతటియాశ్చర్యము! ఈశ్వరుని కార్యమేది యాశ్చర్యముకాదు? ఈపర్వతముపైనుండి క్రిందివరకును ఈవృక్ష సముదాయము సైన్యదళమువలె బారులుతీర్చి నిలచియుండెను. ఈ దృశ్యముయొక్క మహత్వసౌందర్యము లేమానవనిర్మితవనమున కుండును? ఈ 'కేలు' వృక్షములకు పుష్పములు లేవు. ఇవి వన స్పతులు; వానిఫలములు చాల నికృష్టములు. కాని వీనినుండి మనకు చాల యుపకారము కలదు. వీటినుండియే తారు బయలుదేరును.

కొంతదూరము నడచినపిమ్మట సవారినెక్కితిని. మార్గమధ్య మున స్నానయోగ్యమగు నొక జలప్రస్రవణమును గాంచి యందలి శీతలతుషారాంబుప్రల స్నానమాడి, నూతనస్ఫూర్తివహించి బ్రహ్మో పాసన గావించుకొని పవిత్రుడనైతిని. మార్గమున నొక మేకలయొ క్కయు, 'ఓబీల'* యొక్కయు మందపోవుచుండెను. సవారిబోయి యొకడొక మేకను పట్టితెచ్చి 'దీనినుండి మనకు పాలుదొరకును' అనెను. దానినుండి యొకపావుసేరు పాలు లభించెను. ఉపాసనానం తరమునవే నాకుమార్గమధ్యమున నామామూలుప్రకారమా దుగ్ధము లభించినందుకీశ్వరునకు ప్రణామము లాచరించి వానిని ద్రావితిని.

---

* హిమాలయపాంతములందుండు నొకజాతిమృగము.

"సకలజీవులకును దాతవు నీవన్న సంగతి నేనెన్నడును మరువకుందును గాక!" పిమ్మట మరల కాలినడక ప్రారంభించితిని. వనాంతమున నొకగ్రామమును సమీపించితిని. మరియొకసారి యచ్చట పక్వగోధుమాదిక్షేత్రముల జూచి ప్రహృష్టాంతరంగుడనైతిని. మధ్యమధ్య గసగసా * పొలములుండెను. ఒకచో స్త్రీలు ప్రసన్న భావముతో పక్వ సస్యముల గోయుచుండిరి. మరియొకచో కృషకులు భావిఫలాపేక్షతో పొలముల దున్నుచుండిరి. ఎండగా నుండుటచే తిరిగి సవారీయెక్కి పోయి మధ్యాహ్నసమయమునకు 'బోఆలీ' (Boali) అను నొకపర్వతమును చేరితిని. ఇది 'శుంఫ్రీ' కన్న చాలక్రిందుగ నుండెను. ఈపర్వత పాదముననే 'నగరి' యను నదియును, చెంతనే మరియొక పర్వత పాదమునుండి 'శతద్రి' (Sutlej) నదియును ప్రవహించుచుండెను. 'బోఆలీ' పర్వతశిఖరమునుండి చూడ 'శతద్రి' నది యొక గజము వెడల్పున్నట్లు గాన్పించెను; అందలిజలము సూర్యకిరణములందొక రజితపత్రమువలె తళుకుతళుకు మనుచుండెను. ఈనదీతీరమున 'రాంపూర్' అను నొకపట్టణముండెను. దీని ప్రసిద్ధియేమనిన, నీప్రాంతము నందలి పర్వతములన్నిటికినధీశుడైన రాజునకిది రాజధాని. 'రాంపూర్' ప్రతిష్టితమైయున్న పర్వతము సమీపముననే గాన్పించుచుండెను. గాని యచటకు పోవుట కనేక నిమ్న పథముల దాటి పోవలెను. ఈ రాజు 25 వత్సరముల ప్రాయమువాడు; ఇంచుక ఆంగ్లభాషాపరిచయముకూడ గలదు. 'రాంపూర్'నుండి, భజ్జీరాణా (Rana of Bhajji) యొక్క రాజధానియగు 'సోహినీ' (Sohini) పట్టణముగుండా ప్రవహించి, దిగువనున్న 'బిలాస్‌పూర్' Bilaspur) వద్ద పర్వతములను వదలి, పంజాబులో ప్రవేశించి ప్రవహించును.

---

* నల్లమందు పండించు పొలములు.

గతదినమున 'శుంఫ్రీ'నుండి క్రమముగ దిగి 'బోఆలీ'కి వచ్చితిని. నేడును అట్లే ప్రాతఃకాలమున ఇచ్చటనుండి అవరోహణగావించి అపరాహ్ణమున నగరినదీతీరమును చేరితిని. మహావేగవతియు స్రోతస్వతియునైన యీనది స్వీయగర్భమునదాల్చిన మదకరుల బోలిన ప్రస్తరఖండముల డీకొని రోషపూరితమై, ఫేనమయమై, గంభీరశబ్దముతో సర్వనియంతశాసనము ననుసరించి సముద్రసమాగమునకు పోవుచుండెను. ఉభయతీరములనుండి రెండుపర్వతములు, మహాప్రాచీరములవలె విశేషౌన్నత్యమునకులేచి వెనుకప్రక్కకువాలుచుండెను. సూర్యకిరణములు చాలసేపిచట నిలచియుండుటకు చోటులేదు. ఈనదిపైన నొక సుందరమగు సేతువుండెను. దీనిమూలముననే నానదియావలియొడ్డును చేరి శుభ్రముగ నున్న యొక్క చిన్న బంగాళాయందు విశ్రమించితిని. ఈలోవ మిగుల రమ్యముగను, ఏకాంతముగ నుండెను. దశక్రోశములమధ్య నెక్కడను ఒక్కమనుష్యుడుగాని గ్రామముగాని లేదు. ఒకమనుష్యుడుమాత్రము ఒకగదిలో తన భార్యాపుత్రులతో నిచట నివసించుచుండెను. దానిని గదియనికూడ చెప్పవీలులేదు. అది పర్వతములోని యొక గహ్వరము. ఇచటనే వారి వంటయు నిద్రయును. ఆతనిభార్య యొకశిశువును వీపుపై పరుండబెట్టుకొని ఆహ్లాదముతో నృత్యము చేయుచుండెను. ఇంకొకబిడ్డ పర్వతముపై నపాయకరమగు నొకస్థలమున నవ్వుచు గంతులు వేయుచుండెను. తండ్రియొక చిన్న పొలమున బంగాళాదుంపలు నాటుచుండెను. ఇచ్చట వారిసౌఖ్యమునకు వలయునదంతయు నీశ్వరుడు సమకూర్చియుండెను. సింహాసనాసీనులగు రాజేంద్రులకుగూడ నిట్టి శాంతి సౌఖ్యములు దుర్లభములు.

సాయంకాలమున నేనీ నదీసౌందర్యముచే మోహితుడనై, ఏకాకినై దాని తీరమున నొంటిగ విచరణగావించుచుంటిని. అకాత్తుగ పైకి

చూచుసరికి పర్వతము దీపమాలాశోభితమై యుండెను. సాయంకాల మవసానమై రాత్రి యభివృద్ధి నొందిన కొలదియు నాయగ్ని మరింత వ్యాపింప దొడగెను. పైనుండి అగ్నిబాణములవలె, నక్షత్రవేగ ముతో, శతసహస్రసంఖ్యాకములగు విస్ఫులింగములు పతనము నొంది నదీతీర పర్యంతము వ్యాపించియున్న వృక్షసముదాయమునకు ఆక్రమణ గావించెను. క్రమక్రమముగ నొక్కొక్కటిగ నావృక్ష సముదాయమంతయు స్వీయరూపమును పరిత్యజించి అగ్నిరూపమును ధరించెను. ఆస్థానమునుండి అంధతిమిరము బహుదూరము పలాయన మయ్యెను. అగ్నియొక్క ఈ అపరూప రూపమును చూడగ చూడగ, అగ్నిలో నివసించు నాదేవత యొక్క మహిమానుభవము చెంద నారంభించితిని. ఇంతకు పూర్వము నేననేక వనములందు దావానల నిదర్శకములగు దగ్ధ వృక్షముల ననేకములజూచితిని. రాత్రి వేళల, దూరస్థములగు పర్వతములందు ప్రజ్వలించుచుండిన అగ్ని యొక్క శోభను దర్శనము గావించితిని. కాని ఇచ్చట దావానలము యొక్క ఉత్పత్తి, వ్యాప్తి, ఉన్నతి. నివృత్తి అంతయు ప్రత్యక్షముగ జూచి నేను మిక్కిలి ఆహ్లాదము నొందితిని. రాత్రియంతయు నీదావా నలము జ్వలించుచుండెను. రాత్రి మెలకువ వచ్చినపుడెల్ల దాని యొక్క ప్రకాశమును జూచుచుంటిని. ప్రాతఃకాలమున లేచి చూచు సరికి అనేక దగ్ధవృక్షములనుండి ధూమము వెడలి వచ్చుచుండెను. ఉత్సవరజనీప్రభాత కాలమున అవశిష్టదీపకాంతులవలె మధ్య మధ్య నా సర్వనాశంకరమగు దావానలము మ్లానమై, అవసన్నమై జ్వలించుచుండెను.

నేనుపోయి నదిలో స్నానముచేసితిని.ఒకయిత్తడి చెంబుతో నీళ్లు శిరస్సుపై బోసికొనుచుంటిని. ఆజల మతిశీతలముగ నుండెను. శిర స్సునందలి మెదడు ఘనీభవించిపోవునా యనునట్లుండెను. స్నానము,

ఉపాసన అయినపిమ్మట కొంచము దుగ్ధము పానముచేసి యాస్థలమును వదలి వెళ్ళితిని. ప్రాతఃకాలమున మరలనిక్కడనుండి ఆరోహణ గావించి రెండుజాములవేళ 'దారుణఘాట్' అనునొక దారుణ ఉన్నత పర్వత శిఖరమున నుపస్థితుడనైతిని. సమ్ముఖమున మరియొక దారుణ ఉన్నతపర్వతశృంగము తుషారావృతమై, ఉద్యతవజ్రమువలె నీశ్వరుని మహాద్భయమహిమ నున్నతముఖముతో ఘోషించుచుండెను.

ఆషాఢశుద్ధ పాడ్యమినాడు దారుణఘాట్‌న నుపస్థితుడనై సమ్ముఖస్థితతుషారావృతపర్వతశృంగముపై నాశ్లిష్టమేఘావళినుండి తుషారవర్షము కురియుట జూచితిని. సిమ్లావాసులకు సహితము ఆషాఢమాసమున తుషారవర్షము ఆశ్చర్యకరము. ఎందువల్లననగా చైత్రమాసము ముగియకపూర్వమే సిమ్లాంపర్వతము తుషారజీర్ణవస్త్రము పరిత్యజించి వైశాఖమాసమున మనోహర వసంతాంబరముల ధరించును. ఆషాఢశుద్ధ విదియనాడు ఈపర్వతము నవరోహణ చేసి 'శిరహాన్' అను మరియొక పర్వతమున నుపస్థితుడనైతిని. ఇచట రాంపూర్ రాణాకు చెందిన గృహమొకటి యుండెను. గ్రీష్మకాలమున రాంపురమున నుత్తాప మధికమయినప్పుడు, శీతలవాయుసేవకై రాజు ఇక్కడకు వచ్చుచుండును. పర్వతతలములందు గ్రీష్మకాలములో మన దేశములందు కంటెను ఉత్తాప మధికముగ నుండును. పర్వతశిఖరములందు మాత్రమే ఎల్లపుడును శీతల వాయువుండుట.

ఆషాఢ శుద్ధ చతుర్థినాడు ఇచటనుండి బయలువెడలి, శుద్ధ త్రయోదశినాడు ఈశ్వరప్రసాదమువల్ల నిర్విఘ్నముగ నా సిమ్లా ప్రవాసగృహమున మూయబడియున్న ద్వారము కడకు వచ్చి తలుపు తట్టితిని. కిశోరి తలుపు తెరచి సమ్ముఖమున నిలువబడెను. "ఏమి, నీముఖమిట్లు నల్లబడినది?" అని అడిగితిని. అతడు, "నేనిన్నాళ్ళ

నుండియు నిక్కడ నుండలేదు. ఎప్పుడు మీయాజ్ఞను మీరి మీతో రాలేక పోతినో, అప్పుడే యనుశోచనతోడను, అనుతాపము తోడను ఒక్కసారి వ్యాకులుడ నైపోతిని. ఇంక నిచ్చట నుండజాలక పోతిని. పర్వతమునుండి క్రిందికి దిగి 'జ్వాలాముఖి' చేరితిని. అచ్చట 'జ్వాలాముఖి' యొక్క దావానలతాపమువల్లను, సూర్యుని జ్యేష్ఠ మాస రౌద్రమువల్లను నుల మల మాడితిని. అందుచే నేనిచటకు తిరిగి వచ్చుసరికి నాముఖము నల్లబారి యుండెను. నాకిది తగిన ప్రతిఫలము. నేను మీయడల విశేషాపరాధము జేసితిని. ఇంక తమ వద్ద నన్నుండనిచ్చెదరను ఆశలేదు," అనెను. "నీకు భయము లేదు. నిన్ను క్షమించెదను. నావద్ద నిదివరకెట్లుంటివో ఇటుమీదట నట్లే యుండుము," అని నేను హసించుచు పల్కితిని.

"నేను క్రిందికిపోయి నప్పుడొక నౌఖరు నిచటనుంచి పోతిని. వచ్చిచూచుసరికి అతడు పలాయితుడై యుండెను. తలుపులన్నియు మూయబడి యుండెను. తలుపులు తెరచి ఇల్లు ప్రవేశించితిని. మన వస్త్రములు, పెట్టెలు ఎక్కడి వక్కడయుండెను. అతడేమియు పట్టు కొని పోలేదు. నేను మూడు దినముల క్రితముమాత్రమే ఇక్కడకు వచ్చియుంటిని" అని అతడు చెప్పెను. ఈసంగతి విని ఉలికిపడి లేచి తిని. నేనిక్కడకు మూడు దినముల క్రితము వచ్చియుండినచో చాల యిబ్బంది పడియుండెడివాడను. ఈ యిరువది దినములనుండి పర్వత భ్రమణమునందు నాశరీరము ననేక భౌతికవిపత్తులనుండి ఎన్ని సారులో రక్షించుచు, నామనస్సునకు ధైర్యము, సహిష్ణుత, వివేకము, వైరాగ్యము మొదలగు ఉచ్చతర పాఠములు గరపించుచు ఆయన సహవాససుఖముచే నాఆత్మను ఎంతయో పవిత్రతయు, జౌన్నత్య మును ఒడగూర్చుచున్నందులకు ఈశ్వరునందు కృతజ్ఞత నాహృద యము భరింపలేక పోయెను. నేనాయనకు భక్తిభావముతో ప్రణా మముగావించి గృహము ప్రవేశించి ఆయన ప్రేమగానము గావింప నారంభించితిని.



## ముప్పదియారవ ప్రకరణము.



ఇప్పుడు హిమాలయములందు వర్షఋతువు ప్రారంభమయ్యెను. ఈశ్వరుని జలయంత్రములు దివారాత్రములు తిరుగ జొచ్చెను. చిరకాలము నేను మేఘముల నూర్ధ్వమున జూచుచుంటిని. ఇప్పుడు అధంతనపర్వతపాదములనుండి శ్వేతబాష్పమయమేఘములు లేచుచుండుట నిక్కడ గాంచితిని. ఇది చూచి నేనాశ్చర్యము నొందితిని. క్రమక్రమముగ నవి పర్వతమును శిఖరపర్యంతము ఆచ్ఛన్నము గావించెను. పూర్వఋషిభావకల్పితమగు మేఘావృత ఇంద్రసామ్రాజ్యమును నేను ప్రత్యక్షముగ నచట గాంచితిని. క్షణకాలములో వర్షము కురిసి మేఘములు పరిష్కారములయ్యెను. మరల పర్వతములనుండి దూదిపింజలవలె మేఘములు లేచి సర్వమును ఆచ్ఛన్నము గావించెను. వెంటనే వర్షము కురిసి మరల సూర్యుడు ప్రకాశించెను. ఈవిధముగ ఈశ్వరుని జలయంత్రములు దివారాత్రములు పనిచేయ జొచ్చెను. శ్రావణమాస ఘోరవర్షములందు ఒక్కపక్షమంతయు సూర్యదర్శనముండదు. సమస్తమును మేఘావృతమైయుండును. సృష్టియందంతటను నేనును నాచెంత నీశ్వరుడు దక్క మరెవ్వరును లేరనునట్లు దోచును. అప్పుడు సహజముగ నామనస్సు సంసారమునుండి విడుదలమై, నా యాత్మ సమాహితమై పరమాత్మయందు విశ్రామమునొందెను. భాద్రపదమాసములో హిమాలయముల జటాజూటముల మధ్య జలకల్లోలము విషమకోలాహలము సలుపుచుండెను. దాని ప్రస్రవణములన్నియు పరిపుష్టిగ నుండెను. నిర్ఝరములన్నియు ప్రముక్తములై యుండెను. మార్గములన్నియు దుర్గమముగ నుండెను. ఇక్కడ ఆశ్వయుజ మాసములో శరత్కాల వికాస మెంతమాత్రమును లేదు. కార్తిక మాసమునుండియు అనావృతశరీరములను శీతలవాయువులు వణకించుచుండెను.

మార్గశిర మాసము సగము సాగిన పిమ్మట నొకప్రాతఃకాలము నిద్రనుండి లేవగనే బయటకు రాగా పర్వతము పాదమునుండి శిఖర మువరకు మంచుతో నావరింపబడి సర్వమును శ్వేతముగా నుండుట ఉత్ఫుల్ల నేత్రములతో తిలకించితిని. గిరిరాజు శుభ్రరజతవస్త్రము ధరించెను. తుషారశీతలవాయునిశ్వాసము నేనిదే ప్రథమమున ననుభవించితిని.

కాలము గడచిన కొలదియు శీతల మధికము కాజొచ్చెను. ఒక దినము కారుమేఘములనుండి ఒడికిన దూదిపింజెలవలె మంచు పడు చుండుట గాంచితిని. ఇదివరలో ఘనీభవించిన మంచుగడ్డను మాత్రము చూచియుండుటచే అదియును మంచుగడ్డవలె భారముగను కఠిన ముగ నుండునని భావించితిని. కాని యిప్పుడు చూడగ నది ఉన్నివలెనే పలుచగను తేలికగ నుండెను. వస్త్రము దులిపినచో మంచు పడి పోగలు వస్త్రము యథాప్రకారముగ పొడిగనే యుండును. పుష్య మాసము నందొకదినము ప్రాతఃకాలము లేచి చూడగ రెండు మూడ డుగుల యెత్తు మంచుపడి మార్గములన్నిటిని అటంకపరచెను. కూలీలు వచ్చి ఆమంచును బద్దలకొట్టి దారిచేసిరి. అప్పుడుప్రజలు తిరిగి నడువ సాగిరి. నేను కౌతూహలావిష్టుడనై ఆమంచుమీదనే నడువసాగితిని. నాప్రాతఃకాల విహారము మానలేదు. స్ఫూర్తితోను ఆనందముతోను నేనెంతయో దూరము, ఎంతయో వేగముగ నడచితిని. ఆ శీతకాల హిమమునందు నేను గ్రీష్మము ననుభవించితిని. అడుగున ధరించిన దుస్తులు చమటతో తడిసిపోయెను. ఆకాలమునందలి నాబలమునకును ఆరోగ్యమునకును ఇది చిహ్నముగ నుండెను. ప్రతిదినము ప్రాతఃకాల మునందు నేనీరీతిగా ఆనందముతో బహుదూరము భ్రమణముచేయు చుంటిని. పిమ్మట తేనీరు, క్షీరము నారగించుచుంటిని. రెండుజాముల వేళ స్నానము చేయునపుడు మంచునీళ్ళను నేను స్వహస్తములతో

శిరముపై పోసికొనుచుంటిని. అప్పుడు ఒక్క నిమిషము నాహృదయ శోణి ప్రవహించుట మాని మరుక్షణమున ద్విగుణము గావింపబడిన వేగముతో ప్రవహించి నాశరీరమందు సమాధిక తేజస్స్ఫూర్తులు సంచరింపజేయుచుండెను. పుష్య మాఘమాసముల శీతలమునంను సహితము నేను గృహమునందు అగ్ని జ్వలింపచేయ నివ్వకుంటిని. శీతలమును ఎంతవరకు శరీరము సహింపగలుగునో పరీక్షించుటకును తితీక్ష, సహిష్ణుత అభ్యసించుటకును నేనీ నియమము నవలంబించుచుంటిని. రాత్రిలందు నేను నాశయ్యాగృహము తలుపులు తెరచి యుంచెడివాడను. రాత్రియొక్క ఆశీతవాతము నేను మిక్కిలి ప్రేమించుచుంటిని. కంబళి కప్పుకొని ప్రక్కపై కూర్చుండి సమస్తమును మరచి అర్ధరాత్రి పర్యంతము బ్రహ్మగీతములు, హాఫీజ్ విరచిత పద్యములు పాడుచుండెడి వాడను. మేల్కొని యుండగలిగినవాడు యోగి. భోగియు రోగియు ఎక్కడ మేల్కొని యుండగలరు? "బ్రహ్మజ్ఞాని, బ్రహ్మధ్యాని, బ్రహ్మానందరసపాని—బ్రహ్మమును ప్రేమించువాడు ఎవ్వడో—అతడే మేల్కొని యుండువాడు."

"ఏదీపము రాత్రిని పగలుగా మార్చునో ఆదీపమెవ్వరిగదిలో నున్నది?

అయ్యది నాహృదయమును దగ్ధము గావించినది. మఱివరికి అది ఆనందము నొనగూర్చినది?"*

ఏరాత్రిలందాతని సహవాసము నెక్కువగ ననుభవించితినో అప్పుడు మత్తుడనై అతి ఉచ్చస్వరముతో నిట్లనువాడను.

* "చిరాగె ఆం కి వస్తె ఐబ్ అఫ్‌రోజ్ జొకాషానైకీస్‌।
జానెమా సూఖ్త్ బపుర్సీద్ కెజానానైకీస్॥"

"హాఫీజ్"

మార్గశిర మాసము సగము సాగిన పిమ్మట నొకప్రాతఃకాలము నిద్రనుండి లేవగనే బయటకు రాగా పర్వతము పాదమునుండి శిఖరమువరకు మంచుతో నావరింపబడి సర్వమును శ్వేతముగా నుండుట ఉత్ఫుల్ల నేత్రములతో తిలకించితిని. గిరిరాజు శుభ్రరజతవస్త్రము ధరించెను. తుషారశీతలవాయునిశ్వాసము నేనిదే ప్రథమమున ననుభవించితిని.

కాలము గడచిన కొలదియు శీతల మధికము కాజొచ్చెను. ఒక దినము కారుమేఘములనుండి ఒడికిన దూదిపింజెలవలె మంచు పడుచుండుట గాంచితిని. ఇదివరలో ఘనీభవించిన మంచుగడ్డను మాత్రము చూచియుండుటచే అదియును మంచుగడ్డవలె భారముగను కఠినముగ నుండునని భావించితిని. కాని యిప్పుడు చూడగ నది ఉన్నివలెనే పలుచగను తేలికగ నుండెను. వస్త్రము దులిపినచో మంచు పడిపోయి వస్త్రము యథాప్రకారముగ పొడిగనే యుండును. పుష్యమాసము నందొకదినము ప్రాతఃకాలము లేచి చూడగ రెండు మూడడుగుల యెత్తు మంచుపడి మార్గములన్నిటిని అటంకపరచెను. కూలీలు వచ్చి ఆమంచును బ్రద్దలకొట్టి దారిచేసిరి. అప్పుడుప్రజలు తిరిగి నడువసాగిరి. నేను కౌతూహలావిష్టుడనై ఆమంచుమీదనే నడువసాగితిని. నాప్రాతఃకాల విహారము మాంచలేదు. స్ఫూర్తితోను ఆనందముతోను నేనెంతయో దూరమును, ఎంతయో వేగముగ నడచితిని. ఆ శీతకాల హిమమునందు నేను గ్రీష్మము ననుభవించితిని. అడుగున ధరించిన దుస్తులు చమటతో తడిసిపోయెను. ఆకాలమునందలి నాబలమునకును ఆరోగ్యమునకును ఇది చిహ్నముగ నుండెను. ప్రతిదినము ప్రాతఃకాలమునందు నేనీరీతిగా ఆనందముతో బహుదూరము భ్రమణముచేయుచుంటిని. పిమ్మట తేనీరు, క్షీరము నారగించుచుంటిని. రెండుజాముల వేళ స్నానము చేయునపుడు మంచునీళ్ళను నేను స్వహస్తములతో

శిరముపై పోసికొనుచుంటిని. అప్పుడు ఒక్కనిమిషము నాహృదయ శోణి ప్రవహించుట మాని మరుక్షణమున ద్విగుణము గావింపబడిన వేగముతో ప్రవహించి నాశరీరమందు సమాధిక తేజస్స్ఫూర్తులు సంచ రింపజేయుచుండెను. పుష్య మాఘమాసముల శీతలమునకు సహి తము నేను గృహమునకు అగ్ని జ్వలింపచేయ నివ్వకుంటిని. శీతల మును ఎంతవరకు శరీరము సహింపగలుగునో పరీక్షించుటకును తితీక్ష, సహిష్ణుత అభ్యసించుటకును నేనీ నియమము నవలంబించుచుంటిని. రాత్రిలందు నేను నాశయ్యాగృహము తలుపులు తెరచి యుంచెడి వాడను. రాత్రియొక్క ఆశీతవాతము నేను మిక్కిలి ప్రేమించుచుం టిని. కంబళి కప్పుకొని పక్కపై కూర్చుండి సమస్తమును మరచి అర్ధరాత్రి పర్యంతము బ్రహ్మగీతములు, హాఫీజ్ విరచిత పద్యములు పాడుచుండెడి వాడను. మేల్కొని యుండగలిగినవాడు యోగి. భోగియు రోగియు ఎక్కడ మేల్కొని యుండగలరు? "బ్రహ్మజ్ఞాని, బ్రహ్మధ్యాని, బ్రహ్మానందరసపాని—బ్రహ్మమును ప్రేమించువాడు ఎవ్వడో—అతడే మేల్కొని యుండువాడు."

"ఏదీపము రాత్రిని పగలుగా మార్చునో ఆదీపమెవ్వరిగదిలో నున్నది?

అయ్యది నాహృదయమును దగ్ధము గావించినది. మరిఎవరికి అది ఆనందము నొనగూర్చినది?"*

ఏరాత్రిలందాతని సహవాసము నెక్కువగ ననుభవించితినో అప్పుడు మత్తుడనై అతి ఉచ్చస్వరముతో నిట్లనువాడను.

* "రహారబ్ ఆం వస్మై షబ్ అఫ్‌రోజ్ జాకాషానైకీస్।
జానెమానూఖ్ బపుర్సీద్ కెజానానైకీస్॥"

"హాఫీజ్"

" నేడు నాసభామండపములోనికి దీపము తీసికొని రావలదు. నేటిరాత్రి ఆపూర్ణచంద్రుడు, నాప్రాణమిత్రుడు ఇచ్చట విరాజమానుడై యున్నాడు. " *

రాత్రులీరీతిగా నానందముతో గడపుచుంటిని. పగటివేళ గభీరబ్రహ్మచింతనలో నిమగ్నుడనై యుంటిని. ప్రతిదినము రెండుజాములవరకు నేను దృఢఆసనబద్ధుడనై ఏకాగ్రచిత్తముతో ఆత్మయొక్క మూలతత్త్వాలోచనయందును అను సంధానమునందును ప్రవృత్తుడనై యుంటిని. అవశేషమందు నేనీసిద్ధాంతమునం దుపనీతుడనైతిని. మూలతత్త్వమునకు విరుద్ధమైన భావనలకు మనసునందు స్థానముండదు. అవి ఏమనుష్యునియొక్కయు వ్యక్తిగత సంస్కారములు కావు. అవి సర్వకాలములందును నిర్విశేషముగా సర్వవాదీసమ్మతములు. మూలతత్త్వముయొక్క ప్రామాణికత ఇంకెవ్వరిపై నాధారపడి యుండలేదు. దానికదే ప్రమాణము. అది స్వతస్సిద్ధము. దీనికిదే కారణము. అయ్యది ఆధ్యాత్మికప్రజ్ఞచే ప్రతిష్ఠింపబడినది. ఈమూలతత్త్వముపై నాధారపడి యుపనిషత్తులవ్రాసిన పూర్వఋషులిట్లు వచించిరి :

" ఎవ్వనిద్వారా యీవిశ్వచక్రము భ్రమ్యమానమగుచున్నదో ఆపరమదైవముయొక్క మహిమయిది " †

కొందరు కొందరు పండితులు మోహమునందు ముగ్ధులై ప్రకృతిస్వభావమువల్ల—జడముయొక్క అంధశక్తివల్ల—ఈప్రకాండ జగత్తు చలించుచున్నదని చెప్పుదురు. మరికొందరు ఏకారణమువల్లను కాదు, కాలప్రభావమువల్లనందురు. కాని నేను చెప్పునది—ఎవ్వని

---

* గర్షమా మయారీద్ దరీఁ జమాకే ఇష్షత్ ।
దర్మజ్లీసే మామాహారోహ్దోస్త తమామస్త ॥

"హాఫీజ్"

† "దేవస్యైష మహిమా తు లోకే యేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రం ॥"

ద్వారా ఈవిశ్వచక్రము నడుచుచున్నదో ఆపరమదైవమునదీమహిమ—యని. *

"ఈసమస్తజగత్తును ప్రాణస్వరూపుడగు పరమేశ్వరునుండి నిస్సృతమైనది.

ప్రాణస్వరూపుడగు పరమేశ్వరుని అవలంబనచే నడచుచున్నది." †

"ఈదేవత, ఈవిశ్వకర్మ, ఈమహాత్ముడు సర్వదా లోకుల హృదయములలో సన్నివిష్టుడై యున్నాడు" ‡

ఈమూలతత్వముయొక్క యీఅప్రతిహతసత్యములు ఋషీశ్వరుల పవిత్రహృదయముల ఉచ్ఛ్వాసములు.

సమ్ముఖమందున్న వృక్షమును చూచుచున్నాము, స్పృశించుచున్నాము. కాని ఆవృక్షము ఏ ఆకాశము ( Space ) నందున్నదో ఆయాకాశమును మనము చూడజాలము, స్పృశింపజాలము. కాలానుసారముగ వృక్షమునకు శాఖలు బయలుదేరును, పల్లవములుద్భవించును, పుష్పములు ఫలములు చూపట్టును. ఇదంతయు మనము చూడగల్గుచున్నారము. గాని దానిలోనుండు కాలసూత్రమును చూడజాలకున్నాము. వృక్షము, ఏ జీవనశక్తిప్రభావమువల్ల వేళ్ళనుండి రసమునాకర్షణచేసి తాను పుష్టినొందుచున్నదో, ఏశక్తి దాని పత్రములయొక్క ప్రతినాళమునందును పనిచేయుచుండునో, ఆశక్తిప్రభావమును మనము చూచుచున్నాము. కాని ఆశక్తినిమాత్రము మనము చూడజాల కున్నాము. ఏ విజ్ఞానమయపురుషునివల్ల వృక్షము

* స్వభావమేకే కవయోవదన్తి, కాలస్తథాన్యే పరిముహ్యమానాః ।
దేవస్యైషమహిమాతులోకే యేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రం ॥

† "యదిదంకించ జగత్సర్వం ప్రాణ ఏజతినిఃసృతం ।"

‡ "ఏషదేవోవిశ్వకర్మా మహాత్మా సదాజనానాం హృదయే సన్నివిష్టః"

యీజీవనశక్తిని సంపాదించుచున్నదో ఆతడే ఈవృక్షమునందంతటను ఓతప్రోతముగా నివసించియున్నాడు. కాని ఆయనను మనము చూడ జాలకున్నాము. " ఈగూఢాత్మ సర్వజీవులయందును సర్వవస్తువుల యందును ఉన్నాడు. కాని ఆతడు ప్రకాశితుడగుటలేదు" *

ఇంద్రియసముదాయము బాహ్యవస్తువులను చూచును. అంతర వస్తువులను చూడజాలదు. ఇందిరియసముదాయమునకు సిగ్గుచేటిది.

" స్వయంభువుడగు యీశ్వరుడు ఇందిరియములకు బహిర్ముఖ ముల నిచ్చియున్నాడు. కావునఅవి బాహ్యవస్తువులను చూచుచున్నవి. అంతరాత్మను చూడజాలవు. కొందరు ధీరులు అమృతత్వమును పొంద గోరి, ముదితచక్షువులతో సకలవస్తువులందును అంతర్గతమైన ఒక ఆత్మను గాంచుచున్నారు." †

ఈయుపదేశమును శ్రవణముచేసి, మననముచేసి నిధిధ్యాసన చేసి బ్రహ్మయజ్ఞభూమియగు హిమాలయపర్వతములనుండి నేనీశ్వ రుని దర్శించితిని—చర్మచక్షువులతోగాదు, జ్ఞానచక్షువులతో—. నాకుప నిషత్తులచేనిట్లుపదేశింపబడినది—"ఈశావాశ్యమిదంసర్వం"—ఈశ్వ రునిచే ఈసకలమును ఆచ్ఛన్నము గావింపబడియున్నవి—. నేను యీశ్వరునిచే నీసర్వమును ఆచ్ఛన్నము గావించితిని. " ఇపుడు నేనీ తిమిరాతీత ఆదిత్యవర్ణమహాపురుషుని తెలిసికొంటిని." ‡

" ఇకమీదట నాహృదయమునుండి జ్యోతిని పృథివియందు వ్యాపింపజేసెదను. ఏలనన నేను సూర్యుని పొందితిని. అంధకార మంతరించినది." §

---

* " ఏషసర్వేషు భూతేషు గూఢాత్మాన ప్రకాశతే ॥ "

† "పరాఞ్చిఖానివ్యతృణత్ స్వయమ్భూస్తస్మాత్ పరాన్ పశ్చతి నాన్తరాత్మన్ ।
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్ ఆవృత్తచక్షురమృతత్వమిచ్ఛన్"॥

‡ "వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్యవర్ణం తమసః పరస్తాత్"

§ "బాదజీనూర్ బాఫాఖ్ జహూం అఫ్రోఖ్తేషీమ్ ।
కె బహూన్షిద్ రశిదేం గుబార్ ఆఖిర్ షుద్ " ॥

# ముప్పదియేడవ ప్రకరణము.



మాఘమాసావసానకాలమందు నేను బ్రహ్మచింతలో నిమగ్నుడనై కూర్చుండినప్పుడు ఒక పెద్దమనిషి చేతులకు బంగారు మురుగులు ధరించి నావద్దకు వచ్చెను. నాతో నాయన "నేను భజ్జీ రాణా యొక్క మంత్రిని. వజీరును. రాణాసాహేబ్ తమరిని నిమంత్రణ చేయుటకుగాను నన్నంపినారు. ఆయనకు మిమ్ములను దర్శింపవలెనని కోరికగా నున్నది. ఇక్కడనుండి భజ్జీ అధికదూరములేదు. ఏకష్టము లేకుండ మీరక్కడకు ప్రయాణమొనర్చుటకు నేను తగినఏర్పాటులు గావించెదను" అనెను. నే నాయన నిమంత్రణము స్వీకరించి అక్కడకు పోవు తేదీ నిర్ణయము గావించుకొంటిని. ఆ నిర్దిష్టదినమున వజీర్ వచ్చి నన్ను గొంపోయెను. ఆయన గుర్రముమీదను నేనొక సవారిలోను ఎక్కి సిమ్లానుండి క్రిందనున్న లోయకు దిగుటకు ప్రారంభించితిమి. ఈ దిగుటకు అంతులేనట్లుండెను. ఎంత క్రిందికి వెళ్ళినను ఇంకను క్రిందికి వెళ్ళవలసియే యుండెను. కొంతసేపటికి కొంక నదీతీరమును చేరితిమి. ఇంక క్రిందికి దిగవలసిన అవసరము లేదనుకొంటిని. ఈశతద్రీ నదీతీరముననే రాణాయొక్క రాజధానియైన శోహినీనగరము శోభిల్లుచుండెను. సంధ్యాసమయమునకు మేమచట చేరితిమి.

మరునాటి ప్రాతఃకాలము రాజభవనము ప్రవేశించితిని. అక్కడివారు నన్ను ప్రప్రథమమున రాజగురువు ఆశ్రమమునకు తీసికొనిపోయిరి. ఆశ్రమద్వారము చేరకపూర్వమే రాజగురువైన సుఖానందనాథుడు వచ్చి నన్ను ఆలింగనముచేసికొని స్వాగతమిచ్చి, మేడమీదికి గొంపోయి, తనచెంత కూర్చుండబెట్టుకొనెను. ఢిల్లీలో నాకు పరిచితుడైన సుఖానందు డితడే. ఈయన తనగురువగు హరిహరానందతీర్థస్వామితో రామమోహనుని ఉద్యానవనమునందుండెడివాడు.

ఈయన తాంత్రిక బ్రహ్మజ్ఞాని. ఈయనమతము మహానిర్వాణ తంత్రోక్తమగు అద్వైతము. నేను సిమ్లాలోనుంటిననని విని ఈయనయే రాణాతో నన్నాహ్వానింపుమని కోరెను. నాతో భోజనము నందును పానమునందును వేడుకననుభవింపవచ్చునని అతడుఆశపడెను. పరస్పర సద్భావముతోను సుహృద్భావముతోను అన్యోన్యము బాధింపఁబకుదుమని యూహించెను. నేను మద్యపాన విరత్తుడననియు, నామతములో మద్యపానము ధర్మవిరుద్ధమనియు నాతడెరుగఁడు.

“మద్యమదేయమపేయ మగ్రాహ్యం”—మద్య మొకరి కీయరాదు, పానముచేయరాదు. స్పర్శింపరాదు—.

నేను వారి పానాదికములయందు చేరలేకపోవుటవల్ల వారి యుత్సాహమును, ఆమోదమును భంగమైపోయెను. వారిందుమూలమున మిగుల దుఃఖితులును విషణ్ణులు నైరి. నాభోజనమునకు ప్రత్యేకముగ నేర్పాటులు గావించినందులకు కిశోరిపై నేరముంచిరి. నేను కఠోపనిషత్తుపై వ్రాసిన వ్యాఖ్యానములయెడల సుఖానందుడు అత్యంత అసంతుష్టి కనబరచెను. “ ఈవ్యాఖ్యానములు శంకరాచార్యుని భాష్యమునకు సమ్మతముగ లేవు. అందువల్ల మీవ్యాఖ్యానములు ఆదరణబడయుట లేద”ని నాతోచెప్పెను. బ్రహ్మధర్మ గ్రంథమును హిందీభాషలోనికి అతడు అనువాదముచేసెను. అది నాకు చూపించి ముద్రింపుమని కోరెను. నేనాతనివద్ద సెలవుగైకొనినప్పుడు అతడు నాతో క్రిందికివచ్చి యొకగది చూడుమని కోరెను. నేనాగది ప్రవేశించి చూచితిని. ఎదురుగానున్న గోడపై నొకసుందరమైన పటము వ్రేలాడగట్టబడి యుండెను. దానిమధ్య “ఓం ! తత్ సత్” అని దేవనాగర స్వర్ణాక్షరములతో వ్రాయబడియుండెను. సుఖానందస్వామి అతిభక్తితో నాగదిని ప్రవేశించెను. “కలకత్తావద్దనున్న కాశీఘట్టము

వంటిది మేమీ నదీతీరమున నొక కాశీఘట్టమును నిర్మించితిమి." అని కూడ చెప్పెను. కాని దానిని చూచుటకు నేను రాజాలనని చెప్పితిని.

పిమ్మట ఆయనవద్దనుండి రాణాను-జూచుటకు వెళ్లితిని. ఒక పెద్దసావడిలో కుర్చీలు వేయబడియుండెను సభాసద్గణసమన్వితుడై రాణా నాకు స్వాగతమిచ్చి నన్నొకకుర్చీపై కూర్చుండబెట్టెను. ఇతరులు వేరువేరు కుర్చీలపై కూర్చుండిరి; తుదకొకపిమ్మట కుమారసదృశుడగు రాజకుమారుడు వచ్చి సభాభవన మలంకరించెను. అపుడు రాణాసాహేబ్ నాతోనిట్లనెను, "కుమారుడు కొంచెముసంస్కృతము నేర్చుకొనుచున్నాడు. మీ రాతని కొంచెము పరీక్షింపుడు." ఇది విని కుమారుడు, "నేను వ్యాకరణము సాంతముగ చదివితిని," అనెను. "గంగ, ఉదకము—సంధి కలిపినచో ఏరూపముపొందును?" అని నే నడిగితిని. "గంగోదకం" అని వెంటనే బిగ్గరగా ప్రత్యుత్తర మిచ్చెను. రాణావద్దనుండి సెలవుగైకొని వచ్చి స్నానముచేసి భుజించితిని.

మరునాటి ప్రాతఃకాలము శతద్రునదీతీరమునందు భ్రమణము కొరకు ఒంటిగ బయలువెడలితిని. ఇక్కడ నది కృష్ణనగరమునందలి జలంగీనదియంత వెడల్పుగ నుండెను. దానిజలము సముద్రజలమువలె నీలముగ, ఉజ్జ్వలమై, స్వచ్ఛమై యుండెను. వాల్మీకి తన తమసానదీ జలములగూర్చి చెప్పిన "సజ్జనచిత్తములం బోలి పరిశుభ్రములై" అను ఉపమానము ఇచటి శతద్రునదీజలంబులకుం గూడ చక్కగవర్తించును. నేనొక తోలుదోనె మీద నానది దాటితిని. ఈనదిలో కర్రదోనెలు పనికిరావు. నదిలో మధ్యమధ్య పెద్దపెద్ద శిలలుండెను. తోలు దోనెలు తప్ప నదిదాటుటకు అన్యోపాయము లేదు. ఆవల దరి చేరుసరికి అక్కడ జలము మాంఘీర్‌లోని "సీతకుండ" జలములంత ఉష్ణముగా నుండెను. ఇందలి విశేషాశ్చర్య మేమన—వర్షాకాలమునందు నది క్రమముగా వృద్ధినొంది ఉష్ణజలము స్థానమాక్రమించినట్లే, ఉష్ణజలము

సహితము అభివృద్ధిజెంది ప్రక్కప్రక్కన ప్రవహించుచుండును. తీర మునందలి జలము ఎప్పటియట్ల ఉష్ణముగనే యుండును. అనేకమంది రోగులు ఇచ్చట స్నానముచేయుటకు వచ్చుట చూచితిని. అక్కడ స్నానముచేసినచో అనేకవిధములైన వ్యాధులు ఉపశమించునని వింటిని.

ఈ పర్వతవాసులగు భూస్వాములలో ప్రధానుడు రాజు. తర్వాత రాణా, తర్వాత ఠాకూర్, కట్ట డపట జమీందార్.* ఇక్కడజమీందారులు కృషికులు. ఉత్తరహిందూస్థానములోని జమీందారులు కూడ యిట్టిదశలోనే యున్నారు. పర్వతములందు రాజులు, రాణాలు అధిక శక్తిసంపన్నులు. వీరే ప్రజలకు శాసనకర్తలు. వారల వివాహము లందు సఖీగణసహితముగ కన్యాప్రదానము గావింపబడును. రాణీ గర్భమున జనించిన పుత్రుడు రాజుయో రాణాయో అగును. సఖుల గర్భమున జన్మించిన పుత్రులు రాజపరివారముగానుండి యావజ్జీవము పోషింపబడుదురు. సఖులగర్భమున జనించిన పుత్రికలు రాజకుమార్తె యొక్క సఖులని పిలువబడుదురు. వారిజీవనమును యావనమును రాజకుమార్తె భర్తకు సమర్పింపవలసినవారై యుందురు. ఎంతటి అనర్థము! ఎంతటి అనర్థము! రాజులు, రాణాలు అనేకరాణీలను కలిగి యుందురు. గనుక అనేకమంది సఖులనుగూడ గలిగియుందురు. ఆ ఒక్కభర్త చనిపోయినప్పుడు ఖైదీలవలె నిందరును కారాగారమున యావజ్జీవమును దుఃఖించుచుందురు. వీరికి పరిత్రాణోపాయము లేదు.

నేనక్కడ వారముదినము లుంటిని. పిమ్మట రాణావద్దను రాజ గురువువద్దను సెలవుపుచ్చుకొని సిమ్లాఅభిముఖుడనై పర్వతారోహణము

---

* వంగదేశమునందును, దక్షిణహిందూదేశమునందును జమీందార్ అన్న పద మునకు విశేషభూవసతిగల యొకప్రభువని అర్థము. ఇచట నాపదము అన్యార్థమున వాడబడుట మనకు విచిత్రముగ నున్నది.

చేయనారంభించితిని. కొంతమార్గ మేగినపిమ్మట నొకవనము ప్రవే శించితిని. మృగయాశీలుడైన రాజకుమారుడు రత్నకుండలములు, వజ్రహారము, మౌక్తికమాల, దివ్యవస్త్రములు ధరించి వనమునుండి వనాంతరమునకు వేటాడుచు పోవుచుండెను. సూర్యకిరణములం దాత ని సఫీనముఖమండలము దీప్తివహించి శోభాయమానమయ్యెను. నా కతడొక వనదేవతవలె గన్పట్టెను. ఇట్లొకక్షణమాత్రమతని చూచి తిని. మరుక్షణమున వనమధ్యమున జొరబడి యాతడు మాయమ య్యెను. ఇంతలో తిరిగి చెంతనే గన్పట్టెను. మరలనిట్లు దూరమగుచుం డెను. నేను అతికష్టములో నొకసంకీర్ణ పథమున ఆరోహణముచేసి నిర్విఘ్నముగా సిమ్లాలో నుపస్థితుడనైతిని. ఫాల్గుణమాసమునందు సహితము సిమ్లావీథులలో మంచుపడియుండెను. లతలు, వృక్షములు, సర్వము శుష్కించి నీరసములై యుండెను. గాలి వీచినపుడెల్ల అసా రములైన వెదురుబొంగులవలె నవి కట్ కట్ మను చప్పుడు చేయు చుండెను.

చైత్రము గడచిపోయెను. నానాసుపుష్పశోభితమై యావ ద్భూమియు నొక్కమనోహర ఉద్యానభూమిగా మారిపోయెను. మరి యొక నూతనవత్సరమును దర్శించితిని. గత వైశాఖమునందు ప్రథ మమున ప్రవేశించిన గృహమునందే ఒక్కసంవత్సరముగడచిపోయెను. ఇప్పుడీ బజారులోని గృహము వదలి పర్వతముపై నాకుమిక్కిలి యిష్ట మగు నొక సురమ్యనిర్జనస్థానమునందొక బంగళాను అద్దెకు తీసికొం టిని. ఆపర్వతముపై నొక్కవృక్షము మాత్రముండెను. ఆనిర్జనవాస మున నదియే నాకు మిత్రమయ్యెను. ఈ వైశాఖమాసమునందు మధ్యాహ్న భోజనానంతరమున ఆనందముతో నచటి ఖాళీగృహముల యందలి ఉద్యానవనములయందు విహారము చేయువాడను. వైశాఖ మాసమునందు మట్టమధ్యాహ్న వేళ ఎండలో పెద్ద ఉన్నిటోక్కాను

ధరించి షికారుచేయుచుండలి మహారహాస్యమును నాదేశీయులగు వంగదేశీయు లెట్లెరుంగగలరు ? నేనొక్కొక్కప్పుడు ఒకనిర్జన పర్వత పార్శ్వమున నొక శిలాతలమున కూర్చుండి ధ్యానమునందు మగ్నుడనై ఒక్కపూట అంతయు గూడ నట్లే గడపువాడను.

ఒకనాడిట్లు సంచరించుచుండగా ఒకవనాకీర్ణపర్వతము మధ్య నుండి యొకదారి కనబడెను. ఆదారిని బట్టి నడువసాగితిని. అప్పుడు మధ్యాహ్నము నాలుగుగంట లయినది. నేను తదేక మనస్కుడనై అట్లే ఆగకుండ నడువనారంభించితిని. అడుగుమీద అడుగు పడుచుం డెను; గాని నాకది తెలియలేదు. నే నెక్కడికివెళ్ళుచుంటినో, ఎంత దూరమువచ్చితినో, ఇంక నెంతదూరము వెళ్ళుదునో, ఏమియు గమ నించలేదు. చాలసేపైనపిమ్మట నొకపథికుడు నాకెదురుగవచ్చెను. అందువల్ల నాధ్యానము భంగమైపోయెను. వ్యక్తి వచ్చెను. అప్పటికి సంధ్యాకాలమయ్యెను. సూర్యుడస్తమించెను. నాకుతిరిగి స్మరణ వచ్చెను. ఈవచ్చిన దూరమంతయు తిరిగి వెనుకకు పోవలయునుగదా! త్వరితవేగముతో వెనుకకు మరలితిని. చీకటికూడ త్వరితవేగముతో వచ్చి నన్నావరించెను. గిరి, వనము, కాననము, సర్వమును అంధకారము తో ఆచ్ఛన్నముగావింపబడెను. ఆయంధకారమునందొకదీపమువలె నర్ధచంద్రుడు నావెనువెంట రాసాగెను. ఏదిక్కునుండియు ఏశబ్దమును వినబడుచుండుటలేదు. కేవలము నాయడుగులధ్వని మాత్రము మార్గ మునందలి శుష్కపత్రములపై బడబడ లాడసాగెను. భయముతో పాటు నామనస్సునందొక గంభీరభావ ముదయించెను. రోమాంచిత శరీరుడనై ఆవనమధ్యమున నీశ్వరుని నేత్రముల గాంచితిని. ఆయన అనిమేషదృష్టి నాపై ప్రసరింపబడియుండెను. ఈసంకటపథమునం దాతని చక్షువులే నాకు నేతలయ్యెను. నానాభయములమధ్య నిర్భీతు డనై రాత్రి 8 గంటలకు ఇల్లుచేరితిని. ఈశ్వరుని యీదృష్టి చిరకా

మువరకు నాహృదయమునందు నాటుకొనియుండెను. నేనెప్పుడు ఏకష్టములలో పడినను ఆనేత్రములు నాకు గన్పట్టుచుండును.



ముప్పదియేనిమిదవ ప్రకరణము.



మరియొకసారి శ్రావణ భాద్రముల మేఘముల యొక్కయు విశృంఖలతలయొక్కయు ఆడంబరము ప్రాదుర్భూత మయ్యెను. నిరంతర ధారావృష్టి పర్వతముల సమాకూలముచేసెను. ఆ యక్షయ పురుషుని శాసనమువల్ల పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు, యథావిధిగ సంచరించుచుండును. ఆయన శాసనముల నెవ్వరు నతిక్రమింపనేరరు. ఈసమయమున నేను కందరములయందును, నదీ ప్రస్రవణముల నవనవ విచిత్ర శోభనుచూచుచును సంచరించుచుంటిని. ఈవర్ష కాలము నందిక్కడి నదుల వేగమువల్ల మహాశిలలు సహితము ప్రవాహమునందు కొట్టుకొని పోవుచుండును. ఏవియును వీనిప్రమత్త వేగము నాటంకపరుపలేవు. ఏవైనను వీనికడ్డు పచ్చిన యెడల నది వానిని మహాశక్తిచే దూరముగావించి బ్రద్దలుకొట్టును.

ఆశ్వయుజమాసము నందొకనాడు కొండ క్రిందుగా ఒక నది సేతువు పైన నిలబడి దాని స్రోతముయొక్క అప్రతిహతగతియు, ఉల్లాసమయమైన సుడిగుండములను చూచి చూచి విస్మయ నిమగ్నుడనైతిని. ఆహా! ఇక్కడ యీనది ఎంత నిర్మలముగను శుభ్రముగను ఉన్నది! దీనిజలమెంత స్వాభావిక పవిత్రతను, శీతలతను కలిగియున్నది! ఎందులకిది తనపవిత్రభావమును పరిత్యజించుటకు క్రిందికంత వేగముతో ధావమానమగు చున్నది. ఈనది ఎంతక్రిందికి వెళ్ళునో అంత విస్తారముగ నీపృథివియొక్క క్లేదమును, ఆవర్జనమును

దీనిని మలినమును, కలుషితమును గావించును. అయినను ఎందులకిట్లు ఆదిక్కునకే ప్రబలవేగముతో పరుగిడు చున్నది? అవును, కేవలము తన స్వార్థమునకై సుస్థిరముగ నొక్కచో నుండుటకు దానికేమి హక్కుగలదు? ఆసర్వనియంతయొక్క శాసనమువల్ల పృథ్వీకర్దమముతో మిళితమై యీవద్భాభుని సారవంతముగను, సస్యశాలినిగను ఒనర్చుటకు తనజౌన్నత్యమును పరిత్యజించి నిమ్నగామినియై ప్రవహింపవలసి యున్నది.

ఈప్రకారము నేను భావనలో మునిగి యుండగా నకాత్తుగ నాఅంతర్యామి యొక్క గంభీరాదేశవాణిని వింటిని—“నీవీగర్వభావమును పరిత్యజించి ఈనదివలెనే నిమ్నగామినికమ్ము! నీవిక్కడ ఏసత్యమును పొందితివో, ఏనిర్భరమును నిష్ఠయు నేర్చికొంటివో, వాటిని పృథివికి పోయి ప్రచారముచేయుము!” నేనులికిపడితిని. ‘అయినచో నేనీపుణ్యభూమిని, ఈహిమాలయములను వదలిపోవలెనా ఏమి? ఇట్లెన్నడును తలంచ లేదే! ఎంత కఠోరత్వమునో వహించి, సంసారమునుండి ఉపరతుడనైతిని. మరియొకసారి సంసారమున బంధింపబడి అందరితో కలియవలయునా?’ నామనస్సు నిమ్నగతిని పొందెను. సంసారము తలంపునకు వచ్చెను. మరల నింటికి తిరిగి వెళ్ళవలెను. సంసార కోలాహలముతో నాకర్ణములు బధిరములై పోవును కాబోలు! ఈ భావనలతో నాహృదయము శుష్కమై పోయెను. మ్లానభావముతో నింటికి తిరిగి వచ్చితిని.

రాత్రి నానోటకేదియు పాట రాకుండెను. వ్యాకుల హృదయముతో శయనించితిని. బాగుగ నిద్రపట్టలేదు. రాత్రి యింకన ఉండగనే లేచితిని. హృదయము కంపించుచుండెను. నాడి దడదడ కొట్టుకొను చుండెను. నాశరీరమునకు మున్నెన్నడును యిటువంటి అవస్థ ఘటిల్లలేదు. ఏదైన తీవ్రజాడ్యము బయలుదేరునేమో య

భయపడితిని. షికారువెళ్ళిన బాగుండునేమోయని బయలుటకు పోతిని. చాలదూరము నడచితిని. సూర్యుడుదయించెను. గృహమునకు తిరిగి వచ్చితిని. అయినను నాహృదయము కొట్టుకొనుట మానలేదు. అప్పుడు కిశోరిని పిలచి, "కిశోరీ, నేనింక సిమ్లాలో నుండను. ఒక సవారి రప్పింపుము" అంటిని. ఈమాటలు చెప్పుచుండగా నాహృదయకంపము ఆగిపోయెను. అయినచో ఇదియేనా నాకౌషధము? నేనాదినమంతయు నింటికి పోవుటకు స్వయముగ నుద్యుక్తుడనై వలయు నేర్పాటుల్ల గావించు కొనసాగించితిని. దీని వల్ల నేను విరామము నొందితిని. నా హృదయకంపము పూర్తిగా ఆగిపోయెను. నేను స్వస్థత జెందితిని.

నే నింటికి పోవలెనని యీశ్వరాదేశము. ఈ ఉద్దేశమునకు విరుద్ధముగ మనుష్యుని ఇచ్ఛ వ్యవహరింప గలదా? ఈ ఆదేశమునకు కొంచము విరుద్ధముగ నే నుద్దేశించు సరికి నాశరీర ప్రకృతియు నాకు విరుద్ధముగ నిలబడినది. అంత బలీయ మాయన యాజ్ఞ! "అంతరమునందలి ఆజ్ఞ సర్వశక్తివంతము. బాహ్యమునందలిది కేవల శుష్కము." * నేనింక సిమ్లాలో నుండగలనా? నాయింద్రియము లప్పుడు నాతో నిట్లను చుండెను: "ఈరెండు వత్సరములనుండియు మాకెంతకష్టము నిచ్చితివి! ఎంతసాధ్యసాధనల గావించినను, మా నిర్దోష ప్రవృత్తుల నొకటినైన సంతుష్టి చెందింపవైతివి. ఇప్పుడు మేమింక దుర్బలులమై పోతిమి. ఇంక నీ శుశ్రూష చేయజాలము." నాశరీరము దుర్బలమైనను సరే, సబలమైనను సరే. నేనింక సిమ్లాలో నెట్లుండగలను? ఆయనచిత్తమే నాశాసనము. అయన యిచ్ఛతో నాయిచ్ఛను మిళితముచేసి ఇంటికి పోవుటకు సిద్ధపడితిని. నామనస్సు

* "హుకుం అందర్ సబ్ కోయ్ ।
బహార్ హుకుం నా కోయ్." ॥

బలీయమయ్యెను. మార్గమున నింకయు ననేక భయములుండెను. అక్కడక్కడ విద్రోహదళములు దాగియుండెను. కాని ఆ భయములకు నా మనసున స్థానమీయలేదు. నదీప్రవాహ మేవిధముగ నప్రతిహతవేగమున ప్రస్తారాటంకముల సరకుగొనక నిరాఘాటముగ దొర్లిపోవుచున్నదో నదేవిధమున నేనును ఏ యాటంకముల సరకుగొనలేదు.

కార్తిక శుద్ధ పాడ్యమినాడు * (విజయదశమి) సిమ్లాబజారు వీధియందు నా సవారి, డోలి, గుర్రము, సర్వము సిద్ధముగనుండెను. నాస్వదేశీయులును, మిత్రులును అతిదుఃఖముతో నన్ను సాగనంపుటకు నాచుట్టును జేరియుండిరి. అందరివద్ద సెలవు గైకొని సవారియెక్కి బయలుదేరితిని. విజయదశమినాడు సిమ్లా నన్ను విసర్జనచేసెను. కొండదిగుట అతిసులభము. త్వరలోనే పర్వతపాదముననున్న కాల్కా (Kalka) చేరితిని. రాత్రి గడచి పోయెను. ప్రభాతమున శోభామయమగు సూర్యోదయమును చూచితిని. దానితో నా మనస్సు ఉజ్జ్వలమయ్యెను. పిమ్మట కాల్కావదలి పాంజోరు వచ్చితిని. ఇక్కడ నొకతోటలో కొన్ని ఘనచిత్రముల గాంచితిని. అందు వందల కొలది ఊటలనుండి జలధార లెగిరి పడుచుండెను. అవన్నియు నవజీవనము నొందినట్లు మహోల్లాసముతో జలము నుద్గీర్ణముగావించుచుండెను. వాటి యనవరత వృష్టిచే నవి వర్షఋతువు ననుకరించుచుండెను. ఇట్టి సుందరములగు నీటి యూటల నిదివరలో నే నెన్నడు గాంచలేదు.

---

* వంగదేశవాసులు సూర్య సిద్ధాంతము నవలంబింతురు. కావున వారి కార్తిక శుద్ధ పాడ్యమి మన చాంద్రమానరీతిని విజయదశమి యగును. ఇంతకుముందు వ్రాయబడిన తిథులు గూడ వారి సాంప్రదాయము ననుసరించి యే వ్రాయబడినవి.

ఇక్కడనుండి అంబాల వెళ్లి అక్కడ నొక గుర్రపు బండి అద్దెకు తీసికొంటిని. దానిపై రాత్రింబవళ్ళు ప్రయాణముగావింప నారంభించితిని. రాత్రులు జ్యోతిష్మయములై యుండెను. ఆకసమున శరత్కాల చంద్రబింబము వికసితమై యుండెను. సస్యక్షేత్రముల నుండి శీతల మారుతములు వీచుచుండెను. బండిలోనుండి బయటకు చూడగా కొందరు గుఱ్ఱపు రౌతులు నా బండిప్రక్కను స్వారిచేయు చుండుట గాంచితిని. విద్రోహుల భయముచే గవర్నమెంటువారు ప్రయాణస్థుల క్షేమముకొరకు రాత్రివేళల బండ్లతో గుర్రపు రౌతులు స్వారిచేయుచుండునట్లు నియమించిరి. దీనిని బట్టి నేను మార్గమునందలి అపాయములను తెలిసికొని కొంచము భయము జెందితిని. మట్టమధ్యాహ్నమువేళ కాన్పూరు ప్రాంతమున ఒకస్థానమునందు గుర్రముల బదలాయించుటకుగాను నాబండి యాగెను. అక్కడనొక పొలములో ననేక గుడారములు వేయబడి యుండెను. జనులు విస్తారముగ చేరి యుండిరి. అక్కడ నొక బజారు పెట్టబడియుండెను. కొంచెము ఆహారము కొరకు కిశోరి నచటకు పంపితిని. అతడక్కడ నుండి నాకు గేదె పాలు తెచ్చి యిచ్చెను. "ఇది యేమి బజారిక్కడ?" అని అడిగితిని. ఆతడు "ఢిల్లీ పాదుషాను ఖయిదీగా పట్టుకొని పోవుచున్నారు. అది ఈబజారు పెట్టిన కారణము," అనెను. నేను సిమ్లాకు పోవునప్పుడు ఈతడు యమునాతీరమున హాయిగ గాలిపడగ లెగరవైచుకొను చుండెను. ఇప్పుడు నేను తిరిగి వచ్చుసమయమున ఈతడు బంధింపబడి కారాగారమునకు గొంపోవబడుట గాంచితిని. ఈక్షణభంగురమైన దుఃఖమయప్రపంచమునందు ఎవరిభాగ్యమునకు ఎప్పుడేమి ఘటించునో ఎవరు చెప్పగలరు !

సిమ్లానుండి విపత్సంకులమైన అతిదీర్ఘపథము నతిక్రమించి కాన్పూర్ చేరితిని. అప్పుడిక్కడనుండి రైలుమార్గము తెరువబడి

యుండెను. ఉదయముననే 6 గంటలకు బండి వెళ్ళునని వింటిని. నేను తెల్లవారు జాముననే లేచి కొంచెము తేనీరు పానముచేసి త్వర త్వరగా స్టేషనుకు వెళ్ళితిని. 7 గంటలయినది. కిశోరి స్టేషన్ వద్ద నుండి తిరిగి వచ్చెను. టిక్కట్లు దొరకవని చెప్పెను. "నేడు రైలులో గాయములు చెందిన సైనికులు పోవుచున్నారు. ఇతరులకు జాగా లేదు," అనెను "నేను స్వయముగ ననుసంధానము చేయుటకు స్టేష నులోనికి ప్రవేశించితిని. ఒక బంగాళీ స్టేషనుమాష్టరు నన్ను చూచి "ఓహో, తమరా!" అని రైలునాపి, "ఇంకా ఎవ్వరో అనుకొంటిని, "తమకు నేను టిక్కెట్టు యిచ్చెదను. బండి ఆపి మిమ్ములను రైలు ఎక్కించుటకు నాకధికారమున్నది. నేను మీ తత్వబోధినీ పాఠశాల యొక్క పురాతన శిష్యుడను. పరీక్షలలో నన్ను చాల సారులు తమరు పురస్కరించిరి. నాపేరు దీననాథ్" అని చెప్పెను.

నాకతడొక టిక్కట్టునిచ్చెను. నేను కెప్టెన్ సాహేబులతోబాటు ప్రథమతరగతిబండిలో నెక్కి కాన్‌పూర్ విడచితిని. 3 గంటలకు అలహాబాదు చేరితిని. అప్పటికి అక్కడ స్టేషను నిర్మింపబడియుండ లేదు. మార్గమధ్యమున నొక రోడ్డువద్ద బండి నిలచెను. మేము దిగి నడచిపోతిమి. మూడుకోసులు దూరము పోయినపిమ్మట అలహా బాదు డాక్ బంగాళా చేరితిమి. అక్కడ గదులన్నియు మనుష్యులతో నిండియుండెను. నాకక్కడ స్థానము దొరకలేదు. నావద్ద నొక కుర్చీ యుండెను. నే నొక చెట్టుక్రింద నాసామానుంచుకొని ఆకుర్చీపై కూర్చుంటిని. కిశోరి డాక్ బంగాళావద్దనుండి నాకొక కూజాతో జలము తెచ్చెను. నేను కిశోరితో "ఊరిలోనికి వెళ్ళి నాకొక యిల్లు కుదిర్చి నన్నిక్కడనుండి గొంపోవుము. గృహములోనికి ప్రవేశించకుండ మంచినీళ్లైనను స్పృశింపను," అంటిని. కిశోరి వెళ్లెను. తర్వాత కొంచె ము సేపటికి ఒక బండి వచ్చియుండెను. మెడకు బట్టలు చుట్టుకొని

యుండిన యిద్దరు మనుష్యులు బండి దిగి వచ్చి నాతో యిట్లనిరి, "కోట చెంత మా 'లాల్‌కూటము'న్నది; మహాశయా, అనుగ్రహించి మీర క్కడ నుండెదరేని మేము మిగుల కృతార్థులమయ్యెదము. ఇప్పుడు మా పితృమరణదినము." నేను వారితో ఆగృహమునకు పోతిని. వారికొక గృహదేవత యుండెను. అతని నైవేద్యములోనుండి నాకు సాయంకాలము రొట్టెలు పప్పు నచ్చెను. నేనప్పుడు మిక్కిలి ఆకలితో నుంటిని. నేనా రొట్టె పప్పు మిక్కిలి యిష్టముతో భుజించితిని. తృప్తి పూర్వకముగా నదంతయు భుజించి ఇంకను వచ్చునని యాశించితిని. కాని నన్నెవ్వరు నడుగలేదు. నేనాప్రసాదమును భుజించి నాటికక్కడ విశ్రమించితిని.

## ముప్పదితొమ్మిదవ ప్రకరణము.

మరునాడు అలహాబాదు వీధులందు పథికుల కీరీతిగ ప్రకటన లుండెను. "ఎవరైనను పూర్వదిక్కునకు దూరముగ వెళ్ళగోరెదరేని, వారి ప్రాణములకు గవర్నమెంటువారు ఉత్తరవాదులు కారు" ఈ ప్రకటన చూచి నా మనస్సు విశేషము కలగెను. దినాపురమందు కుమారసింగనను యుద్ధము చేయుచుండెనని వింటిని. భూమార్గ మిన్ని విపత్తులతోకూడి యుండినచో, జలమార్గమున పోవుట ఎక్కువ సురక్షితముగా నుండదా అనుకొంటిని. ఇట్లు భావించుచు నేను గంగాతీరమునకు విహారార్థము పోతిని. పోయి చూడగా ఒక స్టీమరు నుండి ధూమముగ వచ్చుచుండెను. అది అప్పుడు బయలు దేర బోవు చుండెను. నేను పరుగెత్తి దానిపై నెక్కితిని. స్టీమరెక్కడికి వెళ్ళు నని కెప్టను నడిగితిని. అతడిట్లని ప్రత్యుత్తరమిచ్చెను, "ఒకస్టీమరు కొంచెముదూరమున గంగామధ్యమున ఇసుకమెట్టకు తగుల్కొనెను;

దానిని తప్పించుటకుగాను యీస్టీమరక్కడికి వెళ్ళుచున్నది. ఇక్కడికి తిరిగి వచ్చి మూడుదినములైనపిమ్మట కలకత్తాకు వెళ్లును." అప్పుడు నేనందులో నొకగది నద్దెకు తీసుకొనవలెనని నా ఆశ్రమును తెలియ జేసితిని. రోగులను, గాయముచెందినవారిని సైనికపురుషులను కలకత్తా తీసుకొనిపోవుటకుగాను ఈ స్టీమరును గవర్నమెంటు అద్దెకు తీసికొని పథికులకు గదులు దొరకవు. కాని నీవు సైన్యాధ్యక్షుని వద్ద నుండి హుకుం తీసుకొని రాగలిగినచో నిన్ను తీసికొని వెళ్ళగల్గుదుము," అని అతడు చెప్పెను.

ఆతని యుపదేశానుసారము చాలసేపు వెదకి వెదకి పిమ్మట నాసైన్యాధ్యక్షుని కార్యాలయమును, ఒకపెద్ద బంగాళాను చేరితిని. అప్పుడాయన ఇతరకార్యములతో చాల తొందరగనుండి నన్ను మరు నాడుదయమున రమ్మనెను. ఉదయ మనిన ప్రభాతవేళయో లేక 10 గంటలవేళయో తెలిసికొనలేక నేను ప్రభాతముననే ఆయన ద్వారమున నుపస్థితుడనైతిని. కూర్చుండగా, కూర్చుండగా పదిగంటల య్యెను. అప్పుడాయన తన ఆఫీసుకు నన్ను పిలచెను. నే నాయనవద్ద నామనవి వినిపించితిని. ఆయన యిట్లనెను, "ఈ స్టీమరులో సైనికపురుషులు వెళ్ళుదురు. వారితో బాటు వారి భార్యాపుత్రపరివారమునకు తప్ప యితరులకు స్థానముదొరకదు." నేను, "భూమార్గమున పథికులు ప్రయాణము చేయరాదని గవర్నమెంటువారు నిషేధించిరి. జలమార్గమున గవర్నమెంటువారి మనుష్యులతో సురక్షితముగా నాకు అవకాశము దొరకుచున్నది; మీరు నన్నెందుకు వెళ్ళనివ్వరాదు?" నేను విద్రోహిదళములలో నొకడనేమోయని ఆయన మొదట అనుకొనెను. నామాటలువిని ఆయన నాసమాచారముఅడిగెను.సిమ్లాలో హేంప్రభువు మొదలగువారితో నాకు పరిచయముండెనని తెలియజేసి నాయావద్వృత్తాంతము చెప్పితిని. అప్పుడు నాకొక గది యివ్వవలసినదిగా

స్టీమరు కెప్టనుకు ఉత్తరమిచ్చెను. ఈలోగా స్టీమరు తిరిగివచ్చి కలకత్తా వెళ్ళుటకు సిద్ధముగ నుండెను. నేనువెళ్ళి కెప్టనుకు ఆయుత్తరమిచ్చితిని. కాని యిప్పుడు కెప్టను యిట్లనెను: "ఈ యుత్తరము ప్రయోజనమేమి? స్టీమరులో గదులు ఖాళీ లేవు; నీకు గది యెట్లివ్వగలను? "గదులు ఖాళీ లేనిచో స్టీమరుపైభాగమున నైనను ప్రయాణముచేసెదను. అద్దె మాత్రము గదిఅద్దెయే తీసికొని అట్లు వెళ్ళనిమ్ము" అంటిని.

స్టీమరుతోనున్న సామానుపడవ కెప్టను, మా వితండము నాలకించి, మావద్దకువచ్చి "స్టీమరులో గదిలేదు, కాని నా పడవలోనున్న గదికి అద్దె యిచ్చినచో నేనది యిచ్చుటకు సిద్ధముగ నున్నాను," అనెను. నేను, "సరే, సొమ్ముయిచ్చెదను, నీగది నాకు విడువు"మంటిని అతడు "నీసామాను కొనిరమ్ము, నే నీలోగా గది సిద్ధపరచి యుంచెదను," అనెను. అప్పుడు నే నామాటలు విని ఎంతయో ఆహ్లాదపడి పరుగుపరుగున ఇంటికి పోయి నా సమస్తవస్తువుల గొనివచ్చితిని. చిరసుహృదుడైన నీలకమలమిత్ర మార్గమున భుజించుటకుగాను నాకొక బుట్టలో మిఠాయి నిచ్చెను. అది నాకు బహు ఉపకార మొనర్చెను.

స్టీమరు త్వరలో కలకత్తా అభిముఖమై బయలుదేరెను. కాని కాశీ చేరుసరి కొక విఘ్నమువచ్చెను. ఈ సామానుపడవకొరకింకొక స్టీమరు వచ్చుచున్నదనియు, ఇది వెనుకకు పోయి మరియొక సామానుపడవ తెచ్చుకొనవలెననియు కెప్టనుకొక తంతివార్త వచ్చెను. కెప్టను ఈ టెలిగ్రామునందుకొని మిక్కిలి కోపించి యిట్లనసాగెను. "నేనింక గవర్నమెంటు చాకిరీ చెయ్యను. గవర్నమెంటువా రెప్పుడేమి ఉత్తరువు నిత్తురో ఎవరికి తెలియదు. ఇంతదూరము వచ్చినపిమ్మట వెనుకకు పొమ్మనుట మాత్రము మిక్కిలి దుర్న్యయము." కెప్టను కింటికి పోవలయునని మిక్కిలి యాతురతగానుండెను. సామానుపడవవదలి స్టీమరుపైనున్న ఉద్యోగులు, స్త్రీలు సహితము వెనుకకు పోవలసి యుందురు.

కావున్న వారందరు కలిసి యోచించి సామానుపడవను ఆ స్థానమునందే విడిచిపెట్టవలయునను అర్థము టెలిగ్రాములో లేదని స్థిరపర్చి ఆరెండవ స్టీమరు కలుసుకొనినప్పుడు సామానుపడవ నిచ్చి వెనుక కప్పుడు వెళ్ళ వచ్చునని నిర్ధారణచేసిరి. ఈలోగా కలకత్తా చేరినను చేరవచ్చును. ఈ ఆలోచనకు కెప్టను ఒప్పుకొనెను. కలకత్తా వైపునకు స్టీమరు తిరిగి బయలుదేరెను.

స్టీమరులో పోవుచుండగా మార్గమున, నా కనిష్టసోదరుడైన నగేంద్రనాథుని మరణవార్త వింటిని. ఈవార్తవల్ల శోకావిష్టహృదయుడనై, అన్యమనస్కుడనై, యేదో వస్తువు తెచ్చుటకు స్టీమరుపైనుండి దిగి గదిలో ప్రవేశించితిని. ఆవస్తువు తీసుకొని తొందరగా గది బైటకు రాగా నా పాద మానుకొనుటకు స్థానము దొరకలేదు. నేను వెంటనే రెండవ అడుగు పెట్టకుండగనే వెనుకకు వ్రాలి గదిలో బడితిని. కళాసులు హాహాకారవములతో పరుగు పరుగున వచ్చి నాపాదమొకటి స్టీమరుయొక్క అధోభాగమున కుండు కన్నములోను మిగిలిన శరీరము గదిలోను పడియుండుట గాంచిరి. "సామానులు దింపుటకుగాను గది ముందున్న బల్లలు తీసివేసితిమన్న సంగతి మీరెరుగరా?" అనిరి. నేనది చూడలేదు. పూర్వమువలెనే దారి సరిగానున్న దనుకొంటిని. నేనింకొక అడుగు పెట్టినయెడల యేబదిమూరలు క్రిందికి బడి యుందును. నాతలబ్రద్దలై చూర్ణమైయుండును. ఆదినమునా ప్రాణములు దక్కెను. కాని

"ప్రపంచచోరుడు నిద్రించి యుండలేదు. ఆతనిబారినుండి సురక్షితుడవై యున్నావని తలంపకుము. ఈదినమతడు దొంగిలింపక పోయినచో మఱియొకదినమున దొంగిలించును *

* "రహ్జనే దహర్ నఖుఫ్తస్త మషౌ ఐమన్ అజో ।
అగర్ ఇమ్రోజ్ నబ్రిదాస్త్ కెఫర్దా బబురద్" 'హాఫీజ్'

రాంపూర్, బో ఆలియా, సమీపించుచుండగా ధూమమేఘములను గ్రక్కుచు నొక స్టీమరు వచ్చుచుండెను. దాని చూచి కెప్టను మా స్టీమరు ఆపెను. వచ్చుచుండిన స్టీమరు కూడ ఆగెను. రెండుస్టీమర్లును అక్కడ లంగరువేసెను. ఉద్యోగులును, స్త్రీలును ఆస్టీమరు చాలచిన్నది గావున తమకందరకు స్థానముండదని గాంచిరి. పురుషులెట్లయినను పైభాగమున సర్దుకొందురు, కాని స్త్రీ లేమిచేతురు? కెప్టను సామానుపడవలో నున్న మిలిటరీసర్జన్ మొదలగు పురుషులందరి వద్దకు వెళ్లి వారి గదు లిమ్మని కోరెను. మిలిటరీ సర్జను కొంచెము స్పష్టనాది. ఆయన యిట్లనెను. "నేనీరీతిగా స్త్రీలను సంతోషపెట్టుట కనేకసార్లు గదులు విడిచిపెట్టితిని, కాని వారివద్దనుండి ఒక్క "వందన" మన్నమాటనైనను పొందియుండలేదు." పురుషులెవ్వరును స్త్రీలకు గదుల నివ్వకుండుటచే చిట్టచివరకు కెప్టను నావద్దకువచ్చి, "స్త్రీలకు తావులేదు. మీగది విడువ గలిగినచో వారుమిక్కిలి కృతజ్ఞులయి యుందురు" అనెను. నే నతిఆహ్లాదసహితముగ నాగది వారికొరకు ఖాళీ చేసితిని. కెప్టన్ అందుకు మిక్కిలి సంతుష్టాంతరంగుడై "ఆంగ్లేయులు తమ దేశీయులైన స్త్రీలకు సహితము స్థానమివ్వలేదు. మీరెంత ఉదారభావముతో వారికొరకు మీగది విడిచియిచ్చిరి! ఇందులకు మేమందరము మీయెడల విశేషకృతజ్ఞత కలిగి యుందుము." గది విడిచినందుకు నాకే కష్టము కలుగలేదు. స్టీమరుపైభాగమున సుఖముగా నుండుటకు కెప్టన్ మొదలయిన వారందరు కలసి చక్కని ఏర్పాటులు గావించిరి. నేనచ్చట ముక్తవాయువులో సుఖనిద్ర ననుభవించితిని. రాంపురమందు స్టీమరు మార్చుటకును ఇతరయేర్పాటులు గావించుటకును కొంతయాలస్యముండును. గావున నేవచ్చుసమాచారము చెప్పుటకుగాను ముందుగా 'కిశోరి' నొక డింగీమీద గృహమున కంపితిని.

ఆ మరునాఁడు మార్గశిర పాడ్యమినాఁడు, (1858 వ సంవత్సరః లో) నేను నిర్విఘ్నముగా కలకత్తాలో నుపస్థితుడనైతిని. అప్పు నాఁవయస్సు 41 సంవత్సరములు.

"నాజీవితకాలములో నీ దయను మరువను. రాత్రింబగ నాహృదయమునది చుట్టుకొనియుండును." *

ఓం! నమస్తేస్తు బ్రహ్మాన్, నమస్తేస్తు!




* "కోతో కేతో మాగ్ కోం, ణాంధు ... జీవనే
నిశిదిన్ రాఖిబో గాంధే హృదయే — కోతో జేతో మాగ్ కొరుణా,,